# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 11 సంచిక : 2 హైదరాబాద్ 139 ఫిబ్రవరి 2013 పేజీలు : 68 రు. 15

- ✲ మహిళలపై అత్యాచారాలు - ఆందోళనలు
- ✲ మోడీ గెలుపు - లౌకికవాదులకు సవాల్
- ✲ తెలుగు మహాసభల ప్రజా వ్యతిరేకత
- ✲ కార్పొరేట్ల కీలుబొమ్మ ప్రభుత్వాలు
- ✲ ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా చరిత్ర
- ✲ ఎస్.సి., ఎస్.టి. సబ్ ప్లాన్
- ✲ ఆహార భద్రతకు ముప్పు బయో డీజిల్

# వీక్షణం దశాబ్ది సంచికపై చర్చాగోష్ఠి, జనవరి 8, 2013







139

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

ఫిబ్రవరి 2013
సంపుటి : 11
సంచిక : 2

| వ్యవస్థాపక సంపాదకులు : | సంపాదకులు : | కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్ : | ఆఫీస్ అసిస్టెంట్ : |
|---|---|---|---|
| వి. హనుమంతరావు | ఎన్. వేణుగోపాల్ | వై. రామచంద్రం | ఎస్. వెంకటేష్ |


## లోపలి పేజీల్లో...



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.


ప్రింటర్స్
డక్కన్ ప్రెస్ /
చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191



'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com


### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రేరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ - 013911011002175
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు ANDB 000/0139 నెంబర్ రాసి వేయవచ్చు.

వీక్షణం ప్రత్యేక సంచిక ఒక డాక్యుమెంట్. సంచికలోని అన్ని వ్యాసాలు సుదీర్ఘంగా ఉన్నప్పటికీ విజ్ఞానదాయకంగా ఉన్నాయి. 'చలనంలో విషయం – చలనంలో అధ్యయనం', ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ పరివర్తన (1970–2010)పై మావోయిస్టుల విశ్లేషణ, మూడు దశాబ్దాలలో వ్యవసాయ రంగంలో పెను మార్పులు వచ్చినా ఉత్పత్తి సంబంధాలలో గుణాత్మకమైన మార్పులు లేవు. గ్రామాల నుండి విపరీతంగా నగరాలకు వలసలు పెరిగాయి. రైతుల ఆత్మహత్యలలో మన రాష్ట్రం దేశంలో రెండవ స్థానం, మహోజ్వల చారిత్రక కార్మికోద్యమం వ్యాసం వందేళ్ల కార్మిక పోరాటాలను చాలా వరకు వ్యాసంలో రచయిత పొందు పరిచారు. మహిళా ఉద్యమ చరిత్ర, అన్ని వ్యాసాలు కూడా అధ్యయనం చేసి రాశారు.

**– తుంపాల శ్రీరామమూర్తి**
*గాజువాక, విశాఖపట్నం*

వీక్షణంలో ఇతర విజ్ఞానదాయకమైన వ్యాసాలతో పాటు తప్పనిసరిగా శాస్త్ర విజ్ఞానాన్ని, సాంకేతిక పరిజ్ఞానాన్ని పరిచయం చేసే వ్యాసాలు కూడా ఉండాలి. కొడవటిగంటి రోహిణీప్రసాద్ వ్యాసాలు చాలా ఉపయోగకరంగా ఉండేవి. ఇటీవల జి. రామదేవుడు వ్యాసాలు కూడా చాలా తెలుసుకోవలసిన విషయాలను తెలిపాయి. ఇక ముందు కూడా ప్రతి సంచికలోను అటువంటి వ్యాసాలు ఉండేట్టు చూడండి.

**– జి. జె. దానియేల్**
*భౌతిక శాస్త్ర ఉపాధ్యాయుడు, నిర్మల్*

వీక్షణం అక్టోబర్ 2012 సంచికలో పాణి రాసిన 'కసబ్.. మా దేశభక్తి ముందు నీవెంత?' వ్యాసం సారాంశం ఏమిటి? మొత్తం వ్యవస్థ దోపిడీ స్వభావానికీ, ఒక విదేశీ టెర్రరిస్టు చర్యకూ లింకుపెట్టి రాయడం వలన పాఠకులకు ఏం చెప్పదల్చుకున్నారు? రాజ్యాంగం, ఉరిశిక్ష రద్దు వంటి వాటిపై చర్చించడానికి 'కసబ్' ఉదంతం సరైంది కాదు. వ్యవస్థ దోపిడీ స్వభావాలతో, ఒక ప్రత్యక్ష విచ్చలవిడి హత్యాకాండను జతచేసి చర్చించడం వలన ప్రజలకు తప్పుడు సందేశాన్నిచ్చినట్లవుతుంది. ఇదే ధోరణి 'వీక్షణం' డిసెంబర్ 2012 సంచిలో ఎడ్ల పోచయ్య వ్యాసంలోనూ కనిపిస్తుంది. దోపిడీ వ్యవస్థను విశ్లేషించి విమర్శించడానికి 'కసబ్' వంటి సంఘటనల్ని ఉదహరించడానికి బదులు మన దేశంలోని విప్లవ కార్యకర్తలకు సంబంధించిన ఉదాహరణలు పేర్కొంటే అర్థవంతంగా ఉంటుంది. ఈ విషయంపై ఇంకా ఎక్కువ రాయడం అనవసరంగా భావిస్తూ, నేను ఏం చెప్పదల్చుకుంటున్నానో రచయితలు అర్థం చేసుకుంటారని ఆశిస్తాను.

ఎడ్ల పోచయ్య బాల్‌థాక్రే గురించి రాశారు. అదే సంచికలో (డిసెంబర్ 2012) మచ్చ ప్రభాకర్ కూడా బాల్‌థాక్రే గురించి, శివసేన పార్టీ గురించి రాశారు. బాగానే ఉంది. పోచయ్యగారు శివసేన వారి హంతక దాడుల గురించి రాస్తూ అరవై మంది కన్నడిగులను చంపారని, అలాగే రమాబాయి అంబేద్కర్ నగర్ సంఘటనలో పది మంది దళితుల్ని చంపేశారని రాశారు. ఈ సంఘటనల వాస్తవాలపై సరైన సమాచారం సేకరించి రాస్తే బాగుంటుంది. రమాబాయి అంబేద్కర్ నగర్ సంఘటనలో పోలీసుల కాల్పులలో పది మంది దళితులు చనిపోయారనేది వాస్తవం. శివసేనకు ఆ సంఘటనతో అంతగా ప్రత్యక్ష సంబంధం లేదు. ఇక అరవై మంది కన్నడిగుల్ని చంపారనేది కూడా అనుమానాస్పదమే. ఇంతవరకెప్పుడు అలా చదివినట్లు జ్ఞాపకం లేదు. దక్షిణ భారతీయులపై దాడులు జరిగాయి, కాని అంత పెద్ద సంఖ్యలో జనం చనిపోయిన సంఘటనలు జరగలేదనేదే నాకున్న సమాచారం. ఈ విషయంపై మరింత అధ్యయనం చేయండని నా విజ్ఞప్తి.

ఇక శివసేన పార్టీకి సంబంధించి రెండు మాటలు. శివసేన ఏ కారణాలతో పుట్టినప్పటికీ అది పాలకవర్గ పార్టీగా రూపాంతరం చెందిందనేది వాస్తవం. మరాఠీ, మహారాష్ట్ర అనే దానితో మొదలుపెట్టి బొంబాయిలో మరాఠీ యువకుల నిరుద్యోగ సమస్యను, ఇతర ప్రాంతాల ముఖ్యంగా దక్షిణ భారతీయుల ఉద్యోగాలతో ముడిపెట్టి, కృత్రిమ శత్రువుని చూపెట్టి యువతను పోగుచేసి, తర్వాత కమ్యూనిస్టుల ప్రాబల్యంలోని ట్రేడ్ యూనియన్‌లను విచ్ఛిన్నం చేయడానికి దాడుల్ని సాగించింది. కాంగ్రెస్ పార్టీ అండదండలతో పెట్టుబడిదార్లకు ఊడిగం చేసింది. తర్వాత కాలంలో హిందూత్వ నినాదం స్వీకరించి బిజెపికి మిత్రపక్షంగా మారి మహారాష్ట్రలో 1995–2000 వరకు అధికారం చెలాయించింది. అలాగే కేంద్రంలో ఎన్‌డిఎ వాజ్‌పేయి ప్రభుత్వంలో భాగస్వామ్యం వహించింది.

**– కె. రమేష్**
*మహారాష్ట్ర*

వీక్షణం దశాబ్ది ప్రత్యేక సంచికకు అభినందనలు. దానిని చదవడానికే పది రోజులు పట్టింది. అందులో నాకు కొరుకుడు పడని వ్యాసాలూ, సులభంగా అందరికీ అర్థమయ్యే వ్యాసాలూ అని విడదీసి, తేలికగా ఉండేవి ముందు చదివాను. చివరికి మిలిగిలిందే ముదునూరి భారతి గారి 'అభివృద్ధి – నిర్వాసితులు' వ్యాసం. కొబడ్ గాంధీ వ్యాసం నా వల్ల కాలేదు. అయినా చివరకి చదివా కూడా. పత్రికలోని ఆఖరి వ్యాసం 'విప్లవోద్యమ చరిత్ర'ను మొట్ట మొదటగా చదివాను. అది సూక్ష్మంగా 'రిపోర్ట్' చదివినట్లనిపించింది. ప్రత్యామ్నాయ చరిత్రను ఎట్లా సృష్టిస్తున్నారో నేటి దండకారణ్య చరిత్ర, జనతన సర్కార్ గురించి చివరగా ఒక్క పేజీలో కుదించారు. పదకొండు పేజీలలో పది పేజీలు పాత చరిత్రే. 'భవిష్యద్దర్శనం' చూపే వారే నేటి వర్తమానంపై వివి గారు వివరించకపోతే ఇంకెవరు చెప్పగలరూ? మొదటి మూడు పేజీలు ఉపోద్ఘాతం, ఆ తర్వాత 1950 నుండి 2012 దాకా 62 ఏండ్ల చరిత్ర ఏడు పేజీలలో చెప్పారు. చివరగా గ్రీన్ హంట్, విజయ్, హోకా, ఆనకొండ ఆపరేషన్‌ల గురించి ఒకే ఒక్క పేజీలో భవిష్య ప్రత్యామ్నాయ చరిత్రను చెప్పి ముగించారు. అయినా చాలా ఉత్తమ వ్యాసం. ఆంధ్రజ్యోతిలో డా. కె. శ్రీనివాస్ పుస్తకంపై ముందుమాటలో వివరించి ఉంటారు. చూడాలి. జనతన సర్కార్‌పై ప్రచారం అసలు చాలనే చాలదు. మార్పుకి దారి అదిగదా. దానిని ఎందుకు ఫోకస్ చేయరు.

నేను చదివిన రెండో వ్యాసం, నాకు నచ్చినది 'మహిళా ఉద్యమ చరిత్ర ప్రధాన ఘట్టాలు' డా. నళిని గారిది. ఇదీ రిపోర్టులాగే ఉన్నా – ఎంతో ఆవేశంతో, స్త్రీల ఆవేదనల్ని కండ్లకు కట్టారు. బానిస యజమానితత్వం అందరిలోనూ తొలగాల్సిందే! ఒక్క స్త్రీలకే కాదు, పురుషుల్లోనూ ఈ అవగాహన ముఖ్యం. ముగింపు అమోఘం. ఎన్నో మంచి స్లోగాన్ టైపు కవితా పాదాలు పేర్కొన్నారు. చాలా మంచి వ్యాసం.

నాకు నచ్చిన మూడో వ్యాసం, 'మహోజ్జ్వల భారత కార్మికోద్యమం' – పి.వి. రమణ గారిది. బానిస వ్యవస్థ పోయినా – డాలర్ల కోసం – అమెరికా, అరబ్బులకెళ్లే చదువుకున్న మేధావులూ బానిసల్లాగా వలసపోయిన కార్మికులలాగే స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను కుదువబెట్టి డబ్బుల కోసం గడ్డి కరుస్తున్నారని చెప్పారు. ఇదీ చారిత్రక వ్యాసమే. రిపోర్ట్ అయినా, కార్మికులకు ఉపయోగపడే వ్యాసం.

మరో మంచి సులభ వ్యాసాలు ఒకటీ రెండూ కాదూ చాలా ఉన్నాయి. అందరికీ సులభంగా అర్థమయ్యే రీతిలో 'నేరాల కన్నతల్లి – పార్లమెంటరీ వ్యవస్థ', 'సామ్రాజ్యవాద విష ఫలితాలు', 'మారని పేదరికం – మారుతున్న అంచనాలు'. 'ప్రజాస్వామ్యం మెరిసిపోతుందా – సమసిపోతుందా?' అన్న దాంట్లో వి. హనుమంత రావుగారు అయితే కాంగ్రెస్ బైబై చెప్పి 2014లో మంచివాళ్లను ఎన్నుకోమన్నారు సరే. మంచివాళ్లు నిలబడితే గదా! వారికి ఓటు వేసే అవకాశం కలిగేది. మంచివాళ్లకు సీట్లు ఎవరిస్తారు? ఒంటరిగా ఒకటి, రెండు సీట్లు గెలిచినా మంచి వారు చేయగలిగిందేముంది ఈ ప్రజాస్వామ్యంలో? 'ఆంధ్రప్రదేశ్‌లో రైతు ఆత్మహత్యల అభివృద్ధి'ని కథాకథన పద్ధతిన ఉదాహరణలతో వివరించారు రచయితలు. ఇదీ మంచి వ్యాసమే.

(మిగతా 64వ పేజీలో...)

గత 21 సంవత్సరాల నుండి మంగళగిరి మండలం, నిడమర్రు చార్వాకాశ్రమంలో ఫిబ్రవరి రెండవ శనివారం, ఆదివారంలలో 'నాస్తిక మేళా' కార్యక్రమాలు జరుగుతున్నవి. ఈ సంవత్సరం కూడా అనగా 2013 ఫిబ్రవరి 9, 10 తేదీలలో '21వ నాస్తిక మేళా' నిర్వహించ బడుతున్నది. దీనిలో రాష్ట్రంలోని భౌతికవాదులందరూ పాల్గొంటారు.

**సుధాకర్**

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ద్యామర రేణుక; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; నెల్లూరు – బాలగురువయ్య; విజయనగరం – డి. సుధాకర్; విశాఖపట్నం – పి.వి. రమణ;

# అమానుష అత్యాచారాలే సంస్కృతి అయిన చోట...

దేశ రాజధానీ నగరంలో ఒక యువతిపై జరిగిన అత్యాచారం, ఆమె మీదా, ఆమె స్నేహితుడి మీదా భయంకరమైన హింస, చివరికి ఆమె మరణం దేశవ్యాప్తంగా లక్షలాది మందిని కదిలించాయి. చాల చర్చకూ, పెద్ద ఎత్తున ఆందోళనలకూ, కొన్ని చర్యలకూ దారితీశాయి. తీవ్రమైన చర్చలు జరిగి ఎన్నో అంశాలు వెలికిరావడం, ఢిల్లీలోనూ ఇతరచోట్లా పెద్ద ఎత్తున జరిగిన ఆందోళనలలో యువతరం గణనీయంగా పాల్గొనడం, ప్రభుత్వం ఎట్టకేలకు జస్టిస్ జె ఎస్ వర్మ నాయకత్వాన కమిషన్ నియమించడం, ఆ కమిషన్ అతి తక్కువ సమయంలో చాలవరకు మంచి సూచనలతో నివేదిక సమర్పించడం ఆహ్వానించదగిన పరిణామాలే.

కాని ఈ ఆహ్వానించదగిన పరిణామాల చాటున కొన్ని గుర్తించవలసిన ప్రమాదకర ధోరణులు కూడ పొంచి ఉన్నాయి. అత్యాచారం జరిగిన వెంటనే ప్రారంభమైన న్యాయమైన ఆగ్రహాన్ని పక్కదారి పట్టించడానికి ప్రభుత్వం, పాలకవర్గ భావజాల సాధనాలు ఉద్దేశపూర్వకంగా ప్రయత్నించినట్టు కనబడుతున్నది. స్త్రీల పట్ల సామాజిక దృక్పథం మారడం అనే విశాల అంశాన్ని లేవనెత్తవలసిన ఆందోళనలు ఈ ఘటనలో నేరస్తులు, వారికి ఎంత కఠినమైన శిక్ష విధించాలి అనే పరిమిత అంశాలకు కుదించబడ్డాయి. ఆందోళనల్లో పాల్గొన్న యువతరం తక్షణ ఆవేశంతో ముందుకు వచ్చినవారు కావడం ఒక కారణం కావచ్చు. శాస్త్రీయ అవగాహన ఉన్న నిర్మాణాత్మకమైన ఉద్యమకారులు కాకపోవడం మరొక కారణం కావచ్చు. కాని వారు పాలకవర్గ భావజాలపు హైజాకింగ్ కు లోబడి పోయారనిపిస్తున్నది. ఉవ్వెత్తున ఎగసిన ఆందోళన తప్పుడు నినాదాలతో, ఆకాంక్షలతో కొంతకాలం సాగి ఆ తర్వాత చప్పున చల్లారిపోయింది. నిజానికి ఈ యాదృచ్ఛికమైన ప్రజాందోళనా వెల్లువకు సరైన నాయకత్వం, దృక్పథం తోడయితే అద్భుతమైన ఉద్యమానికి మార్గం సుగమమయ్యేది. అత్యాచార బాధితుల పట్ల సానుభూతిని ప్రదర్శించిన, ఒక మేరకు ప్రభుత్వాన్ని కూడ ప్రశ్నించిన ఈ చిన్న నిప్పురవ్వ దావానలమయి వ్యవస్థనే లోతుగా ప్రశ్నించే బలాన్ని సంతరించుకునేది. వ్యవస్థను, పాలకవర్గాలను వ్యతిరేకించే శక్తులు ఎంత అప్రమత్తంగా, సంసిద్ధంగా ఉండాలో, ఇటువంటి అవకాశాలు వచ్చినప్పుడు ఎలా వాడుకోవాలో, ఆ అప్రమత్తత, సంసిద్ధత, చొరవ ఎలా లోపించాయో డిసెంబర్ 16 నుంచి ఇప్పటిదాకా జరుగుతున్న చర్చలు, ఆందోళనలు మరొకసారి ప్రకటిస్తున్నాయి. పనిలో పనిగా పితృస్వామిక, భూస్వామ్య, అసమాన భావజాలాన్ని మరొకసారి వ్యాపింపజేయడానికి సంఘపరివార్ శక్తులు ప్రయత్నించాయి.

జరిగిన అత్యాచార ఘటన, అది జరిగిన తీరు అత్యంత దారుణమైనవి. తప్పనిసరిగా ఆగ్రహాన్ని పురికొల్పగలిగినవి. కాని ఆ ఆగ్రహం ఆ ఘటన మూలకారణాలలోకి వెళ్లకపోతే, మౌలిక మార్పును ఆకాంక్షించకపోతే దానికి ఫలితమేమీ ఉండదు. అది తాటాకు మంటలాగ చల్లారి పోతుంది. నిరసన ప్రకటించినవారికి తామేదో చేశామనే సంతృప్తి మిగలవచ్చు గాని సమస్య ఎక్కడ ఉన్నది అక్కడే అట్లాగే ఉంటుంది. పాలకవర్గాలకు ఈ విషయం స్పష్టంగా తెలుసు గనుకనే ఢిల్లీ అత్యాచార ఘటన మీద చర్చను చాల పద్ధతి ప్రకారం మూలకారణాలవైపు వెళ్లకుండా చూశారు, చర్చ దేశవ్యాప్తంగా జరుగుతున్న అత్యాచారాల వైపు, ప్రత్యేకించి పోలీసులు, అర్ధసైనిక, సైనిక బలగాలు, అగ్రవర్ణాలు ఆధిపత్య చిహ్నంగా జరుపుతున్న అత్యాచారాల వైపు కూడ వెళ్లకుండా జాగ్రత్త పడ్డారు. కేవలం నేరస్తుల వ్యక్తిగత నేరప్రవృత్తి, శిక్ష అవసరం, తక్షణ ప్రతీకారం, కిందిస్థాయి అధికారుల నిర్లక్ష్యం మాత్రమే చర్చకు వచ్చాయి. నేరస్తుల దుర్మార్గం, మరణశిక్ష విధించడం, నపుంసకులను చేయడం, పోలీసుల, ఆస్పత్రి అధికారుల నిర్లక్ష్యం, ఢిల్లీ ప్రభుత్వ, కేంద్ర ప్రభుత్వ ఔదాసీన్యం చర్చకు వచ్చాయి. ఇవన్నీ మాట్లాడవలసినవే. కాని అక్కడే ఆగిపోతే అసలు లక్ష్యం తప్పిపోతుంది. ఈ నేరస్తులను తయారు చేస్తున్న పాలకవర్గ భావజాలం గురించి, స్త్రీ పురుష అసమానత గురించి, వ్యవస్థ అమానవీయత గురించి మాట్లాడితేనే, వ్యవస్థ మార్పు గురించి ఆలోచింపజేస్తేనే శాశ్వత పరిష్కారాలు సాధ్యమవుతాయి.

ఆందోళనకారుల ఆగ్రహావేశాలను, తక్షణ ప్రతీకార వాంఛలను అదునుగా తీసుకుని పాలకవర్గాలు తమకు తాము ఎక్కువ హింసా సాధనాలు సమకూర్చుకోవడానికి, ప్రభుత్వ భద్రతాబలగాల చేతిలో అధికారాన్ని మరింతగా కేంద్రీకరించడానికి ప్రయత్నించాయి. మరణశిక్ష గురించి వాదనల జోరు పెంచాయి. పాలకవర్గ ముఠాలు ఒకదానిమీద ఒకటి కత్తులు దూసుకొన్నట్టు నటిస్తూ, అన్ని ముఠాలకూ భాగం ఉన్న దుర్మార్గాల గురించి మాట తప్పించాయి.

నిజానికి ఈ నేరం ఇవాళ ఆరుగురు వ్యక్తుల ద్వారా జరిగి ఉండవచ్చు. లేదా ప్రతిరోజూ కొన్ని డజన్ల మంది నేరస్తులు కనబడుతూ ఉండవచ్చు. ఆ నేరస్తులను శిక్షించడం కూడ అవసరమే కావచ్చు. కాని ఆ నేరస్తులను శిక్షించినంత మాత్రాన ఆ నేరస్తులను ఉత్పత్తి చేస్తున్న వ్యవస్థ రద్దయిపోదు. నేరస్తులను శిక్షించాలని అమాయకంగా, ఉద్రేకపూరితంగా వాదిసున్నవాళ్లందరూ ఆ నేరస్తులను ఉత్పత్తి చేసున్న వ్యవస్థ వైపు దృష్టి మళ్లించకపోతే వాళ్ల న్యాయమైన ఆగ్రహం వ్యర్థమైపోతుంది.

స్త్రీని సంపూర్ణ మానవిగా, పురుషుడితో సమానంగా చూడని వ్యవస్థ ఇది. స్త్రీని భోగవస్తువుగా, వినియోగ వస్తువుగా, యంత్రంగా మాత్రమే చూసే భావజాలాన్ని మన మెదళ్లలో నింపుతున్న సంస్కృతి ఇది. ఈ వ్యవస్థలో, సంస్కృతిలో ఇటువంటి నేరస్తులు నిరంతరం ఉత్పత్తి అవుతుంటారు. వర్గ, మత, కుల, ప్రాంత అసమానతలూ స్త్రీ పురుష అసమానతా పరస్పరాధారంతో బలపడుతున్నాయి. అందువల్ల స్త్రీల మీద అత్యాచారాలకు వ్యతిరేకంగా పోరాడడం అంటే స్త్రీ పురుష అసమానతకు వ్యతిరేకంగా పోరాడడం కావాలి. అంటే వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడడం కావాలి. స్త్రీల మీద అత్యాచారాలను విడిగా చూసి వాటికి వ్యతిరేకంగా పోరాడడం తాత్కాలిక, స్వల్ప ఫలితాలను సాధిస్తుందేమో గాని శాశ్వతమైన, అర్థవంతమైన, నిజమైన పరిష్కారాలను సాధించజాలదు.

వీ

# విశ్వసనీయత లేని పాలకవర్గాలు

తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు విషయంలో డిసెంబర్ 28న ఢిల్లీలో జరిగిన అఖిలపక్ష సమావేశం ముగిసిన తర్వాత, 'అన్ని పక్షాల వాదనలనూ జాగ్రత్తగా విన్నాను. అవి ప్రభుత్వానికి తెలుపుతాను. ఒక నెలలోపు నిర్ణయం తీసుకుంటాం' అని కేంద్ర హోంమంత్రి సుశీల్ కుమార్ షిండే ప్రకటించారు. 'తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ ప్రారంభమవుతున్నది' అని 2009 డిసెంబర్ 9న అప్పటి కేంద్ర హోం మంత్రి పి చిదంబరం చేసిన ప్రకటనను అమలులో పెట్టకుండా మూడు సంవత్సరాలుగా తాత్సారం చేస్తున్న కేంద్ర ప్రభుత్వం ఈ కచ్చితమైన గడువును మాత్రం పాటిస్తుందా అని ఈ ప్రకటన జరిగినరోజునే అనుమానాలు వెలువడ్డాయి. షిండే ప్రకటనను సంపూర్ణంగా విశ్వసించవచ్చునని వాదించినవారూ, ఆ ప్రకటన అమలులోకి రావాలంటే ప్రజా ఉద్యమం ద్వారా నిరంతర ఒత్తిడి తప్ప మరొక మార్గం లేదని అనుకున్నవారూ కూడ ఉన్నారు. ఈసారి నిర్ణీత కాలవ్యవధి తక్కువ గనుక త్వరలోనే ఏ విషయమూ తేలిపోతుందని ప్రతి ఒక్కరూ భావించారు. ఈ సంపాదకీయం రాస్తున్న సమయానికి ఆ గడువు పూర్తి కావడానికి రెండు రోజులు మాత్రమే ఉంది గాని, ఈ లోగానే కోస్తాంధ్ర, రాయలసీమ రాజకీయ వర్గాల భిన్నస్వరాలు, ఆయా ప్రాంతాలలో విద్యార్థి, యువజనులను రెచ్చగొట్టే ప్రకటనలు, కొన్ని చోట్ల నిరసన కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. చివరికి కాంగ్రెస్ తరఫున అధికార ప్రతినిధిగా గులాం నబీ ఆజాద్ 'నెల అంటే నెల కాదు' అని తామే పెట్టుకున్న గడువును తాము పాటించబోవడం లేదని స్పష్టంగా ప్రకటించాడు. ఇలా మాట నిలుపుకోక పోవడం, ప్రత్యేకించి తెలంగాణ ప్రజాందోళనకూ ప్రజా ఆకాంక్షకూ సంబంధించినంతవరకు కాంగ్రెస్ పార్టీకీ, ప్రభుత్వానికీ కొత్త కాదు. కాని ఇది కాంగ్రెస్, సోనియా గాంధీ, చిదంబరం, షిండే, ఆజాద్ అనే వ్యక్తుల నమ్మకద్రోహానికి మాత్రమే సంబంధించిన సమస్య కాదు. అధికారవర్గాల మనుగడకు సంబంధించిన సమస్య ఇది. ఎప్పుడైనా అధికారంలో ఉండేవారు ప్రజల విశ్వాసాన్ని చూరగొన్నంతవరకే, తమ విశ్వసనీయతను ప్రదర్శించుకున్నంతవరకే అధికారంలో ఉండగలుగుతారు. వారు అనే మాటకు కట్టుబడి ఉండరు అని తెలిసిన క్షణాన ప్రజలకు వారిని నమ్మవలసిన అవసరమేమీ లేదు. పాలకవర్గాలలోని ఒక ముఠా మీద ఈ అపనమ్మకం ఉండడం, మరో ముఠా మీద లేకపోవడం కూడ కాదు, అన్ని ముఠాలూ ఒకే రాజకీయార్థిక ప్రయోజనాల కోసం పనిచేస్తున్నాయని అర్థమయిన కొద్దీ ఒక ముఠా మీద కలిగే అవిశ్వాసమే మిగిలిన ముఠాల మీదికి కూడ బదిలీ అవుతుంది. అప్పుడిక ప్రజలకు వ్యవస్థ మార్పు తప్ప గత్యంతరం లేదని తెలిసిపోతుంది. తెలంగాణ ప్రజలలో ఆ అవగాహన నానాటికీ పెరుగుతుండడానికి పూర్తి బాధ్యత పాలకవర్గాలలోని వివిధ ముఠాలదే. ప్రజలలో ఇలా పాలకవర్గాలపట్ల అవిశ్వాసం పెరిగినకొద్దీ సామాజిక అశాంతి పెరిగిపోతుంది. ఆ అశాంతే వ్యవస్థ మార్పు ఆలోచనలకు పునాది అవుతుంది. వ్యవస్థ మార్పుకు ప్రజలను సిద్ధం చేయవలసిన, ఆ మార్పును త్వరితం చేయవలసిన, ఆ మార్పు ప్రక్రియకు నాయకత్వం వహించవలసిన ప్రజా రాజకీయశక్తులు ఇంకా బలం పుంజుకోకపోవచ్చు. కాని వ్యవస్థ మారకతప్పదనే అవగాహన పెరగడమే ఆ శక్తులు బలపడడానికి పునాది కల్పిస్తుంది. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు దిశగా ఇప్పటికైనా ప్రయత్నాలు ప్రారంభిస్తారా, మరింత అవిశ్వసనీయంగా మారి, అంతిమంగా ప్రజా విస్ఫోటనకు కారణమవుతారా తేల్చుకోవలసినది పాలకవర్గాలే. వీ

# తెగిపడవలసిన తలలెవరివి?

భారత పాకిస్తాన్ సరిహద్దులలో జనవరి 8న జరిగిన సంఘటన ఇరుదేశాల పాలకవర్గాల కుటిలత్వంతో నానాటికీ పెరిగిపోయి యుద్ధ సన్నాహాల దాకా వస్తున్నది. ఆ రోజున జమ్మూకు వాయవ్యంగా 250 కి.మీ. దూరంలో పూంచ్ జిల్లాలోని మెంధర్ ప్రాంతంలో అధీనరేఖ దగ్గర పాకిస్తాన్ సైనికులు భారత కాపలా శిబిరం మీద దాడి చేసి, లాన్స్ నాయక్ హేమ్ రాజ్, లాన్స్ నాయక్ సుధాకర్ సింగ్ అనే ఇద్దరు సైనికుల తలలు నరికారని ఒక కథనం. ఈ కథనపు నిజానిజాలు ఎంత గందరగోళంగా ఉన్నాయంటే జనవరి 10న కఫిలా వెబ్ సైట్ మీద వ్యాసం రాసిన శివమ్ విజ్ అంతకు ముందు రెండురోజులలో వెలువడిన అధికార, అనధికార ప్రకటనలను, పత్రికావార్తలను అన్నిటినీ పక్కపక్కన పెట్టి అసలా శిరచ్ఛేదం జరగలేదని భారత సైనికాధికారులే అన్నారని రుజువుచేశారు. తమ సైనికులు శిరచ్ఛేదం చేయలేదని, కావాలంటే ఐక్యరాజ్యసమితి తటస్థ విచారణకు తాము సిద్ధమేనని పాకిస్తాన్ ప్రభుత్వం ప్రకటించింది. ఎవరి విచారణా అవసరం లేదని భారత ప్రభుత్వం జవాబు చెప్పింది. ఈ లోగా శివసేన, భారతీయ జనతాపార్టీ వంటి జాతీయ దురహంకార శక్తులు పాకిస్తాన్ మీద యుద్ధం ప్రకటించాలని, ఒకతలకు పదితలలు తీయాలని ఉన్మాద ప్రకటనలు ప్రారంభించాయి. ఢిల్లీ సామూహిక అత్యాచార ఘటన మీద జరుగుతున్న ప్రజాందోళనల నుంచి తప్పించుకోవడానికి, దేశం దృష్టిని జాతీయోన్మాదం వైపు మళ్లించడానికి ఇది ఒక అవకాశంగా అధికారవర్గాలు భావించాయి. అటు పాకిస్తాన్ లోను ప్రజా అసంతృప్తినీ ఆగ్రహాన్నీ మూటగట్టుకుంటున్న పాలకవర్గాలు ప్రజలను భారత్ కు వ్యతిరేకంగా తిప్పి తమ పబ్బం గడుపుకోవడానికి ప్రయత్నించాయి. గత రెండు వారాలలో రెండు దేశాలలోను పత్రికలు, ప్రచార సాధనాలు యుద్ధం జరిగితే ఎవరు గెలుస్తారు, ఎవరు ఓడిపోతారు, ఎవరి సైనిక పాటవం ఎంత, ఎవరు ఎవరికి బుద్ధి చెప్పవలసి ఉంది అని చర్చోపచర్చలు నడుపుతున్నాయి. ప్రజల నిత్యజీవిత సమస్యలను పరిష్కరించలేని రెండు దేశాల పాలకులకూ ఇటువంటి కొత్త సమస్యల సృష్టించడం, కుహనా చర్చలు జరిపి ప్రజల దృష్టిని పక్కదారి పట్టించడం అవసరం. తలలు నరకడం నిజమే అయితే అది ఇవాళే పాకిస్తానే మొదలుపెట్టినదేమీ కాదు. శత్రుసైనికుల తలలతో బంతులాడడం అనేది పురాణ కాలం నుంచీ, దేవతలకు కూడ ఇష్టమైన భారత ఉపఖండ క్రీడ. నిజానికి వలస పాలన ముగిసిన ఆరున్నర దశాబ్దాల తర్వాత కూడ ప్రజల కనీస అవసరాలు తీర్చలేని రెండు దేశాల పాలకవర్గాల తలలూ ప్రజాగ్రహంలో నేలన దొర్లవలసిన సమయంలో ఆ అంతిమ తీర్పును ఎలాగోలా వాయిదా వేయడానికి పాలకవర్గాలు ఆడుతున్న కపట నాటకంలో ఇటువంటి అబద్ధాల సృష్టి, పాక్షిక నిజాల ప్రచారం ఒక భాగం. అంతవరకూ పాలకవర్గాల దుర్మార్గాలనూ అబద్ధాలనూ విమర్శించేవారు కూడ దేశభక్తి విషయం వచ్చేసరికి పూనకం వచ్చినట్టుగా పాలకుల అబద్ధాలను నమ్మే ఉన్మాద స్థితి ఉండడం విషాదకరం. ఇప్పటికైనా భారత, పాకిస్తాన్ పాలకవర్గాల విషప్రచారాలను అధిగమించి భారత పాకిస్తాన్ ప్రజల మైత్రికి బాటలు వేయవలసి ఉంది. ఇప్పటికైతే పాలకుల కుట్రలకు తెగిపడుతున్నది, లేదా అబద్ధాలకు బలిఅయిపోతున్నది అటో ఇటో పేద సైనికుల, ప్రజల, మధ్యతరగతి ఆలోచనాపరుల తలలు మాత్రమే. నిజానికి తెగిపడవలసింది రెండు దేశాల ప్రజలనూ వంచిస్తున్న పాలక వ్యవస్థలు. వీ




❖ **ఎస్సీ ఎస్టీ నిధులు: విదిలింపు-మళ్లింపు** – బొజ్జా తారకం – రిపబ్లికన్ పబ్లికేషన్స్ – 88 పేజీలు, 1/8 డెమీ, ఉద్యమ కార్యకర్తలకు రు. 20, ఉద్యోగస్తులకు రు. 40, ప్రతులకు: రిపబ్లికన్ పబ్లికేషన్స్, ఫ్లాట్ నెం.1, బాల్‌రెడ్డి నగర్ కాలనీ, టోలిచౌకి, హైదరాబాద్ – 500 008. ఫోన్: 040 23562525 సెల్: 9441441891, 9440755954; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు




❖ **నేనే బలాన్ని – టి.ఎన్. సదాలక్ష్మి బతుకు కథ** – గోగు శ్యామల – హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 338 పేజీలు, 1/8 డెమీ, రు : 180, ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ఫ్లాట్ నెం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్–500 067. ఫోన్:23521849, www.hyderabadbooktrust.blogspot.com




❖ **సున్నితమైన కవి సుమనశ్రీ** – సౌభాగ్య – రమణ సుమనశ్రీ ఫౌండేషన్ – 104 పేజీలు, 1/8 డెమీ, రు: 90, ప్రతులకు: శ్రీమతి చెల్లపిల్ల వెంకటరమణ, ఫ్లాట్ నెం. 121, ఫ్లాట్ నెం. 3, బాలాజీ నివాస్ అపార్ట్‌మెంట్స్, కళ్యాణ్‌నగర్ (ఫేజ్ 1) ఎస్.ఆర్.నగర్ (పోస్ట్), హైదరాబాద్–38, ఫోన్: 040–23811623;ఇమెయిల్:chellapilla95@gmail.com




❖ **మీరే డిటెక్టివ్** – కాలక్షేపానికి 'పొదుపు' కథలు – సేకరణ: ముక్తవరం పార్థసారథి – వికాసం బుక్స్ – 121 పేజీలు, 1/8 డెమీ, రు: 80, ప్రతులకు: ఎం. పార్థసారథి, 411, ప్రభాకర్ అపార్ట్‌మెంట్స్, విజయనగర్ కాలనీ, హైదరాబాద్ – 500057, సెల్: 9177618708, ఫోన్: 040 23345091; ప్రజాశక్తి; విశాలాంధ్ర; నవోదయ



❖ **బి.ఎస్.రాములు బతుకుపోరు నవల – సామాజికత** – సాహిత్యం – పల్లా మాలతి చంద్ర – సామాజిక తాత్త్విక విశ్వవిద్యాలయం – 176 పేజీలు, 1/8 డెమీ, రు.80, ప్రతులకు: యూనివర్సిటీ ఆఫ్ సోషల్ ఫిలాసఫీ, విశాల సాహిత్య అకాడమీ, 406, ఉషాకిరణ్ ఆర్కేడ్, ఉస్మానియా యూనివర్సిటీ రోడ్, విద్యానగర్, హైదరాబాద్–44, సెల్: 9391036987



❖ **చీలిన మనిషి – కవిత్వం** – ఈతకోట సుబ్బారావు – 104 పేజీలు, 1/8 డెమీ, రు.60, ప్రతులకు: ఈతకోట సుబ్బారావు, ఇ.నెం. 24/1175, రెండవ వీధి, రవీంద్రనగర్, నెల్లూరు – 524004, సెల్: 9440529785; ఇమెయిల్:ethakotas@yahoo.com



❖ **మార్క్సిజానికి, అస్తిత్వవాదానికి మధ్యగల మౌలిక వ్యత్యాసాలు** – జార్జి నోవాక్, అనువాదం: సి.పటేల్ – లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ – 24 పేజీలు, 1/8 డెమీ, రు: 10, ప్రతులకు: విశాలాంధ్ర; ప్రజాశక్తి; మైత్రి; దిశ; సహచర; నవయుగ; మణి బుక్‌స్టాల్స్




❖ **సమైక్య ద్రోహం** – (నీటి పారుదల రంగంలో దగాపడ్డ రాయలసీమ) – రాయలసీమ విద్యావంతుల వేదిక – 44 పేజీలు, 1/8 డెమీ, రు: 10, ప్రతులకు: రాయలసీమ విద్యావంతుల వేదిక, 87/106, శ్రీలక్ష్మీనగర్, బి.క్యాంప్, కర్నూలు – 518 002



❖ **చెరబండేమాతరం** – శ్రీశ్రీ – కూర్పు: సింగంపల్లి అశోక్‌కుమార్, శ్రీశ్రీ సాహిత్య నిధి, 31 పేజీలు, 1/8 డెమీ, రు : 20, ప్రతులకు : శ్రీశ్రీ సాహిత్య నిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య వీధి, మారుతినగర్, విజయవాడ – 520004, ఫోన్:0866–6617375, సెల్: 9246277375 ఇమెయిల్: srisri_sahityanidhi@yahoo.com




❖ **యుగస్వరం** – నిఖిలేశ్వర్ – 150 పేజీలు, 1/8 డెమీ, రు : 80, ప్రతులకు : నిఖిలేశ్వర్, 2–2–647/185/1ఎ, శారదనగర్ (బాగ్‌అంబర్‌పేట్), హైదరాబాద్ – 500013; విశాలాంధ్ర; ప్రజాశక్తి; నవోదయ; సహచర; మైత్రి;



❖ **ఆకాంక్ష** – తెలంగాణ రాజకీయ వ్యాసాలు – గుండెబోయిన శ్రీనివాస్ – చెలిమి సాహిత్య సాంస్కృతిక వేదిక – 98 పేజీలు, 1/8 డెమీ, రు : 70, ప్రతులకు : మెట్టు రవీందర్, ఇ.నెం. 1–386/3, చాణక్యపురి, భీమారం, హన్మకొండ, వరంగల్, సెల్: 9908763566; గుండెబోయిన శ్రీనివాస్, ఇ.నెం. 3–1–74/1/ఎ, కాకతీయ కాలనీ, హన్మకొండ, వరంగల్–506011 సెల్: 9985194697




❖ **స్వీయ చరిత్ర – బీదబ్రతుకు** – యలమంచిలి వెంకటప్పయ్య – యలమంచిలి వెంకటప్పయ్య సంస్మరణ వేదిక ప్రచురణ – 84 పేజీలు, 1/8 డెమీ, రు : 25, ప్రతులకు : మురళీధర్ యలమంచిలి, 403, అరుణనివాస్, డాన్ బాస్కో స్కూల్ ఎదురు రోడ్డు, గురునానక్ నగర్, విజయవాడ – 520007, సెల్: 9440327500 మైత్రీ బుక్‌హౌస్; విశాలాంధ్ర; ప్రజాశక్తి




❖ **అనన్య** – నవల – కేవస్వీ – ఓరియన్ పబ్లికేషన్స్ – 136 పేజీలు, 1/8 డెమీ, రు : 100, ప్రతులకు : అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **ఆస్ట్రేలియా** – తంగెడ జనార్దనరావు – ప్రజాహిత ప్రచురణలు – 145 పేజీలు, 1/8 డెమీ, రు : 65, ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అన్ని కేంద్రాలలో; బుక్‌బర్డ్, హనుమకొండ; నవోదయ, హైదరాబాద్




❖ **గౌరి, గణపతి** – చారిత్రక, సామాజిక పరిణామ వ్యాసాలు – పురాణం సుబ్రహ్మణ్య శర్మ – హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 81 పేజీలు, 1/8 డెమీ, రు : 30, ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ఫ్లాట్ నెం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్–500 006. ఫోన్:23521849, www.hyderabadbooktrust.blogspot.com



❖ **బోధివృక్షం** – కవిత్వం – డా. బెల్లి యాదయ్య – పదం ప్రచురణలు – 86 పేజీలు, 1/8 డెమీ, సాదా ప్రతి రు. 35, గ్రంథాలయ ప్రతి రు.70, ప్రతులకు : 'శ్రీక్రితి', 6–2–330 ఎన్‌జి కాలేజీ వెనుక, శ్రీనగర్ కాలనీ, నల్గొండ టౌన్ – 508001, సెల్:9848392690; అన్ని ప్రముఖ పుస్తక షాపులలో

## ఈజిప్ట్‌లో నూతన రాజ్యాంగం

ఈజిప్ట్‌లో నూతన రాజ్యాంగం ఆమోదం పొందింది. రాజ్యాంగ ముసాయిదాను 63.8 శాతం మంది ఈజిప్షియన్లు ఆమోదించారు. డిసెంబర్ 27న నూతన రాజ్యాంగంపై అధ్యక్షుడు మహ్మద్ మోర్సీ సంతకం చేశారు. ఈ సందర్భంగా దేశంలో నెలకొన్న రాజకీయ సంక్షోభం అంతం చేయడానికి, అస్తవ్యస్థంగా ఉన్న దేశా ఆర్థిక పరిస్థితిపై దృష్టి కేంద్రీకరించడానికి ఇది దోహదపడుతుందని మోర్సీ అన్నారు. నూతన రాజ్యాంగం ఆమోదంతో పార్లమెంటరీ ఎన్నికలకు మార్గం సుగమం అయింది. కాగా, మోర్సీ ప్రతిపాదించిన ఈ రాజ్యాంగ ముసాయిదాకు జరిగిన రిఫరెండంలో 30 శాతం మందే పాల్గొన్నారు.

## జపాన్ ప్రధాని అబె

డిసెంబర్ 26న పార్లమెంట్ దిగువ సభలో జరిగిన ఎన్నికల్లో లిబరల్ డెమోక్రటిక్ పార్టీ (ఎల్‌డిపి) నేత షింజో అబె జపాన్ కొత్త ప్రధానిగా ఎన్నికయ్యారు. 480 సీట్లు ఉన్న పార్లమెంట్‌లో 325 సీట్లు వచ్చాయి. 2006 నుండి ఏడాది పాటు ప్రధానిగా ఉన్న అబె, త్వరలో తన కొత్త మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయనున్నారు.

## మయన్మార్‌లో ప్రైవేట్ పత్రికలకు అనుమతి

మయన్మార్ ప్రభుత్వం ఏప్రిల్ నుండి దేశంలో ప్రైవేట్ పత్రికలను అనుమతించనుంది. ఈ మేరకు మయన్మార్ సర్కార్ నిర్ణయం తీసుకుంది. 1964లో ప్రైవేట్ మీడియాను నిషేధించారు. ఈ తాజా నిర్ణయంతో తిరిగి ప్రైవేట్ రంగంలో పత్రికా ప్రచురణను చేపట్టదలుచుకున్న వారు ఫిబ్రవరి లోగా తమకు దరఖాస్తు చేసుకోవాలని మయన్మార్ సమాచార శాఖ తన వెబ్‌సైట్‌లో ప్రకటించింది. వార్తా పత్రికలు ఏ భాషలోనైనా ప్రచురించుకునేందుకు అనుమతిస్తామని తెలిపింది.

## జర్నలిస్టుల దుర్మరణం

2012లో ప్రపంచవ్యాప్తంగా 132 మంది జర్నలిస్టులు విధి నిర్వహణలో ప్రాణాలు కోల్పోయారు. ఈ స్థాయిలో జర్నలిస్టుల మరణాలు ఎన్నడూ సంభవించలేవని అంతర్జాతీయ మీడియా సంస్థ (ఐపిఐ) ఒక ప్రకటనలో తెలిపింది. జర్నలిస్టులను నిర్బంధించడంలో టర్కీ ముందుంది.

## అమెరికా కొత్త రక్షణ మంత్రి ఛుక్ హేగల్

అమెరికా కొత్త రక్షణ మంత్రిగా మాజీ సెనేటర్ ఛుక్ హేగల్‌ను అధ్యక్షుడు బరాక్ ఒబామా నియమించారు. హేగల్ నెబ్రాస్కా నుండి రిపబ్లికన్ పార్టీ తరఫున సెనేట్‌కు ప్రాతినిధ్యం వహించారు. ఇందుకు సంబంధించి హేగల్‌కు సమాచారం పంపినట్లు వైట్‌హౌస్ వర్గాలు వెల్లడించాయి. హేగల్ ఇజ్రాయిల్ భద్రతకు కట్టుబడి ఉంటానని ఇదివరకే ప్రకటించారు. ఈ నియామకంపై రిపబ్లికన్ పార్టీలు అసంతృప్తిగా ఉన్నాయి.

## కార్మిక వ్యతిరేక పనిహక్కు చట్టం

మిచిగాన్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన పనిహక్కు చట్టం కార్మికుల సంఘటిత హక్కుకు భంగకరమని కార్మికోద్యమ నాయకులు తెలిపారు. ఈ చట్టం కార్మికోద్యమాలకు పెద్ద ఎదురు దెబ్బ మాత్రమే కాక, ప్రగతిశీల శక్తులను అణచివేస్తుందని కార్మిక నేతలు ఆందోళన వ్యక్తం చేశారు. ఈ చట్టాన్ని అడ్డుకోకుంటే ఇది దేశవ్యాప్తంగా మితవాద, కార్మిక వ్యతిరేక శక్తులకు మరింత బలాన్ని చేకూరుస్తుందని అన్నారు. అయితే కార్మిక నేతల్లో కొంతమంది మితవాద కోటీశ్వరుల, చట్టసభల్లోని వారి రాజకీయ కీలుబొమ్మలుగా మారడంతో కార్మికోద్యమాలకు ఇటువంటి ఎదురు దెబ్బలు తప్పడం లేదని అంటున్నారు.

## సిరియాలో ముదురుతున్న అంతర్యుద్ధం

సిరియాలో అధ్యక్షుడు బషర్ అల్ అసద్ ప్రభుత్వ బలగాలకూ, తిరుగుబాటు దళాలకూ మధ్య గత ఇరవై రెండు నెలలుగా సాగుతున్న పోరు రోజురోజుకూ తీవ్రమవుతోంది. ఇప్పటి వరకు దాదాపు నలభై ఐదు వేల మందికి పైగా సామాన్య పౌరులు ప్రాణాలు కోల్పోయారని సిరియన్ అబ్జర్వేటరీ ఫర్ హ్యూమన్ రైట్స్ అనే సంస్థ ప్రకటించింది. తిరుగుబాటుదారులూ, ప్రభుత్వ సైనిక బలగాలూ రాజధాని డమాస్కస్ శివార్లలో భీకర యుద్ధం కొనసాగుతోంది. ఈ నేపథ్యంలో జనవరి 1 నుండి అలెప్పో అంతర్జాతీయ విమానాశ్రయాన్ని తాత్కాలికంగా మూసి వేస్తున్నట్టు ప్రభుత్వం ప్రకటించింది. జనవరి 15న సిరియాలో అతి పెద్ద యూనివర్సిటీల్లో ఒకటైన అలెప్పో యూనివర్సిటీలో సంభవించిన జంట పేలుళ్లలో ఎనభై మందికి పైగా మృతిచెందారు. అనేక మంది గాయపడ్డారు. పరీక్షలు రాసేందుకు వచ్చిన అనేక మంది విద్యార్థులు ఈ దాడిలో మరణించారు. ఈ దాడికి ప్రభుత్వ బలగాలు, తిరుగుబాటు దారులు ఒకరిపై ఒకరు నిందలు వేస్తున్నారు.

## హ్యూగో ఛావెజ్‌కు క్యాన్సర్ చికిత్స

వెనిజులా అధ్యక్షుడు హ్యూగో ఛావెజ్‌కు సోకిన క్యాన్సర్ వ్యాధికి హవానా ఆసుపత్రిలో డాక్టర్లు శస్త్ర చికిత్స నిర్వహించారు. ఛావెజ్ క్రమంగా కోలుకుంటున్నారని వెనిజులా ఉపాధ్యక్షుడు నికోలస్ మదురో ఒక ప్రకటనలో తెలిపారు. గత నవంబర్‌లో జరిగిన ఎన్నికల్లో దేశాధ్యక్షుడిగా నాలుగోసారి ఎన్నికైన ఛావెజ్ జనవరి 10న ప్రమాణ స్వీకారం చేయాల్సింది. కానీ, ఆరోగ్య సమస్య వల్ల కుదరలేదు. ఛావెజ్ చికిత్స పొందుతున్నందున దానిని అనధికార గైర్హాజరుగా పరిగణించాలని అన్న ప్రతిపక్ష వాదనలను వెనిజులా సుప్రీంకోర్టు కొట్టివేసింది. ప్రమాణ స్వీకారం చేయకున్నా కూడా ఛావెజ్ అధ్యక్షుడుగా తన కొత్త పదవి కాలాన్నీ కొనసాగించవచ్చని సుప్రీంకోర్టు జనవరి 9న ఒక స్పష్టమైన తీర్పునిచ్చింది.

## మాలిపై సామ్రాజ్యవాద దాడి

పశ్చిమ ఆఫ్రికా దేశమైన మాలిపై సామ్రాజ్యవాద దేశాల కన్ను పడింది. అక్కడి అపారమైన సహజ, ఖనిజ వనరులను దోచుకోవడానికి పన్నాగం పన్నుతున్నాయి. అల్‌ఖైదా అనుబంధ ఉగ్రవాద సంస్థలు మాలిని తమ అధీనంలోకి తీసుకున్నాయని, ఈ శక్తులు బలపడితే ఆఫ్రికాకే గాక, యూరప్‌కు కూడా ఉగ్రవాదం విస్తరించే ప్రమాదముందనే నెపంతో ఫ్రాన్స్, యూరప్‌లోని దాని మిత్రదేశాలు, అమెరికా దాడులు ప్రారంభించాయి. జనవరి 11న ఫ్రాన్స్ సేనలు మాలిలో ప్రవేశించి, తిరుగుబాటుదారుల స్థావరాలపై గగనతలం నుంచి దాడులు ప్రారంభించాయి. ఈ దాడులలో ఇప్పటికే అనేక మంది అమాయక పౌరులు మరణించగా, అనేక మంది గాయపడ్డారు. భారీ ఆస్తి నష్టం సంభవించింది. వీ

# బాధితులనే నేరస్తులను చేస్తున్న పితృస్వామ్య వ్యవస్థ

***స్త్రీలపై జరుగుతున్న అత్యాచార ఘటనలను నిరోధించడానికి నేరస్తులకు కఠినశిక్షలు, సంఘ బహిష్కరణలు విధించినా, అంతిమంగా స్త్రీలను చూసే దృష్టి కోణంలో మార్పు రానంతవరకు సమస్యలు పరిష్కారం కావని అంటున్నారు* కె. సుభాషిణి**

నిర్భయ, దామిని, అమానత్, అభయ – పర్యాయ పదాలుగా సమాజంలో నిలిచిపోయింది పారామెడికల్ విద్యార్థిని జ్యోతిసింగ్. కామాంధుల కామాగ్నికి బలై మృత్యువుతో పోరాడి అలసి నేల రాలిన ఓ మొగ్గ జ్యోతిసింగ్. సభ్య సమాజం సిగ్గుతో తలదించుకునే సంఘటన ఇది. ఢిల్లీలో డిసెంబర్ 16న రాత్రి స్నేహితుడితో పాటు బస్సు ఎక్కిన విద్యార్థినిపై ఆరుగురు మదమెక్కిన మ(మృ)గాళ్లు ఇనుప రాడ్లతో ఆ ఇద్దరిపై దాడిచేసి ఒకవైపు ఆమెను హింసిస్తూ, గాయపరుస్తూ – ఇంకొకవైపు ఆమెపై అత్యాచారం చేశారు. అడ్డు వచ్చిన ఆమె స్నేహితుడిని గాయపరిచారు. అత్యాచారానికి పాల్పడిన వారిలో బస్సు డ్రైవర్ కూడా ఒకడు. వాహనాలు, మనుషులు తిరుగుతున్న రద్దీ ప్రాంతాలలోనే బస్సును చక్కర్లు కొట్టిస్తూ, ఈ క్రూర అమానుష దుశ్చర్యకు పాల్పడ్డారు. స్పృహ కోల్పోయిన ఆ యువతి, ఆమె స్నేహితుడి దుస్తులను పూర్తిగా తొలగించి, బస్సులో నుండి కిందికి తోసి, రోడ్డుపక్కన పడేసి పరారయ్యారు. వారిద్దరూ కొన్ని గంటల పాటు నిస్సహాయంగా రోడ్డుపైన అలాగే పడి ఉన్నారు. తర్వాత ఎప్పుడో విషయం తెలుసుకున్న పోలీసులు ఆ ప్రాంతానికి చేరుకొని ఇద్దరినీ ఎయిమ్స్‌లో చేర్పించారు.

ఈ సంఘటనపై విద్యార్థి లోకం భగ్గుమంది. అత్యాచార బాధితురాలికి అండగా, నేరస్తులను కఠినంగా శిక్షించాలనే డిమాండ్‌తో దేశంలోని విద్యార్థి లోకం కదం తొక్కింది. వారికి మద్దతుగా మహిళా సంఘాలు, ప్రజా సంఘాలు మొత్తంగా పౌర సమాజం చెయ్యి కలిపింది. ఇది కేవలం విద్యార్థినుల సమస్య, స్త్రీల సమస్య అని చూడకుండా, ఇది సమాజం అంతటికి సమస్యే అని భావించారు. ఏ రాజకీయ పార్టీల జెండాలు, నాయకత్వం లేకుండా స్వచ్ఛందంగా ప్రజలు ఇంత భారీ ఎత్తున ఉద్యమించిన సందర్భం భారతదేశ చరిత్రలో బహుశా ఇదే మొదటిసారేమో. ప్రజలు ప్రధానంగా కోరుకున్నది పార్లమెంట్‌ను వెంటనే సమావేశపరిచి, చట్టాలను సవరించాలని, అత్యాచారం చేసిన నేరస్తులను తక్షణమే విచారించి ఉరి తియ్యాలని కసితో, ఆగ్రహంతో, ముక్తకంఠంతో డిమాండ్ చేశారు. రాష్ట్రపతి భవన్ ముట్టడికి ప్రయత్నించారు. గడ్డ కట్టించే చలిలో జంతర్ మంతర్ వద్ద నుండి కదలకుండా రాజకీయ నాయకులను నిలదీశారు.

ప్రజల నిరసన సెగ రాజకీయ నాయకులకు తగిలింది. స్వయంగా ప్రధానమంత్రి, హోం మంత్రి, ఢిల్లీ ముఖ్యమంత్రి, యుపిఎ చైర్‌పర్సన్ మొదలైన వారు నిరసనకారులతో నేరుగా మాట్లాడవలసిన పరిస్థితి వచ్చింది. బాధితురాలి పట్ల సానుభూతి చూపుతూ, నేరస్తులను ఎట్టి పరిస్థితులలోనూ వదలబోమనీ, వారిని కఠినంగా శిక్షిస్తామనీ వాగ్దానాలు చేశారు. ఆ సమయంలోనే కొంతమంది రాజకీయ నాయకులు అనుచిత వ్యాఖ్యలు, వివాదాస్పద వ్యాఖ్యలు చేస్తూ నోరు పారేసుకున్నారు. 'స్వాతంత్ర్యం వచ్చిందని అమ్మాయిలు అర్ధరాత్రి పూట తిరగడం ఏమిటి?', 'జంతర్ మంతర్ దగ్గర నిరసన తెలపడానికి వచ్చిన అమ్మాయిలు ఫ్యాషన్ పెరేడ్‌కు వచ్చినట్లున్నారు..', 'అత్యాచార సంఘటనలో బాధితురాలి పాత్ర కూడా సగం ఉంది. రెండు చేతులూ కలుస్తేనే చప్పట్లు.. అన్నా! మీ సోదరి లాంటి దాన్ని నన్ను వదిలిపెట్టండి అని వేడుకొని ఉంటే అత్యాచారం జరిగి ఉండేది కాదు..' మహా ఘనత వహించిన మన రాజకీయ నాయకులు, ఎంపిలు, ఆధ్యాత్మిక గురువులు వెల్లడించిన మనోవికారమైన, సంకుచిత మనస్తత్వ వ్యాఖ్యలు ఇవి.

అసలు నేరస్తులను వదిలి, బాధితురాలిదే తప్పు అని చూపించే ధోరణి మొదలు పెట్టారు. ఇలా మాట్లాడడం ఇదే మొదటిసారి కాదు. ఇలా మాట్లాడేవారిలో స్త్రీలు, పురుషులు ఇద్దరూ ఉన్నారు. స్త్రీలు రెచ్చగొట్టే దుస్తులు వేసుకుంటున్నారు, కాబట్టి అత్యాచారాలు జరుగుతున్నాయని చెప్తూ, చర్యకు ప్రతి చర్య ఉంటుంది అని అర్థం లేని వాదన చేస్తున్నారు. మరి ఆరేళ్ల పసిబాలికపైన, అరవై సంవత్సరాల వృద్ధ స్త్రీలపైన అత్యాచారాలు ఎందుకు జరుగుతున్నాయని ప్రశ్నిస్తే దానికి సమాధానం వారి దగ్గర ఉండదు. మహా అయితే పాప పుణ్యాల ప్రసక్తి తీసుకొని వస్తారు. తప్పంతా స్త్రీలదే అని మాట్లాడడం, వాదించడం ఈ సమాజంలో కొత్త కాదు. పురుషులు ఎలాంటి వెర్రి మొర్రి ఫ్యాషన్స్ అయినా అనుసరించ వచ్చు, కాని స్త్రీలు మాత్రం సాంప్రదాయపరంగా ఉండాలి, కట్టుబాట్లకు లొంగి ఉండాలి అనే పురుషాధిపత్య సంకుచిత అభిప్రాయాలు మాత్రం వీళ్లకు తప్పుగా అనిపించవు. అసలు స్త్రీలు వేసుకునే దుస్తులు ఎందుకు అసభ్యంగా కనిపిస్తున్నాయి? అలాంటి దుస్తులు ఎందుకు వేసుకుంటున్నారు? ఎవరు, ఎందుకోసం స్త్రీల చేత అలాంటి దుస్తులు వేసుకునేట్టు చేస్తున్నారు? ఇలాంటి ప్రశ్నలు వీళ్ల బుర్రలకు తట్టకపోవడం విచారకరం.

చలన చిత్ర పరిశ్రమలో డబ్బుతోపాటు స్త్రీ శరీరాన్ని పెట్టుబడిగా మార్చి వ్యాపారం చేస్తున్న అశ్లీల సంస్కృతిపై బాణాలు ఎక్కుపెట్టకుండా స్త్రీలదే తప్పు అని చెప్పడం ఏ భావజాలాన్ని సమర్థిస్తున్నట్టు? ఉత్పత్తి చేసిన వస్తువులను అమ్ముకోడానికి స్త్రీలను, స్త్రీ శరీర భాగాలను ప్రదర్శింప చేయిస్తూ, స్త్రీని విలాస వస్తువుగా, అంగడి బొమ్మగా మార్చిన వ్యాపార సంస్కృతి మీద పొరపాటున కూడా ఒక్క విమర్శ చేయకపోవడం ఎవరిని ఉద్ధరించడానికి? ఏ వర్గం కొమ్ము కాయడానికి? అశ్లీల సాహిత్యాన్ని, ద్వంద్వార్థ మాటలు సృష్టిస్తున్న బూతు పత్రికల గురించి నోరు మెదప రెందుకు? అర్ధరాత్రి పూట ప్రసారమయ్యే మసాలాలు, పాప్‌కార్న్‌లు, హాట్ హాట్ సీన్లను ప్రసారం చేసే టివి ఛానెళ్లను కట్టడి చేయరెందుకు? ఏ ఆడపిల్ల నన్ను కామెంట్ చేయండి, నాపై అత్యాచారం చేయండి అని అనదు. సమాజంలో వేళ్లూనుకొని పోయిన ఈ విష సంస్కృతిని

నిర్మూలించకుండా బాధితులనే వేలెత్తి చూపిస్తోంది ఈ సమాజం. ఇలాంటి సమాజంలో వేడుకోవడం, బతిమి లాడుకోవడంతో స్త్రీలపై జరిగే అన్ని రకాల వేధింపులను, అత్యాచారాలను ఆపడం సాధ్యమేనా?

భారతదేశ సంస్కృతి మహోన్నతమైనది. ఇక్కడ స్త్రీలను దేవతల వలే పూజిస్తారు. (నోరులేని రాతి బొమ్మను చేశారు.) కాని పాశ్చాత్య సంస్కృతి ప్రభావం లేని కాలంలో, భారతదేశంలో స్త్రీలు ఎలాంటి వేధింపులకు గురికాకుండా సంతోషంగా గడిపారా? లేదే. స్త్రీ పురుషుని కోసమే పుట్టింది. అతనిని సంతోష పెట్టడమే ఆమె జీవితానికి పరమావధి అని పురాణాలు, మను ధర్మ శాస్త్రాలు చెప్పాయి. మనుధర్మ శాస్త్రాన్ని సమాజంలో ఇంకా బలంగా వేళ్లూనుకునేట్టుగా చేయడానికి కంకణం కట్టుకున్నట్టున్నాడు రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ అధ్యక్షుడు. 'ఇంట్లో ఉండి భర్తకు వండి వార్చడం భార్య డ్యూటీ' అని స్త్రీల అభివృద్ధికి, మొత్తానికి సమాజ అభివృద్ధికి వ్యతిరేకమైన మాటలు మాట్లాడి తన అసలు బుద్ధిని బయట పెట్టుకున్నాడు. పురాణాలను నెత్తిన పెట్టుకొని పూజిస్తూ, ఇన్ని మాటలు మాట్లాడే ఈ మహాశయులకు ఇతిహాసాలు, పురాణాలు, రుక్మిణి కల్యాణం, జయదేవుని అష్టపదులు, చివరకు అన్నమాచార్యుని కీర్తనలు కొన్నింటిలోనూ స్త్రీ శరీర అవయవాలను పచ్చిగా, పుంఖాను పుంఖాలుగా వర్ణించిన వైనం గురించి తెలియనంత అమాయకులా వీళ్లు?

రాత్రి పూట డ్యూటీ చేసే ఉద్యోగంలో భాగంగానో లేదా ప్రయాణాల రీత్యానో లేదా అకస్మాత్తుగా ఏర్పడే అనారోగ్య కారణాల వల్ల ఆస్పత్రులకు వెళ్లడం మొదలైన అవసరాల కోసం స్త్రీలు పగలే కాదు రాత్రి కూడా బయట తిరిగే సందర్భాలు చాలా ఉంటాయి. రాజకీయ నాయకులు ఆరాధ్య దైవంగా భావించే గాంధీ 'స్త్రీ అర్ధరాత్రి పూట స్వేచ్ఛగా తిరిగినప్పుడే నిజమైన స్వాతంత్ర్యం వచ్చినట్టు' అన్న మాటలకు వీళ్లే తూట్లు పొడుస్తున్నారు. అంటే స్త్రీలకు ఈ దేశంలో స్వాతంత్ర్యం రాలేదు అని వాళ్లు అంగీకరిస్తున్నట్టేనా? సమాజంలో ఎవరైనా, ఎప్పుడైనా, ఎక్కడికైనా స్వేచ్ఛగా నిర్భయంగా తిరగగలిగే పరిస్థితులు కల్పించాలి కాని అర్ధరాత్రి పూట అమ్మాయిలు బయట తిరిగితే మరి ఇలానే అవుతుంది అని వ్యాఖ్యానించే వ్యక్తుల ఆలోచన ధోరణిని తీవ్రంగా వ్యతిరేకించాలి.

ఏరులై పారుతున్న మద్యం, అర్ధరాత్రి వరకు తెరిచి ఉంచే బ్రాందీ షాపులు, బార్లు లాంటివి స్త్రీల జీవితాలను ఎంతగా అతలాకుతలం చేస్తున్నాయో అందరికీ తెలిసిన విషయమే. మద్యం అమ్మకాలు పెంచడం ద్వారా మరింత ఆదాయాన్ని పెంచుకుంటున్న మన ప్రభుత్వాలకు స్త్రీల సమస్యలను పరిష్కరించడంలో ఉన్న చిత్తశుద్ధి ఏపాటిదో మనకు తేట తెల్లమవుతోంది.

స్త్రీలపైన దాడులు, అత్యాచారాలు నిరోధించడానికి ఎలాంటి రక్షణ చర్యలు తీసుకోవాలి, ఒకవేళ నేరస్తులకు విధించాల్సిన శిక్ష ఏమిటి అనే చర్చ ప్రస్తుతం చాలా తీవ్రంగా నడుస్తోంది. విద్యార్థినులకు కరాటే నేర్పాలని, దగ్గర కారం పొట్లాలు పెట్టుకోవాలని (కొన్ని ప్రాంతాలలో కారం పొట్లాలు పంచారు కూడా), బస్సులలో, రైళ్లలో పోలీసు రక్షణ ఏర్పాటు చేయించాలని, సిసి కెమెరాలు అమర్చాలని రకరకాల సలహాలు, ప్రతిపాదనలు ప్రజల ముందుకు వచ్చాయి. మరి ఇండ్లల్లోనూ, బహిర్భూమికి వెళ్లినప్పుడు, పనిచేసే ప్రదేశాలలో జరిగే వేధింపులు, అత్యాచారాల మాట ఏమిటి? వారికి ఎలాంటి రక్షణ కల్పించాలి?

ఈ సమాజంలో మనుగడ సాగించాలి అంటే స్త్రీలు తమను తామే రక్షించుకోవాలన్న మాట! అసలు స్త్రీలు తమను తాము రక్షించుకునే అవసరం ఈ సమాజంలో ఎందుకు వచ్చింది? ఎవరి నుండి వారికి రక్షణ కావాలి? అంటే స్త్రీలను హింసించే, వేధించే, అత్యాచారం చేసే, మట్టుబెట్టే ఒక వర్గం ఈ సమాజంలో ఉందన్న మాట. స్త్రీని కేవలం సెక్స్ సింబల్‌గా చూస్తున్న విలువలు, సంస్కారం, మానవత్వం ఏ కోశానా లేని ఈ మనుషులు స్త్రీలను చూసి ఏదో అని, ఏదో చేసి పైశాచికానందం పొందుతున్నారు. ఈ ప్రవృత్తిని మార్చడానికి ఎలాంటి చర్యలు తీసుకుంటున్నారు? నేరస్తులను సత్వరమే విచారించి కఠినంగా శిక్షిస్తే సరిపోతుందా? జ్యోతిసింగ్‌పై అత్యాచారం చేసి, ఆపై హత్య చేసిన (అత్యాచార సంఘటన స్థలం వద్ద డిసెంబర్ 16న ఆమె చనిపోలేదు. చావు బతుకుల మధ్య కొట్లాడిన ఆమె తరువాత సింగపూర్ ఆస్పత్రిలో డిసెంబర్ 28న మరణించింది) నేరస్తులు అందరిని ఉరి తీయడమో, లేదా వారిని కాల్చి చంపడమో లేదా నపుంసకులుగా మార్చడమో చేస్తే సరిపోతుందా? ఈ శిక్షలు అమలు కావడానికి అవసరమైన చట్టాలు చేసి, నేరస్తులను శిక్షించిన తర్వాత, ఇక మీదట స్త్రీలపైన ఎలాంటి దాడులు, అత్యాచారాలు జరగవు అని ఈ వ్యవస్థ భరోసా ఇవ్వగలదా? ఇవ్వదు. ఇచ్చినా అది సాధ్యం కాదు అని ఢిల్లీ రేప్ సంఘటన తర్వాత వరుసగా దేశవ్యాప్తంగా జరుగుతున్న అత్యాచారాల ఘటనలు మనకు రుజువు చేస్తున్నాయి.

సెకన్ల వ్యవధిలో స్త్రీలపై వేధింపులు, నిమిషాల వ్యవధిలో స్త్రీలపై దాడులు, అత్యాచారాలు, గంటల వ్యవధిలో స్త్రీ హత్యలు జరుగుతున్నాయి అని మన గణాంకాలు తెలుపుతున్నాయి. ఈ నేరస్తులు అందరినీ శిక్షించాలని అంటే మనకున్న న్యాయస్థానాలు, జడ్జీలు, జైళ్లు ఏ మాత్రం సరిపోవు. అంటే దీనర్థం నేరస్తులను వదిలి వెయ్యమని కాదు. తప్పు చేసిన ప్రతి ఒక్కరికి శిక్ష పడాల్సిందే. అది కూడా నేరం జరిగాక సంవత్సరాల తరబడి విచారణ జరిపే పద్ధతిలో కాకుండా సత్వరమే విచారణ జరిపి శిక్షను వెంటనే అమలు చేయాలి. దీనికి సంబంధించి ప్రభుత్వాల మీద ఒత్తిడి తీసుకొని రావాలి.

నిరసనలు, ఉద్యమాలు చేసే సందర్భాలలో బాధితుల కొరకు ప్రజలతో గొంతు కలిపే కొన్ని శక్తులను చూసి సమాజమే కొయ్యబారి పోతూ ఉంటుంది. గతంలో అన్నా హజారే నిర్వహించిన అవినీతి వ్యతిరేక ఉద్యమంలో అన్నా హజారేకు మద్దతు పలికిన వాళ్లలో పారిశ్రామిక వేత్తలు, పెట్టుబడిదారులు, రాజకీయ నాయకులు ఉన్నారు. స్పష్టత లేని ఉద్యమంగా అది నిలిచిపోయింది. ఢిల్లీ రేప్ సంఘటనకు వ్యతిరేకంగా ఉద్యమించిన విద్యార్థులు, ప్రజలతో గొంతు కలిపిన బాధితురాలికి సానుభూతి ప్రకటించిన వాళ్లు – స్త్రీ శరీరాన్ని అశ్లీలంగా, అవమానకరంగా తమ వ్యాపార ప్రకటనల్లో వాడుకుంటున్న వ్యాపార వేత్తలు, స్త్రీ శరీరం పెట్టుబడిగా సినిమాలు తీస్తున్న నిర్మాతలు, నటిస్తున్న నటులు, వీటినన్నింటినీ పరోక్షంగా, ప్రత్యక్షంగా ప్రోత్సహిస్తున్న రాజకీయ నాయకులు. ప్రజలు చైతన్యవంతులయితే తమ పునాదులు కదులు తాయని వీళ్లకు తెలుసు. అందుకే ముందు జాగ్రత్త చర్యలో భాగంగా స్త్రీలపై చాలా గౌరవం ఉన్నట్టు ఇలాంటి నిరసన కార్యక్రమాల్లో పాల్గొని బుడి బుడి రాగాలు తీస్తుంటారు. వీరిని చూస్తుంటే దొంగనే 'దొంగ దొంగ పట్టుకోండి' అని అరిచినట్టుగా ఉంది. మళ్లీ వారే నేరస్తులకు ఉరిశిక్షే సరి అయినది అని ప్రకటనలు ఇస్తున్నారు. స్త్రీలను అవమానిస్తూ, వారి పరిస్థితి రోజురోజుకూ దిగజారుస్తూ, వారి సమస్యలకు ప్రధాన కారకులుగా మారిన ఈ నేరస్తులను ఎన్నిసార్లు ఉరి తియ్యాలి?

# కఠిన శిక్షలు సమస్యకు పరిష్కారమా?

*మహిళలపై జరుగుతున్న దాడులకు కారణాలను వివరిస్తూ, వీటికి కఠిన శిక్షలు మాత్రమే పరిష్కారం కావనీ, మూల కారణాలను పరిష్కరించాలనీ అంటున్నారు* **కె. కిషోర్ కుమార్**

ఇటీవల సంచలనం సృష్టించిన ఢిల్లీ గ్యాంగ్ రేప్ సంఘటనకు వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా ప్రజలు తమ ఐక్యతను చాటుతూ నిరసన ఉద్యమాలు చేపట్టారు. ఇది ప్రజా చైతన్యాన్ని ప్రపంచానికి చాటే ఒక గొప్ప పరిణామం. ఈ సంఘటన దేశంలో అనేక చర్చలకు దారితీసింది. ఇక నుంచి మానభంగం నిందితులను ఎన్‌కౌంటర్ చేయాలని లేదా వారికి రసాయన వంధ్యత్వం కలిగించాలని లేదా మరణ శిక్ష విధించాలంటూ అనేక ప్రతిపాదనలు, డిమాండ్లతో చర్చలన్నీ ముందుకు వచ్చాయి.

మానభంగం అనే చర్య నిస్సందేహంగా మహిళపై అతి పెద్ద నేరపూరిత దాడి. కాని, మహిళలపై రకరకాల దాడులకు ఉసిగొలుపుతున్న ప్రేరేపిత లేదా ప్రభావిత కారణాలను పూర్తిగా విడిచిపెట్టి సమస్యకు పరిష్కారం చూడాలనుకోవడమే దురదృష్టకరం. మితిమీరిన కఠిన శిక్షలు కేవలం ప్రతీకార చర్యగా మాత్రమే ఉపయోగపడతాయి కాని అరుదుగా కాకుండా నిరంతర ప్రక్రియగా కొనసాగుతున్న ఇలాంటి దాడులను పూర్తిగా లేదా ఎక్కువ శాతం నిలువరిస్తాయని అనుకోవడం పొరపాటే. ఎందుకంటే మహిళలపై దాడులకు ప్రేరేపిత అంశాలు ఈ సమాజంలో చాలా బలమైనవి. అవి ఎంత బలమైనవంటే కేవలం వాటి అండదండలతోనే దేశంలోని అనేక ప్రజాస్వామ్య ప్రభుత్వాలు మనుగడ సాగిస్తున్నాయి. అలాంటి ప్రభుత్వాల పాలనలోనే 100 కోట్లు పైబడి ప్రజలు పౌరులుగా గుర్తింపు బతుకు సాగిస్తున్నారు. వాటిలో అత్యంత ప్రధానమైనది మద్యం. కాలాన్ని బట్టి నదులు ఎండిపోతున్నాయి కాని మన దేశంలో మద్యం మాత్రం నిరంతరం ఏరులై పారుతూనే ఉంది. మద్యపానాన్ని నియంత్రించేందుకు మొక్కుబడిగా ప్రభుత్వం ఆధ్వర్యంలో ఓ సంస్థ అయితే ఉంటుంది కాని ప్రభుత్వాలకు మించిన మత్తుతో అది సాధించిన ఘనత అన్నివేళలా శూన్యం. అదే మద్యపాన నియంత్రణలో ప్రభుత్వ చిత్తశుద్ధికి నిదర్శనం. ఓపక్క ఈ ప్రభుత్వాలు నియమాలను పూర్తిగా ఉల్లంఘిస్తూ నిస్సిగ్గుగా మద్యం వ్యాపార అనుమతులను, మద్యం అమ్మకాల పెంపు కోసం మార్గాలను ప్రత్యక్షంగా పెంచుతూ, శాయశక్తులా ప్రోత్సహిస్తూ మరోపక్క మద్యపాన నియంత్రణ కోసం మొక్కుబడి ఏర్పాట్లు చేపడుతున్నాయి.

సమాజంలో పేరుకుపోయిన లింగ వివక్షత గురించి మాట్లాడకుండా కేవలం శిక్షల గురించి, ఉరి గురించి మాట్లాడుతూ సమస్యను పక్కదారి పట్టేట్టుగా చేస్తున్నారు. వీరి మోసాలను, కుట్రలను గమనించకుండా, గుడ్డిగా వారి వెంట నడిస్తే వారి వ్యాపార అభివృద్ధికి, వారి ఎదుగుదలకు రక్షణ గోడలుగా ప్రజలు తయారు అయ్యే ప్రమాదం ఉంది.

ఉరిశిక్ష అమలు చేస్తే సెకన్ల వ్యవధిలో ప్రాణాలు పోతాయి. ఇక నేరస్తులలో పశ్చాత్తాపానికి, పరివర్తనకు తావు ఉండదు. నేరస్తులు ప్రతి నిమిషం సిగ్గుతో చితికిపోయి, కుంగిపోయేటట్టుగా చేయాలి. సాంఘిక బహిష్కరణ ద్వారా అలా చేయడానికి వీలు ఉంటుంది. వారికి ఎవ్వరూ సహకరించకూడదు. మాట్లాడకూడదు. బాధితుల సంబంధికులే కాకుండా, నేరస్తుల కుటుంబ సభ్యులతో సహా సమాజం మొత్తం వారిని సంఘ బహిష్కరణ చేసి తీవ్రంగా నిరసన తెలపాలి. ఇలా చేస్తే కేవలం నేరస్తులలో పరివర్తన, పశ్చాత్తాపం కలగవచ్చేమో కాని, సమాజంలో స్త్రీని చూసే దృష్టి కోణంలో మార్పు రానంతవరకు స్త్రీలకు సమస్యల నుండి విముక్తి దొరకదు.

స్త్రీలను అవమానించే, అవహేళన చేసే, అణచి ఉంచే శక్తులు ఏవి అని గమనించాలి. స్త్రీ ఒక వ్యాపార వస్తువుగా తయారు చేయబడుతోంది. అలా తయారు చేయడంలో తల్లిదండ్రులు, పాఠశాలలు, కళాశాలలు, అశ్లీల సాహిత్యం, సినిమాలు, మీడియా, వ్యాపార సంస్థలు ఇవన్నీ ఎవరికి తగ్గ పాత్ర వాళ్లు పోషిస్తున్నారు. ఎవరో నడిపిస్తే నడిచినట్టుగా కాకుండా సొంతంగా ఆలోచించడం మొదలు పెట్టాలి. ఆడపిల్ల, మగపిల్లవాడు అనే తేడా లేకుండా సమానంగా పిల్లలను పెంచే అవగాహన తల్లిదండ్రులకు ఉండాలి. సమాజంలో స్త్రీలు సగభాగం, సాటి మనుషులుగా వారి హక్కులను గౌరవించాలి. వారికి ఇష్టాయిష్టాలు, కోరికలు ఉంటాయి అని సమాజం మొత్తం అంగీకరించాలి. స్త్రీల భాగస్వామ్యం లేనిదే సమాజం పురోగమించదు అన్నది నగ్న సత్యం. స్త్రీలు తమ హక్కులను స్వేచ్ఛగా అనుభవిస్తున్నప్పుడే సంతోషంగా ఉండగలరు. అప్పుడే అభివృద్ధికి అవకాశం ఉంటుంది. తద్వారా సమాజం కూడా అభివృద్ధి చెందుతుంది. వేధింపులు, దాడులు, అత్యాచారాలు, దోపిడీలు లేని సమాజాన్ని మాత్రమే అభివృద్ధి చెందిన సమాజం అని అనగలం.

ఢిల్లీ రేప్ సంఘటనకు స్పందించి, దానికి వ్యతిరేకంగా ఉద్యమించిన ప్రజలను, వారి ఆగ్రహాన్ని చూసి ప్రభుత్వాలకు దడ పుట్టింది. ఇదే స్పందన, ఇదే స్ఫూర్తి ఏ బాలికపైన గాని, ఏ స్త్రీపైన కాని సమాజంలో ఇలాంటి అత్యాచారాలు జరిగినప్పుడు కూడా ఉండాలి. జాతి, మత, కుల, ప్రాంత, పేద, ధనిక వివక్షత లేకుండా, అలాంటి బాధితులకు అండగా నిలబడుతూ, వివక్షత లేని సమాజం కొరకు, స్త్రీల హక్కుల కొరకు ఉద్యమాలను కొనసాగించడమే 'నిర్భయకు' మనం ఇచ్చే నిజమైన నివాళి.

*(రచయిత గణిత శాస్త్ర అధ్యాపకులు, మహిళా ఉద్యమ కార్యకర్త)* వీ

ఈ రెండు ప్రభుత్వ చర్యల మధ్య నిరవధికంగా నవ్వులపాలవుతున్నది సాక్షాత్తూ మహాత్మాగాంధీ అయితే ప్రత్యక్షంగా తీవ్రంగా నష్టపోతున్నది కేవలం ప్రజలు, అందులో ప్రధాన బాధితులు మద్యపానంతో సంబంధం లేని మహిళలు. సమాజంలో మహిళలపై దాడులకు, గృహహింసకు ప్రధాన కారణం మద్యమేనని సుదీర్ఘకాలంగా అనేక ప్రజాసంఘాలు, స్వచ్ఛంద సంస్థలు, సర్వేలు ప్రభుత్వానికి విన్నవించుకుంటున్నప్పటికీ దున్నపోతులకున్నంత స్పర్శ కూడా కాలక్రమేణా ఏ ఒక్క ప్రభుత్వానికీ లేకుండా పోయింది. పైగా మద్యం అనుబంధ వ్యాపారాలు, కార్యకలాపాలు కూడా ప్రభుత్వాల ప్రోత్సాహంతో, రక్షణతో రోజురోజుకూ పెరిగిపోతున్నాయి. వాటిలో అర్ధరాత్రి వరకు సాగే పబ్‌లు ఒక ఉదాహరణ మాత్రమే. ఇక్కడ మనిషి మానసికంగా, శారీరకంగా పూర్తిగా అదుపు తప్పేందుకు మద్యంతో పాటు ప్రత్యామ్నాయ మత్తు పదార్థాలు అనేకం ఎల్లప్పుడూ అందుబాటులో ఉంటాయి.

మహిళలపై మానసిక, శారీరక దాడులకు మరో ప్రేరేపిత ప్రధాన కారణం నేడు నెలకొని ఉన్న సినిమా సంస్కృతి. ప్రతి సినిమాలో ఒక 'ఐటం సాంగ్' ఉండాల్సిందే. ఐటం సాంగ్ అంటే నర్తకి చూపరులను కవ్వించి ఆకట్టుకునే హావభావాలతో అంగాంగ ప్రదర్శన చేయాల్సిందే. ఈ ఐటం సాంగ్ సహజంగా సినిమాలో చూపించే అశ్లీలానికి అదనం. ఇది అశ్లీలం కానే కాదు అవసరం, కథ డిమాండ్ చేస్తోందనేది ఏలిన వారి నీడలో స్వేచ్ఛగా పబ్బం గడుపుకుంటున్న సినీ పరిశ్రమ 'ఫిక్స్‌డ్' వాదన. ఓపక్క ఎవరో ఒక మనిషి రాసిన కథ మహిళను అంగాంగ ప్రదర్శన చేయమని శాసిస్తున్నది. మరోపక్క నాగరికత ముసుగులో మహిళలను అగౌరవపరిచే విధంగా సాగుతున్న ఇలాంటి మితిమీరిన అనాగరిక చర్యలను నిషేధించాల్సిన ప్రభుత్వ సెన్సార్ బోర్డు అందుకు తందానా అంటున్నది. ఇది నిరంతరం యధేచ్ఛగా సాగుతున్న వికృత ప్రక్రియ. ఈ భాగోతానికి తోడు పాలకవర్గాలు అడపాదడపా సినిమా వేడుకలకు హాజరవుతూ ఆహా.. ఓహో... అంటూ సినిమా సమాజంపై శిఖరస్థాయి పొగడ్తలు, రాయితీలు, ప్రభుత్వ ఆస్తులు కుమ్మరిస్తుంటారు. వాస్తవానికి సినిమాలో అంగాంగ ప్రదర్శనను డిమాండ్ చేసేది కేవలం పెట్టుబడి, పెట్టుబడిదారుడి అత్యాశే కాని మరోటి కాదు. అత్యంత బాధాకరమైన విషయమేమిటంటే ఈ దుష్ట సంస్కృతి టెలివిజన్ ఛానళ్లకు కూడా పాకి నట్టింట్లో చేరింది. టీవీ ఛానళ్లలో, సినిమాల్లో ప్రదర్శించే అశ్లీలం, అంగాంగ ప్రదర్శన, హింస తదితర మితిమీరిన అంశాలు సమాజంపై దుష్ప్రభావం చూపవని ఏ మానసిక వైద్య నిపుణుడైనా చెప్పగలరా? వేలాది కోట్ల రూపాయలతో ముడిపడి ఉన్న వ్యాపారం కనుక వాటికి భంగం కలిగించొద్దనుకునే ధోరణిలో ప్రభుత్వాలు తమ అవసరార్థం చూసీచూడనట్టుగా నేడు వ్యవహరిస్తున్నాయి. ఇలాంటి ప్రభుత్వాల నుంచి మహిళలకు ఎలాంటి రక్షణ లభిస్తుందని ఆశించొచ్చు? వీటికి తోడు మన దేశంలో ఇంటర్నెట్ కార్యకలాపాలపై ఎలాంటి నియంత్రణ లేదు. ఇంటర్నెట్ ద్వారా లభించే అశ్లీలం నేడు వయస్సు నిమిత్తం లేకుండా అందరికీ అందుబాటులో ఉంది. ఇవన్నీ మనిషి మానసిక ధోరణిని బలహీనపరచడానికి దోహదపడే అంశాలు. అశ్లీల చిత్రాలను, అశ్లీల సాహిత్యాన్నందించే పోర్న్ వెబ్‌సైట్‌లను మన దేశంలో తక్షణమే నిషేధించాలని గతంలో భారత ప్రధాన న్యాయమూర్తి హోదాలో కెజి బాలకృష్ణన్ కేంద్ర ప్రభుత్వాన్ని కోరారు. అంతేకాకుండా, ఇదే తరహాలో రాజకీయ నాయకులు, ప్రజాసంఘాలు, సామాజిక కార్యకర్తలు మరెందరో అడపదడపా ప్రభుత్వాలకు విజ్ఞప్తి చేస్తున్నప్పటికీ కనీస స్పందన కూడా కరువయ్యింది.

మహిళలపై దాడులకు మరో ప్రధాన కారణం వరకట్నం. దేశంలో వరకట్నం నిషేధ చట్టం రూపొందించి సుమారు 52 సంవత్సరాలయ్యిందంటే ఎవరికైనా ఆశ్చర్యం కలుగక మానదు. ఎందుకంటే అమలులో ఈ చట్టం పూర్తిగా వైఫల్యం చెందిందనేది జగమెరిగిన వాస్తవం. సామాన్య పౌరుడి నుంచి చట్టాల రూపకల్పనతో సంబంధం ఉన్నవారి వరకు అందరూ ఈ చట్టాన్ని యధేచ్ఛగా ఉల్లంఘించిన వారే, ఉల్లంఘిస్తున్న వారే. దశాబ్దాలుగా వరకట్నం వేధింపులలో భాగంగా తీవ్రమైన, క్రూరమైన గృహహింసకు గురైన లక్షలాది మంది మహిళల చేదు అనుభవాలను ఆయుధంగా చేసుకుని చేపట్టిన ఉద్యమాల ఫలితంగా 1961లో ప్రవేశపెట్టిన వరకట్న నిషేధ చట్టం ప్రాథమిక అమలుపై నాటి నుంచి నేటి వరకు కనీస స్థాయిలో ప్రభుత్వపరంగా పర్యవేక్షణ కూడా లేదు. మహిళ అభ్యున్నతి కోసం, రక్షణ కోసం రూపొందించిన చిన్నా, పెద్దా అనేక చట్టాలు పూర్తిగా అమలుకు నోచుకోక ఈ రకంగా అపహాస్యం పాలవుతున్నవెన్నో!

ఇవన్నీ బహిరంగ సమాజంలో ప్రతి మనిషి కనుసన్నల్లో ప్రతినిత్యం మహిళల శారీరక, మానసిక జీవితాలపై జరుగుతున్న దాడులకు దారితీస్తున్న కొన్ని మూల కారణాలు మాత్రమే. మహిళలపై జరిగే మానసిక, శారీరక దాడులకు ఇలాంటి మరెన్నో ప్రేరేపిత లేదా ప్రభావిత అంశాల ప్రక్షాళన జరుగనంతకాలం కేవలం కఠిన శిక్షలతో సమాజంలో మార్పు ఆశించడం అమాయకత్వం మాత్రమే కాదు దాడులకు మూల కారణాలు సమాంతరంగా మరింత బలపడటానికి దోహదపడుతుంది తద్వారా మరిన్ని అనర్థాలకు దారితీస్తుంది.

*(రచయిత పాత్రికేయులు)* వీ

# అత్యాచారాలు ఎందుకు జరుగుతున్నాయి?

***ఇటీవల మహిళలపై పెరిగిన అత్యాచార దాడులకు సామ్రాజ్యవాద దళారీ ప్రభుత్వాలు దేశంలో జొప్పిస్తున్న విష సంస్కృతే ప్రధాన కారణమని అంటున్నారు* లోక సంచారి**

**2012** గణాంకాల ప్రకారం భారతదేశంలో ప్రతి 21 నిమిషాలకు ఒక స్త్రీ లేదా బాలిక లైంగిక అత్యాచారానికి గురవుతున్నది. బయటకు చెప్పకుండా తమలోనే లేదా కుటుంబ పరిధిలోనే దాచుకుంటున్న వారిని కూడా పరిగణలోకి తీసుకుంటే దేశవ్యాప్తంగా ప్రతి నిమిషానికి ఎక్కడో ఒకచోట స్త్రీలు లైంగిక అత్యాచారాలకు గురవుతున్నారు. చాలా సందర్భాలలో అత్యాచారం తర్వాత హత్యలకు గురైతున్నారు.

ఇంత చెడు ఎందుకు జరుగుతుంది? అది రోజు రోజుకూ ఎందుకు పెరుగుతుంది? దానికి మూలాలు ఏమిటి? కారకులు ఎవరు? శాశ్వత పరిష్కారాలు ఏమిటి అనే విషయాలు ప్రతి ఒక్కరు ఆలోచిస్తేనే మన తర్వాత తరాలకు భద్రత ఉంటుంది. అయితే, సామ్రాజ్యవాదులు, భారత దళారీ పాలక వర్గాలు, వీరి ఆధీనంలో ఉన్న కార్పొరేట్ మీడియా మాత్రం ప్రజలు తాము ఎదుర్కొంటున్న ఏ సమస్యకు కూడా మూలాలను తెలుసు కోకూడదని కోరుకుంటున్నాయి. ఎందుకంటే, సమస్యలకు మూలాలు ఏమిటి, వాటికి కారకులు ఎవరు అని అర్థమయితే, ఆ సమస్యలకు శాశ్వత పరిష్కారాలు అర్థం కావడం సులభమవుతుంది.

అసలు లైంగిక అత్యాచారాలు ఎందుకు జరుగుతున్నాయి? వాటి మూలాలు ఏమిటి? పాలక వర్గాలు, వారి మీడియా ప్రకారం అత్యాచారాలు జరగడానికి కేవలం వ్యక్తులే కారణం. కాబట్టి ఆ వ్యక్తులను తీవ్రంగా శిక్షిస్తే భవిష్యత్తులో మిగితా వారు భయంతో అత్యాచారాలు చేయరనేది వారి వాదన. అత్యాచారాలు చేయడం కొందరి మగవారి నైజం, అంతే తప్ప ఈ వ్యవస్థ నిర్మాణానికి ఆ వ్యక్తుల చర్యలతో ఏ మాత్రం సంబంధం లేదు అనేది వారి వాదన. వీరి వాదన ప్రకారం చూస్తే భారతదేశ చరిత్రంతా అత్యాచారాలు ఈ స్థాయిలోనే జరిగి ఉండాలి. అలా జరిగాయా? వాస్తవాలు తద్విరుద్ధంగా ఉన్నాయి. 1991లో ప్రపంచీకరణ మొదలు పెట్టిన తర్వాత మరింతగా స్త్రీలపై అత్యాచారాలు కానీ, ఇతర అనేక రకాల నేరాలు కానీ ప్రతి సంవత్సరం పెరుగుతూ ఉన్నాయి. ఇలా పెరగడానికి వ్యవస్థలో జరిగిన మార్పులు ఒకానొక కారణం తప్ప మానవ నైజం కాదు. ప్రతి వ్యక్తి కూడా వ్యవస్థలో భాగమై అందరితో పాటు బతుకుతున్నాడు తప్ప ఏకాకిగా కాదు. అంటే వ్యక్తుల మానసిక స్థితి లేదా ఆలోచన విధానం ఆ వ్యవస్థలోని సామాజిక, సాంస్కృతిక, రాజకీయార్థిక పరిస్థితులపై, నిర్మాణంపై ఆధారపడి ఉంటుంది.

1991 తర్వాత నీలి చిత్రాల వీడియో క్యాసెట్లతో భారతదేశ నగరాల్ని ముంచెత్తారు. అలాగే, ఛానెళ్లలో ఇంగ్లీష్ శృంగార సినిమాలను ప్రసారం చేయడం మొదలుపెట్టారు. చెన్నైలో నీలి చిత్రాల డివిడిలను కిలోల లెక్కలో అమ్ముతున్నారు. బ్లూఫిల్మ్‌లు అమ్మకానికి లేదా అద్దెకు దేశమంతటా దొరుకుతున్నాయి. సెల్‌ఫోన్‌ల పుణ్యమా అని దేశమంతటా బ్లూఫిల్మ్‌లను సెల్‌ఫోన్‌లలోకి ఎక్కించే వ్యాపారం మొదలయింది.

సామ్రాజ్యవాదుల విశృంఖల సెక్స్ సంస్కృతికి ఇంటర్నెట్ ఒక ప్రధాన అడ్డాగా మారింది. ఒక వ్యక్తి చూసిన నీలి చిత్రాన్ని రెండవసారి చూడకుండా తన జీవిత కాలమంతా చూస్తూపోయినా అయిపోనన్ని నీలిచిత్రాలను ఇంటర్నెట్‌లో లభ్యమవుతున్నాయి. పైపెచ్చు ఇవన్నీ ఉచితం. గూగుల్ సంస్థ ప్రకారం భారతదేశ ప్రజలు నెట్‌లో చేసే 'సర్చ్'లో సెక్స్ అనేది ప్రథమ స్థానంలో ఉన్నదని తెలిపింది.

టివి ఛానెళ్లలో వచ్చే శృంగార సన్నివేశాలకు లెక్కే లేదు. టివి ఉన్న వారి ఇంట్లో పెరిగే పిల్లలు రెండు సంవత్సరాల వయసు నుండి ఇరవై సంవత్సరాల వయసు వచ్చే వరకు రోజుకు రెండు గంటల చొప్పున కేవలం తెలుగు, హిందీ సినిమాలు, వాటి సంబంధిత ప్రోగ్రాంలు మాత్రమే చూసినప్పటికీ, ఈ పద్దెనిమిది సంవత్సరాల సమయంలో లక్షల కొద్ది శృంగార, అర్థనగ్న సన్నివేశాలను అనివార్యంగా చూస్తున్నారు, డైలాగులను, పాటలను వింటున్నారు. అంటే ఎంతగా సెక్స్ కల్చర్ వారి మెదళ్లలోకి చిన్నప్పటి నుండే ఎక్కిస్తున్నారో ఊహించండి.

పాలకవర్గాలు అన్ని దిక్కుల నుండి (అంటే టివిలు, సినిమాలు, పాటలు, మాటలు, ఇంటర్నెట్, సెల్‌ఫోన్, డివిడిలు, మేగజైన్‌లు, పత్రికలు, పుస్తకాలు, పబ్‌లు, లైవ్‌షోలు, రికార్డింగ్ డాన్స్‌లు మొదలైనవి) వరదలా దింపిన, దింపుతున్న సెక్స్ కల్చర్‌కు టీనేజర్లు, యువత, ఇతరులు ప్రభావితులు కావడం లేదని ఎవరైనా అనుకుంటే వారంత అమాయకులు ఎవరూ ఉండరు. హైదరాబాద్ శివార్లలో ఉన్న ఒక వృత్తి విద్యా కళాశాలలో ప్రతి యేటా అర్ధరాత్రి వరకు జరిగే 'స్టూడెంట్ ఫెస్ట్' మరుసటి రోజున క్లీన్ చేసేప్పుడు ఒక బకెటు నిండేన్ని వాడిన కండోమ్‌లు పడవేసి ఉంటాయని ఆ సంస్థలో పనిచేసే వారు నాకు చెప్పారు. విదేశాలకు టూర్లు ఆపరేట్ చేసే నాకు తెలిసినతను చెప్పిన విషయం ఏంటంటే, ఆంధ్రప్రదేశ్ నుండి ప్రతిరోజూ జనాలు ఉజ్బెకిస్తాన్, థాయిలాండ్, సింగపూర్ దేశాలకు కేవలం సెక్స్ టూరిజంలో భాగంగా వెళుతున్నారు. ఆంధ్రప్రదేశ్‌లోని ప్రధాన నగరాలలో 'వైఫ్ స్వాపింగ్ గ్రూపు'లు (అంటే ఆ గ్రూపులోని వ్యక్తులు తమ భార్యలను ఒకరితో ఒకరు షేర్ చేసుకుంటారు) నడుస్తున్నాయి. యువకులకు కౌన్సెలింగ్ చేసే నా మిత్రుడు ఒకతను చెప్పింది ఏమంటే, సెక్స్ కోరికలు తట్టుకోలేక యువత హోమో సెక్సువాలిటీకి కూడా పాల్పడుతున్నారని అన్నాడు. ఆరవ తరగతి పిల్లలు సెల్‌ఫోన్‌లో నీలి చిత్రాన్ని చూస్తూంటే పట్టుకొని కౌన్సెలింగ్ ఇచ్చినట్టు చెప్పాడు.

అందుకే, సామ్రాజ్యవాదులు, వారి దళారీలు అన్ని దిక్కుల నుండి దింపుతున్న సెక్స్ కల్చర్ అనే సామ్రాజ్యవాద విష సంస్కృతి, దాని ప్రభావం భారత యువతపై, టీనేజర్లపై, మొత్తంగా భారత ప్రజానీకపు ఆలోచనా విధానంపై ఏ స్థాయిలో చెడు ప్రభావాల్ని చూపుతుందో పరిశోధించకుండా లైంగిక అత్యాచారాల మూలకారణాలను అర్థం చేసుకోలేం. ప్రజల సంస్కృతితో పాలకవర్గాలు ప్రభావితులు కారు. పాలకవర్గాల సంస్కృతిని లేదా వారు ప్రమోట్ చేస్తున్న సంస్కృతితోనే ప్రజలు ప్రభావితులవుతారు. అలనాటి రోమన్, గ్రీక్ సామ్రాజ్యపు కాలం నుండి నేటి సామ్రాజ్యవాదపు కాలం వరకు చరిత్ర అదే తెలుపుతుంది. ఉదాహరణకు, అలనాటి గ్రీక్ సామ్రాజ్యపు చరిత్రలో 'కలీగులా' అనే రాజు విశృంఖల సెక్స్ కోరికలకు పెట్టింది పేరు. ఆ విశృంఖల లైంగిక సంస్కృతి ప్రజలలోకి కూడా పాకింది. చివరికి అతనిపై తిరుగుబాటు చేసి హతమార్చారు.

మనం అర్థం చేసుకోవాల్సింది ఏంటంటే, సామ్రాజ్యవాదులు, వివిధ దేశాలలోని వారి దళారీలు ప్రపంచ ప్రజల శ్రమను, వనరులను దోపిడీ చేస్తూ, ఆ దోపిడీ ప్రజలకు అర్థం కాకుండా చేయడానికి, అర్థమైనప్పటికీ పాలకవర్గాలను ఎదిరించే శక్తి, ఆసక్తి లేకుండా చేయడానికి ప్రజలను నిరంతరం రకరకాల వినూత్న వ్యసనాలకు, మత్తులకు, భ్రమలకు, భయాలకు గురిచేసే సంస్కృతిని వారు ప్రమోట్ చేస్తున్నారు. సామ్రాజ్యవాద సంస్కృతిని మన దేశంలో 'పాశ్చాత్య సంస్కృతి' అని కొందరు పిలుస్తున్నారు. పాశ్చాత్య దేశాలు యాభైకి పైగా ఉన్నాయి. వీటిలో వేషధరణ, సెక్స్ పట్ల ఒక్కొక్క దేశంలోని ఒక్కొక్క ప్రాంతం, స్థానిక సంస్కృతి బట్టి ఎన్నెన్నో రకాల విభిన్న అభిప్రాయాలు, ఆచరణ ఉన్నాయి. కాబట్టి, అన్ని పాశ్చాత్య దేశాలను ఒకే గాటన కట్టి 'పాశ్చాత్య సంస్కృతి' అనడం అవగాహనా రాహిత్యం. పైగా అలా పిలువడం అక్కడి ప్రజలను కించపరినట్టు అవుతుంది. కనీసం అభ్యుదయవాదులైనా పాశ్చాత్య సంస్కృతి అనకుండా సామ్రాజ్యవాద (విష) సంస్కృతి అని పిలవాలి. అయితే, భారతదేశంలాగే అన్ని పాశ్చాత్య దేశాల ప్రజలు కూడా సామ్రాజ్యవాద విష సంస్కృతికి బలి అవుతున్నారు.

ఈ విష సంస్కృతిని భారతదేశంలో ప్రధానంగా 1991 నుండి దింపితే, పాశ్చాత్య దేశాల్లో మాత్రం 1920 దశకం నుండే దింపారు. 1917లో రష్యా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన సాయుధ తిరుగుబాటు ద్వారా కార్మిక వర్గం సోషలిస్టు రాజ్యాన్ని స్థాపించుకోవడంతో బెంబేలెత్తిన పాశ్చాత్య దేశాల పాలక వర్గాలు తమ దేశ కార్మిక వర్గం రష్యన్ విప్లవంతో ప్రభావితులు కాకుండా వారిని బలహీనం చేయడానికి పెద్ద ఎత్తున విష సంస్కృతిని దింపారు. అయితే, సామ్రాజ్యవాద విష సంస్కృతి ఆ దేశాల్లో అంత కాలం నుండి ఉన్నప్పుడు భారతదేశంలో కన్నా ఎక్కువగా లైంగిక అత్యాచారాలు ఆ దేశాల్లో జరగాలి కదా అనే అనుమానం కలుగుతుంది. లైంగిక అత్యాచారాల గణాంకాలు అన్ని పాశ్చాత్య దేశాల్లో ఒకే తీరుగా లేవు. అమెరికాలో ఎక్కువగా జరిగితే, స్కాండినేవియన్ దేశాల్లో అతి తక్కువగా జరుగుతున్నాయి.

పాశ్చాత్య దేశాల్లో లైంగిక అత్యాచారాలు భారత్‌లో కన్నా అత్యంత తక్కువ స్థాయిలో జరుగుతున్నాయి. దానికి గల కారణాలు అనేకం అయినప్పటికీ వాటిలో ప్రధానమైనవి, స్త్రీలకు మగవారితో దాదాపుగా సమాన హక్కులు ఆచరించబడడం. స్త్రీని ఒక వస్తువుగా చూసే సామ్రాజ్యవాద విష సంస్కృతిని నిత్యం వారికి ఇన్‌జెక్ట్ చేస్తున్నా, స్త్రీల నిరంతర అసమాన పోరాటాల ఫలితంగా స్త్రీలకు స్వేచ్ఛ సంక్రమించింది. పాశ్చాత్య దేశాల్లో లైంగిక స్వేచ్ఛ ఉంది. పద్దెనిమిది సంవత్సరాల వయస్సుకే తమ ఇల్లు వదిలి పార్ట్‌నర్‌తో (పెళ్లి కాకుండా) కలిసి నివసించే సంస్కృతి ఉంది. పద్దెనిమిది సంవత్సరాలు దాటినా పార్ట్‌నర్ లేకపోతే పార్ట్‌నర్‌ను వెతుక్కోమని తల్లిదండ్రులే ఒత్తిడి చేస్తారు. పద్దెనిమిది సంవత్సరాల వయసు ముందు కూడా పార్ట్‌నర్ ఉంటే, తల్లిదండ్రులతో కలిసి ఉన్న ఇంటికే పార్ట్‌నర్‌ను తెచ్చుకునే స్వేచ్ఛ కూడా వారికి ఉంది. పార్ట్‌నర్‌ల మధ్య పరిష్కరించుకోలేని మనస్పర్థలు వస్తే సామరస్యంగానే విడిపోయి, వేరే వారిని వెతుక్కుంటారు. అంతేకాని, భారత దేశంలో లాగా యాసిడ్ దాడులు, హత్యలు, కక్షలు, పోలీస్ కేసుల సంస్కృతి లేదు. విడిపోయిన తర్వాత కూడా మంచి స్నేహితుల్లా మిగిలిపోయిన వారిని నేను కూడా కలిసాను. ఇంతకు ముందు ఎంత మంది పార్ట్‌నర్‌లతో ఉన్నావని, ఎంతమందిని పెళ్లి చేసుకున్నావని స్త్రీలు పురుషులను అడగరు, పురుషులు స్త్రీలను అడగరు. భారత దేశంలోలా అటు, ఇటు ఏడు తరాల చరిత్ర తవ్వాలి అనే సంస్కృతి లేదు. ఆ సమయంలో ఇష్టమైతే కలిసుంటారు, లేకపోతే విడిపోతారు. కలిసుండడంలో కాని, పెళ్లి చేసుకోవడంలో కాని, విడిపోవడంలో కాని రెండు వైపుల తల్లిదండ్రుల పాత్ర శూన్యం. చిన్నా, చితకా గిఫ్ట్‌లు ఇచ్చే సంస్కృతి తప్ప, వరకట్నాలు, కన్యాశుల్కాల సంస్కృతి అసలే లేదు. వేశ్యా వృత్తి అక్కడ చట్టబద్ధమే. మగ వేశ్యలు, ఆడ వేశ్యలు ఇద్దరూ ఉంటారు. తమ ఆదాయం ప్రకారం టాక్స్‌లు కడతారు. వారికి రోగాలు రాకుండా నివారించే సిస్టం తయారు చేసారు. వేశ్యా వృత్తి మంచిదా, చెడ్డదా అనే వాదన పక్కకు పెడితే, సామ్రాజ్యవాద విష సంస్కృతిలో భాగంగా దింపుతున్న సెక్స్ కల్చర్, అత్యాచారాల లాంటి విపరీత పరిణామాలకి దారి తీయకుండా వేశ్యావృత్తి ఒక ఔట్‌లెట్‌గా ఎంతో కొంత స్థాయిలో ఉపయోగపడుతున్నట్టు ఆ దేశాల్లో గమనించవచ్చు.

అయితే భారతదేశంలో మాత్రం ఒకవైపు సామ్రాజ్యవాదుల విష సంస్కృతి, ఇంకో వైపు వారి తొత్తులైన భారత దళారీ పాలకవర్గాలు పెంచి పోషిస్తున్న భూస్వామ్య, హిందూ మనువాద సంస్కృతి స్త్రీలపై సామాజిక, శారీరక, సాంస్కృతిక అణచివేతను ప్రోత్సహిస్తుండడం వలన సెక్స్ కల్చర్‌తో ప్రభావితులైన కొందరు లైంగిక అత్యాచారాలకు పాల్పడుతున్నారు. అయితే, అత్యాచారాలకు ఇతర పరిస్థితులు కూడా కారణం అవుతున్నాయి. లైంగిక అత్యాచారం జరిగిందని స్పష్టంగా తెలిసినా డబ్బులకు ఆశపడి నిందితుడి తరపున వాదించే లాయర్లు; లంచాలు తీసుకొని కేసులు కూడా బుక్ చేయని పోలీసులు; లంచాలు తీసుకొని అత్యాచారం జరగలేదని రిపోర్ట్ ఇచ్చే డాక్టర్లు; జరిగిందేదో జరిగింది రాజీపడమని, లేకపోతే తీవ్ర పరిణామాలుంటాయని బెదిరించే నిందితుని తరపు తల్లిదండ్రులు, బంధుమిత్రులు, గూండాలు, రాజకీయ నాయకులు, కుల, మత, గ్రామ పెద్దలు; అత్యాచారానికి గురైన బాధితురాలినే అనుమానిస్తూ, నిందిస్తూ, ప్రశ్నిస్తూ, అవమానిస్తూ మాట్లాడే సంస్కృతి; మానవ సంబంధాలను సర్వనాశనం చేస్తున్న సామ్రాజ్యవాద వస్తు వినియోగ సంస్కృతి; మగ దురహంకారం; ఇంకోవైపు పాలకవర్గాలే

వివిధ ఉద్యమాల అణచివేతలో భాగంగా స్త్రీలపై లైంగిక అత్యాచారాలు చేయించే అమానవీయ సంస్కృతి ఉండడం; పాలకవర్గాలు కుట్రపూరితంగా ప్రజలకు అలవాటు చేస్తున్న ఆల్కహాల్, డ్రగ్స్ సంస్కృతి మనిషిలోని విచక్షణను, మానవత్వాన్ని కోల్పోయేట్టు చేస్తుండడం; కుల, మత వివక్షలో భాగంగా అత్యాచారాలకు పాల్పడే సంస్కృతి; ఇలాంటి కారణాలు కూడా అత్యాచారాలకు కారణం అవుతున్నాయి.

ఇంకోవైపు ధనమదం, పాలక వర్గాలు పెంచిపోషిస్తున్న గూండాయిజం, మాఫియా, మతోన్మాద సంస్కృతి కూడా అత్యాచారాలకు కారణం అవుతున్నాయి. అత్యాచారాలు జరగకుండా చూడాల్సిన ప్రభుత్వ విభాగాలు లేదా జరిగిన తర్వాత బాధితుల పక్షాన నిలబడాల్సిన వివిధ విభాగాలు ఏమాత్రం స్పందించక పోవడం లేదా నిందితుల పక్షానే నిలబడడం కూడా అత్యాచారాలకు కారణమవుతున్నాయి. లైంగిక అత్యాచారాల కేసుల్లో కేవలం 16 శాతం కేసుల్లోనే శిక్ష పడుతున్నది (చాలా సందర్భాల్లో ఆ శిక్షలు నామమాత్ర మైనవే). అంటే లైంగిక అత్యాచార బాధితుల పట్ల న్యాయమూర్తులకే సరైన అవగాహన, అభిప్రాయం, ఆవేదన లేకపోవడం; ఇంకోవైపు, పాలకవర్గాలు కుట్రపూరితంగా వ్యవసాయాన్ని నాశనం చేస్తుండడం వలన కాని, మైనింగ్‌ల కోసం, సెజ్‌ల కోసం, ఇండస్ట్రియల్ పార్క్‌ల కోసం, డ్యామ్‌ల కోసం, ఇంకా ఎన్నెన్నో రకాల ప్రాజెక్టుల కోసం వ్యవసాయ భూములను లాక్కొని, ప్రజలు తమ సంప్రదాయక జీవన విధానం, ఆధారం నుండి పరాయీకరణ చెందేట్టు చేస్తుండడం; లైంగిక జీవితం లేకున్నా ఒక సామాజిక లక్ష్యం కోసం, మార్పు కోసం విలువ లతో కూడిన జీవితాన్ని బతకవచ్చని నేర్పే అభ్యుదయ లేదా విప్లవ ఉద్యమాల ప్రభావం, మార్గదర్శనం వారికి లేకపోవడం; ఇలాంటి ఎన్నో కారణాలు లైంగిక అత్యాచారాల పెరుగుదలకు కారణమవుతున్నాయి.

ఒకవైపు సెక్స్ కల్చర్ వ్యవస్థీకృతమై ఉన్నది. ఇంకొకవైపు మహిళలపై హింస వ్యవస్థీకృతమై ఉన్నది. మరోవైపు నేరస్తుల పక్షానే నిలిచే పోలీసు, న్యాయ, రాజకీయ, సాంస్కృతిక, ఆర్థిక వ్యవస్థ కూడా వ్యవస్థీకృతమై ఉన్నది. పాలకవర్గాలకు చెందిన కార్పొరేట్ మీడియా పేద కుటుంబాలకు చెందిన అత్యాచార నిందితులను అత్యంత క్రూరులుగా 24 గంటలు రోజుల తరబడి చూపుతూ (వారు అలా ప్రవర్తించడానికి గల మూల కారణాలను ఉద్దేశపూర్వకంగా వదిలేసి) ప్రజలను పక్కదారి పట్టిస్తున్నారు. కాని ప్రతిరోజూ దేశవ్యాప్తంగా మిలిటరీ, పారా మిలిటరీ బలగాలు, పోలీసులు చేస్తున్న లైంగిక అత్యాచారాలను మాత్రం కనీసం ప్రస్తావించడం లేదు. ఒకవేళ ప్రస్తావించినా తూతూ మంత్రంగానే చేస్తున్నారు. అత్యాచారాలు ఎవరు చేసినా శిక్షించాలి. అయితే పాలకవర్గాలు, వారి సేవకుల పట్ల ఒక న్యాయం, పేద ప్రజల పట్ల ఒక న్యాయం ఉండకూడదు. ప్రజలు ఈ వాస్తవాలను అర్థం చేసుకోవాలి.

ఉరిశిక్షలు, యావజ్జీవ శిక్షలు, నపుంసకులుగా మార్చే శిక్షలు, పబ్లిక్‌లో రాళ్లతో కొట్టి చంపే శిక్షలు, ఇంకా కఠోరమైన శిక్షలు ఎన్ని విధించినా స్త్రీలపై లైంగిక అత్యాచారాలు ఆగవు. పైపెచ్చు రానున్న రోజుల్లో ఇంకా పెరుగనున్నాయి. ఎందుకంటే, సామ్రాజ్యవాదులు, భారత పాలకులు లైంగిక అత్యాచారాలు జరగడానికి కావలసిన అన్ని రకాల పరిస్థితులు కల్పించారు. ఆ పరిస్థితులను రోజు, రోజుకూ ఇంకా పకడ్బందీగా, ఇంకా వేగవంతంగా, ఇంకా విస్తృతంగా, ఇంకా చేరుకోని ప్రాంతాలకు, ప్రజా సమూహాలకు కూడా చేరుకునేటట్టు చేస్తున్నారు. రానున్న మూడు, నాలుగు సంవత్సరాలలో దేశంలోని మారుమూల పల్లెలకు కూడా త్రీ.జి. బ్రాడ్‌బాండ్ ఇంటర్నెట్ సర్వీసు సమకూర్చే ప్రణాళికను భారత పాలకవర్గాలు అమలు పరుస్తున్నాయి. అప్పుడు ముక్కుపచ్చలారని బాలికలపై, స్త్రీలపై అత్యాచారాలు ఊహకందని స్థాయిలో పెరుగుతాయి అనడంలో సందేహమేమీ లేదు.

ప్రతిరోజు వందలాది అత్యాచారాలు దేశవ్యాప్తంగా జరుగుతున్నాయి. నిజానికి, మనుషులను అనాగరికంగా, అమానవీయంగా ప్రవర్తించేటట్టు చేయడం సులభం. చేయవలసిందల్లా ఆ పరిస్థితులు కల్పించడం మాత్రమే. ప్రధానంగా 1991 తర్వాత వ్యాపార సంస్కృతి ఎక్కువైంది. వస్తు వినియోగ సంస్కృతిని ప్రమోట్ చేయడం మొదలయింది. ఇబ్బడి ముబ్బడిగా మార్కెట్లోకి వచ్చిపడుతున్న వస్తువులకు ఆకర్షితులై, ఆ వస్తువులను కొనడానికి ఎలానైనా డబ్బులు సంపాదించడం (అనైతికంగా, అక్రమంగా సంపాదించినా సమాజంలో సమ్మతి ఉంది కాబట్టి), ఆ సంపాదించే క్రమంలో సాటి మనుషుల పట్ల అప్పటివరకున్న మానవీయ సంబంధాల స్థానంలో వ్యాపార సంబంధాలు ఏర్పడడం, ఇవన్నీ చకచకా జరిగిపోయాయి. అంటే, వస్తు వినియోగ సంస్కృతి ప్రవేశపెట్టిన తరువాత, అప్పటి వరకు తమ సాటి మనుషులను ప్రేమించిన వారు, వస్తువులను ప్రేమించడం మొదలు పెట్టారు. అదే జరిగింది, జరుగుతున్నది.

సామ్రాజ్యవాద విష సంస్కృతిలో వస్తు వినియోగ సంస్కృతి అతి ప్రధానమైనది. ఇది మనిషికి కావలసిన అన్నిటిని వ్యాపారమయం చేస్తుంది. అందుకే, ఈ సంస్కృతిలో న్యాయం కూడా వస్తువు అవుతుంది. అంటే, న్యాయంను కూడా కొనుక్కోవాలి. లాయర్‌లకు, కోర్టు ఫీజులకు, 'తదితరాల'కు నీ దగ్గర డబ్బులు లేకపోతే నీకు ఎంతటి అన్యాయం జరిగినా న్యాయం దక్కదు. కోర్టు వరకు వెళ్లిన ఆ కొద్ది అత్యాచారాల కేసుల్లో కేవలం 16 శాతం కేసుల్లోనే నిందితులకు శిక్షలు పడ్డాయంటే న్యాయాన్ని కొనడంలో ఎవరు గెలుస్తున్నారో అర్థమవుతుంది.

ఇంతగా అన్యాయం వ్యవస్థీకృతమైన అమానవీయ వ్యవస్థ ఇది. ఇలాంటి వ్యవస్థ బ్లాక్‌హోల్ లాంటి 'విషియస్ సైకిల్' (అధర్మ చట్రం). ఒక అధర్మ, అన్యాయ, దోపిడీ వ్యవస్థలో ప్రతి సమస్య, ఇంకా కొన్ని సమస్యలను సృష్టిస్తుంది. ఆ సమస్యలు ఇంకా ఇతర సమస్యలను సృష్టిస్తాయి. అంటే, సామ్రాజ్యవాదులు, వారి దళారీలు రాజ్యం ఏలినంత వరకు ప్రతి సమస్య ఇంకా కొత్త సమస్యలు సృష్టిస్తూ ఉంటాయి. అలాగే, అన్ని సమస్యలు 'స్నోబాల్ ఎఫెక్ట్'తో (నిరంతరంగా సమస్య సైజ్, తీవ్రత, వేగం పెరగడం) పెరుగుతుంటాయి. అందుకే, ఈ వ్యవస్థలో ఏ సమస్యకు కూడా పరిష్కారం ఉండదు. ఇంకా పెద్ద సమస్యలు, కొత్తగా వచ్చి పడుతున్న సమస్యలు మనల్ని పాత సమస్యలు, చిన్న సమస్యలను మరిచిపోయేట్టు చేస్తాయే తప్ప, ఏ సమస్యకు పాలక వర్గాల వద్ద పరిష్కారం లేదు. అందుకే, పెట్టుబడిదారులు తమ సమాధులను తామే తవ్వుకుంటారని మార్క్స్ అన్నాడు. అయితే ఆ సమాధుల్లో వారిని శాశ్వతంగా పూడ్చి శిలా ఫలకాన్ని రాయాల్సిన బాధ్యత ప్రజలదే.

*(రచయిత అనేక దేశాల్లో పని చేసిన సామాజిక కార్యకర్త)* వీ

# మానవత్వమా! నీవెక్కడ?

***మహిళలపై, పిల్లలపై జరుగుతున్న లైంగిక దాడులూ, హత్యలూ మనుషులలో రోజురోజుకూ కనుమరుగవుతున్న మానవ విలువలను, సాటి మనుషుల పట్ల బాధ్యతా రాహిత్యాన్ని సూచిస్తున్నాయని అంటున్నారు* లావుడ్యా రాజు**

ఢిల్లీ గ్యాంగ్ రేప్ బాధితురాలు నిర్భయ డిసెంబర్ 28న భౌతికంగా దూరమవుతూ తన కన్నీటి ధారల వెనుకాల వేసుకున్న ప్రశ్నలెన్నో? ఆ ప్రశ్నల సుడిగుండంలో నుంచి బతుకాలనే కోరికకై పోరాడిన క్షణాలెన్నో?

నిర్భయ మరణంతో ఈ ప్రభుత్వం ఢిల్లీలో ఫాస్ట్‌ట్రాక్ కోర్టును ఏర్పాటు చేసింది. కాని ఈ దేశంలో రోజురోజుకు పెరుగుతున్న దాడుల పునాదుల్ని, కారణాలను విశ్లేషించడాన్ని వదిలేసింది. ఆ కారణాలను విశ్లేషించడానికి ప్రయత్నం చేస్తే ఈ సమాజపు ప్రజాకోర్టు ముందు తనే మొదటి ముద్దాయిగా మిగులుతుంది. మనుషుల మధ్య పెరుగుతున్న అంతరాల వైరుధ్యాలకు, మానవ సమూహాల మధ్య దిగజారుతున్న మానవతా విలువలకు పునాది అవుతున్న సామ్రాజ్యవాద విష సంస్కృతిని పెంచి పోషిస్తున్నందుకు, వాటి ఫలితంగా నేడు సమాజంలో జరుగుతున్న అమానవీయ సంఘటనలకు, దారుణాలకు కూడా బాధ్యత వహించవల్సి నందుకు, పాలకులు సమాజంలో జరుగుతున్న ఘటనల మూలాల్ని పరిశీలించి తగు చర్యలు తీసుకునే దిశగా ఆలోచించడం లేదు. సంఘటన జరిగినప్పుడు ఆ ఘటనలకు కారకులవుతున్న దోషుల్ని శిక్షించడానికి మాత్రం చట్టాలు తీసుకొస్తున్నామంటున్నారు. చట్టాలు చేసినప్పుడు ఉన్న శ్రద్ధ వాటిని అమలు చేయించే విషయంలో ఉండదు. నేడు సమాజంలో మహిళలపై జరుగుతున్న దారుణ సంఘటనల్ని మనం గమనిస్తే మానవత్వమా, నీ చిరునామా ఎక్కడని వెతుక్కోవాల్సిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

నిర్భయతో పాటు రేపిస్టుల చేతిలో గాయపడిన ఆమె స్నేహితుడు మీడియా ముందు మాట్లాడిన తర్వాత బాధ్యత మరిచిన మానవ ప్రయాణం ఏ వైపు సాగిపోతుందని ఆందోళన కలుగుతుంది. ప్రయాణిస్తున్న బస్సులోనే అత్యాచారం జరిపిన దుండగులు ఇద్దరినీ నగ్నంగా బస్సు నుండి తోసేశారు. అది దేశ రాజధాని. అర్ధరాత్రి అయినా కార్పొరేట్ వెలుగుల్లో జిగేలుమనే సిటీ. జనారణ్యం నిత్యం సంచరించే చోటు. ప్రతీ రోజు లాగా ప్రయాణిస్తున్న జనం, బాధ్యత మరిచి ప్రయాణిస్తున్న జనం, మానవత్వం మరిచిన మన జనం, ఆ క్రూర సంఘటన వెలుగులోకి వచ్చిన తర్వాత అయ్యో పాపం అన్నారే కాని, రోడ్డుపై రక్తపు మడుగుల్లో హీనంగా, దీనంగా ఆదుకునే నేస్తాల మానవత్వంకై ఆమె ఎంతగా పరితపించినా పట్టించుకోలేదు.

ఆమె రెండు గంటలపాటు నరకయాతన అనుభవించింది. తర్వాత వచ్చిన పోలీస్‌లు అరగంట పాటు ఏ స్టేషన్ పరిధిలో కేసు వస్తుందని నిర్ధారించుకున్న తర్వాత సఫ్దర్‌జంగ్ ఆస్పత్రికి తరలించారు. బాధ్యత మరచిన జనంతోపాటు ప్రజల మానప్రాణాల రక్షణకై నిలబడే పోలీస్‌లు వ్యవహరించిన తీరు మానవత్వం లేని, సిగ్గులేనితనానికి నిదర్శనం. బతకడానికి ఉద్యోగాల్లో చేరాలనే ఆలోచనే తప్ప తమ డ్యూటీకి ఇబ్బందులు ఉండకూడదనే ఆలోచనే తప్ప రక్తపు మడుగులో ఉన్న ఆమె ప్రాణాలను రక్షిద్దామనే మానవత్వాన్ని ప్రదర్శించలేదు. ప్రజలతో పాటు, వారి రక్షణకోసం నిలబడ్డ ఉద్యోగస్థుల ఈ తీరు దారుణాతి దారుణం. 'నిర్భయను వెంటనే హాస్పిటల్ తరలిస్తే బతికే అవకాశం ఉండేది. రెండు గంటల మా మౌన రోదన జనానికి కనబడినా, వినబడినా ఎవ్వరూ ముందుకు రాలేదు. వెంటనే హాస్పిటల్‌కి తీసుకెళ్లితే ఆమె కచ్చితంగా బతికే అవకాశం ఉండే'దని అన్నాడు. స్నేహితురాలి మృతి గురించి కొవ్వత్తులు వెలిగించడం కాదు. అలాంటి ఘటనలకు పురిగొల్పుతున్న కారణాలను విశ్లేషించాలని అన్నాడు.

సంఘటన వెలుగులోకి వచ్చిన తర్వాత దేశం మొత్తంలో బాధితురాలి పక్షాన జరిగిన ఉద్యమాల్ని మనం చూశాం, ముఖ్యంగా ఢిల్లీ నగరమంతా వారం రోజుల పాటు విద్యార్థి, యువతరం, ప్రజలు చేసిన పోరాటం పాలకుల బాధ్యతను ప్రశ్నించింది! ప్రభుత్వం కూడా ప్రజల ఆందోళన నేపథ్యంలో ఫాస్ట్‌ట్రాక్ కోర్టును ఏర్పాటుచేసింది. ఇంతటితో ప్రజల బాధ్యత, పాలకుల బాధ్యత అయిపోయిందా? నిర్భయ కార్చిన కన్నీరు లక్ష్యం నెరవేరిందా?

కాలం మారిందంటున్నాం, ఎవ్వరి బతుకు వారే బతకాలంటున్నాం కానీ సమాజ బతుకుల్లో దాగిన ప్రజల ప్రయాణం ఎటు వైపు వెళుతుందో క్షణం ఆలోచించలేకపోతున్నాం ఎందుకని? నా కుటుంబం, నా కులం, నా వర్గమనే ఆలోచన ధోరణులతో నేటి సమాజం కాలం వెళ్లదీస్తుంది, కానీ కొన్ని సందర్భాల్లో ఘటన తీరును బట్టి ఉద్యమిస్తూ పరిష్కారం దిశగా అడుగులు వేయకుండ, యథాస్థితిలో రోజూ చేసే పనులలో నిమగ్నమై బతుకుతున్నాం! మళ్లీ సంఘటన ఎదురైనప్పుడు ఈ సమాజంలో మానవత్వం మంట గలిసిందంటున్నాం! ఆ అమానవీయ ఘటనను నిరసిస్తున్నాం. మళ్లీ యథాస్థితికి వెళ్లిపోతున్నాం ఎందుకని? దుర్మార్గుడి దుశ్చర్యల కన్నా మంచివాడి మౌనమే ప్రమాదకరమని మార్టిన్ లూథర్‌కింగ్ అన్నాడు. ఇప్పుడు జరుగుతున్న సంఘటనలన్నీ ఎక్కడ జరుగుతున్నాయి జనం మధ్యనే కదా? మన కండ్ల ముందు జరుగుతున్న దారుణాలైనా మనం ఎంత వరకు ఆపుతున్నాం, బాధితుల పక్షాన ఎంత వరకు నిలబడుతున్నాం?

వాకపల్లిలో అమాయక ఆదివాసీలైన 18 మంది మహిళలపై పోలీసులు అత్యాచారం జరిపితే మనం ఎంత వరకు ఆ ఘటనను నిరసించాం. ఆత్మగౌరవమే కొలమానంగా బతికే ఆదివాసిలు బాహ్య

ప్రపంచం ముందు జరిగిన ఘటనను తెలియజేస్తే ఎంత వరకు స్పందించాం. కొంత మంది ప్రజాతంత్రవాదులు ఈ ఘటనను నిరసిస్తూ పోరాటం చేస్తే ఆ పోరాటంలో ఎంత మంది పాల్గొన్నాం?

వాకపల్లి ఒక అడవి పల్లె. ఢిల్లీ రాజధాని, అభివృద్ధికి దూరం ఒక పల్లె, అభివృద్ధికి కొలమానం ఒక రాజధాని, రెండు చోట్ల బాధితురాలు ఒక స్త్రీ జాతి, రెండుచోట్ల పోరాటాలకు ఎంత తేడా? వాకపల్లి, ఢిల్లీ నగరాన్ని పాలిస్తున్న పాలకుడొక్కడే. అతని విధానం ఒక్కటే. అతను చేసిన చట్టాలొక్కటే. కానీ వాకపల్లి నిందితుల్ని రక్షిస్తాడు, ఢిల్లీ రేపిస్టులకు ఫాస్ట్‌ట్రాక్ కోర్టు ఏర్పాటుచేస్తాడు. ఎందుకని ఈ తేడా ? ఢిల్లీ బాధితురాలికి న్యాయం జరుగొద్దనే ఉద్దేశ్యం కాదు, రెండు చోట్ల బాధితురాలు స్త్రీ జాతే కదా? వాకపల్లి సంఘటన జరిగినప్పుడు అప్పుడే ఈ పాలకులు ఫాస్ట్‌ట్రాక్ కోర్టు ఏర్పాటు చేస్తే ప్రజలకు ఈ చట్టాల మీద కొంతైనా నమ్మకం ఉండేది. చట్టాలు కఠినంగా ఉన్నంత మాత్రాన అవి ఆగవు. ఆపడానికి ఒక ఆస్కారం ఉంటుంది.

ఒక బాలీవుడ్ సినిమా హీరో అమెరికా వెళ్లిన సమయంలో అక్కడి విమానాశ్రయంలో నిలబెట్టి ఐదు నిమిషాలు సోదా చేస్తే భారతీయుడికి అవమానం జరిగిందని ఈ దేశ పాలకులు, ఈ దేశపు మీడియా ఉలిక్కిపడి గగ్గోలుపెట్టింది. మానవత్వం మంటగలిసిందని తెగ ప్రచారం చేసింది. మానవత్వాన్నే ఎడారిలో పెట్టిన ఈ పాలకులు, సమాజం ఈ సంఘటనతో మానవత్వం గురించి మాట్లాడారు. కాని ఈ దేశంలోనే మానవత్వం అడుగడుగునా మంటగలుస్తున్నది. కులం పేర, మతం పేర జరుగుతున్న దౌర్జన్యపు కాండలో అగ్నికి ఆహుతి అవుతున్నది. ప్రజల మధ్య పేద, ధనికుల మధ్య అందనంత దూరంలో మానవత్వం ఎగబాకింది. దీన్ని ఈ పాలకులు చూడరా?

సమాజంలో వింతపోకడలకు కారణం ఎవ్వరు? ఎక్కడ మనదేశ ప్రజల సంస్కృతి పతనం ప్రారంభమైంది? ప్రజలు నిత్యం తెల్లవారు జామున నుండి పడుకునే వరకు వినియోగించుకునే ప్రతి సరుకు విదేశాలనుండి దిగుమతి అవుతున్నదే. ఎందుకని మన ముంగిట్లో వాలిపోయాయి? పాలకులు అభివృద్ధి మార్కెట్ పేరులో మన మార్కెట్‌ను ముంచి వాటి మార్కెట్‌కు గేట్లు బార్లా తెరిచారు. కారుచౌకగా అవి మన కండ్ల ముందు వాలిపోతున్నాయి. మన చేతివృత్తులు వినిమయ మార్కెట్ చిన్నబోతూ విలవిలలాడుతున్నది. వాల్‌మార్ట్ మార్కెట్‌లో ఎఫ్.డి.ఐ. విదేశీ ప్రవాహంలో మన ప్రజల వృత్తులు సమాధికి దగ్గరలో ఉంది. ఆయా సామ్రాజ్యవాద దేశాల్లో వారి అలవాట్లలో భాగంగా ఉన్న సాంప్రదాయ వస్తువులే నేడు మన దేశంలో దిగుమతి అవుతున్నాయి. మన దేశంలోని మార్కెట్‌లలో వారి వస్తువులు లేని మార్కెట్టే లేదు. అందుకే యువతరం, ప్రజలు అనివార్యంగా వారి అలవాట్లను, వేషధారణను అనుసరిస్తున్న పరిస్థితి ఏర్పడుతున్నది. దీనికి ఏ ఒక్కరు మినహాయింపు కాదు. అందరు దీని బారిన పడవలసిందే.

మరో వైపు మన దేశంలో ప్రసారమవుతున్న ఎలక్ట్రానిక్ మీడియాలు విదేశీ సంస్థల 75 శాతం పెట్టుబడితో నడుస్తున్నాయి. దీనికి ఏ ఒక్కటి మినహాయింపు కాదు. దీని ఫలితంగా బుల్లితెర మీద విదేశీ సంస్కృతి భావజాలం ప్రతీ కుటుంబంపై అనివార్యంగా రుద్దబడుతున్నది. ఏమి వాడాలో, ఏది తినాలో, ఏది చేయాలన్నా ఇంట్లో నుండే మన దేశాన్ని ప్రసార సాధనాల ద్వారా సామ్రాజ్యవాద దేశాలు శాసిస్తున్నాయి. అందులో బంధీ అవుతున్న మనం ప్రతీది ఫ్యాషన్ అనే భ్రమల్లోకి వెళ్లి పోతున్నాం, ఇంటాబయటా ప్రతీచోట, ఈ దేశం నలుమూలా సామ్రాజ్యవాదం మన ప్రజల మెదళ్లపై తన భావజాలపు భావాల్ని రుద్దుతున్నాయి. దీని ఫలితంగానే నేడు సమాజంలో అవమానీయపు సంఘటనలు జరుగుతున్నాయి. దీనికి గద్దె మీద కూర్చొన్న పాలకులు కూడా అతీతులు కాదు. ఇటీవల రిలీజ్ అయిన 'డర్టీపిక్చర్' లాంటి చిత్రాలను నిషేధించాల్సిన పాలకులు ఆ చిత్రానికి జాతీయ అవార్డ్ ఇచ్చారంటే మానవ విలువలు ఈ దేశంలో దిగజారాయనేదానికి ఉదాహరణ ఏం ఉంటుంది. ప్రజల్ని తమ ప్రసారాల ద్వారా చైతన్య వంతం చేయాల్సిన నేటి సాధనాలు (మీడియా) నీలిచిత్రాల షెర్లిన్‌చోప్రా పుట్టిన రోజు పండుగలు జరుపుకుంటున్న దీనస్థితిలో ఉన్నప్పుడు ఏ సాంస్కృతిక భావజాలంలో మనం నిత్యం బతుకుతున్నట్లు?

ప్రగతిశీల శక్తులు ! ప్రజా సంస్కృతి మానవత విలువలు పరిరక్షణకై పోరాడే నేటి ప్రజలు ఈ దేశాన్ని కబళించాలని చూస్తున్న విదేశీ భావజాలపు సంస్కృతిని బద్ధలు కొట్టడానికి ఏకం కావాలి. ఆనాటి మన పల్లె ప్రజల సంస్కృతిని, మన సాంప్రదాయపు ఆట, పాటలను నిరంతరం ప్రోత్సహించాలి. హక్కులు తనంతట తాను రావు, ఢిల్లీ నిర్భయ గ్యాంగ్‌రేప్ ఘటనతో మేల్కొన్న నేటి సమాజం అదే పోరాట ఒరవడిని కొనసాగించాలి! మన మధ్యనే పురిగొల్పుతున్న చెడు సంఘటనలపై, ఆ దాడులపై స్పందించాలి! రక్తసంబంధం కంటే వర్గ సంబంధం గొప్పదనే మార్క్స్ భావాలవైపు ప్రయాణిద్దాం! అభాగ్యుల, ఆనార్థుల ఆకలికేకలు, రక్షించమనే పిలుపు వినిపించినప్పుడు మానవత్వాన్ని చాటుదాం. ఇప్పటికైనా స్పందిద్దాం. దోపిడీ సమాజం కట్టిన బాంధవ్యాల గోడల్ని పగలకొడుదాం! కట్నం, కానుకల రుగ్మతల రద్దుకై ఉద్యమిద్దాం. స్త్రీని అవహేళన చేసే పురుషాధికత్వపు భావజాలాన్ని ప్రోత్సహించే సమాజంలో ఉన్న రుగ్మతల రద్దుకై పోరాడాలి. ఆడది అబలకాదు. ఆదిపరాశక్తిగా! మమకారపు మాతృమూర్తిగా కొలుద్దాం!

నిర్భయ తన చివరి కన్నీటి ధారల వెనకాల వేసుకున్న ప్రశ్నలివే? వాటిని సాకారం చేద్దాం ! మానవత్వం జాడలేని దోపిడి వ్యవస్థలో మార్పుకై పోరాడుదాం! నిర్భయ కోట్లాది ఈ దేశ ప్రజలందరికి మేల్కొపులు కావాలి.

*(రచయిత రాష్ట్ర నాయకులు, ప్రగతిశీల యువజన సంఘం)* వీ

**గమనిక :** పాఠకుల వీక్షణం శీర్షికకు, వ్యాసాలపై చర్చకు పాఠకుల నుంచి ఇతోధికమైన స్పందనను ఆశిస్తున్నాం. కాని, ఎక్కువ మంది పాఠకుల స్పందనకు అవకాశం కల్పించేలా, స్థలాన్ని దృష్టిలో ఉంచుకొని తమ స్పందనలను వీలైనంత క్లుప్తంగా రాయాలని కోరుతున్నాం. చర్చ ఏ వ్యాసంపై జరుగుతుందో దానికే పరిమితమయి ఉండడం, చద్దికన్న ఊరగాయ ఘనం కాకుండా ఉండడం అవసరం. స్థలాభావం దృష్ట్యా ఉత్తరాలు, చర్చ ఎడిట్ చేసి ప్రచురించే అధికారం సంపాదకవర్గానికి ఉంది. ఇప్పటివరకూ వాడని ఈ అధికారాన్ని ఇకముందు కూడా వాడే అవసరం రాకుండా జాగ్రత్తపడాలని కోరుతున్నాం. – సం.

# వర్గ సమాజంలో న్యాయం, ధర్మం, స్పందనలు

*భారతదేశంలోని స్త్రీలను పురాణాలు, భూస్వామ్య పాలకులు, మతాధిపతులు, సామ్రాజ్యవాదులు, సోషలిస్టులు చూసిన, చూస్తున్న విధానాన్ని వివరిస్తున్నారు* **వీర బ్రహ్మాచారి**

వర్గ సమాజంలో ఆధిపత్య వర్గాలకు సంబంధించిన సంఘటనలే ప్రధాన సంచలన భావోద్రేకాలను మండించే వార్తలవుతాయి. అటువంటి వరుసలోనిదే ఢిల్లీ రేప్ సంఘటన, తదనంతర ఎలైట్ ప్రజారాసుల స్పందనలు, విశ్లేషణలు, కోపోద్రిక్తలు, ఆగ్రహావేశపూరిత పరిష్కార మార్గాల సూచనలు, డిమాండ్‌లు. ఈ మాటలనడం చాలామందికి ఇంగితంలేని అసందర్భ వాగుడుగా అనిపించవచ్చు. కాని ఇది నిజం.

ఢిల్లీలో 23 ఏళ్ల పారా మెడికల్ విద్యార్థిని మీద జరిగిన అత్యాచారం, హత్యాయత్నం బాధితురాలి తరపున భయంకరం, జుగుప్సాకరం, హృదయ విదారకం, దుఃఖదాయకమైనది. నేరస్తుని వైపున నిస్సందేహంగా క్రూరం, అమానవీయం, రాక్షస కృతమే. అయితే అది మొదటిదీ కాదు, చివరిదీ కాదు అని అందరూ అంగీకరిస్తున్నదే, కనబడుతున్నదే. అసోం, మణిపూర్‌లో, వాకపల్లిలో, 'బార్డర్‌లో సైనికుడా భారత్‌లో రక్షకుడా మా కోసం...' అని మనం పరవశించి పాడుకొని కీర్తించే మగ భద్రతా దళాల ఆకృత్యాలు గానీ, దాని తదనంతరం ఆదివాసి బాధిత మహిళలు లేదా వాళ్ల తరపున దీర్ఘకాల నిరసనలు, సంవత్సరాల తరబడి ఆమరణ నిరాహార దీక్షలు, ఆక్రందనలు గానీ, ఖైర్లాంజీలో దున్నుకునే భూమి హక్కు కోసం అగ్రకుల ఆధిపత్యాన్ని ధిక్కరించినందుకు మొత్తంగా దళిత కుటుంబానికి, కుటుంబంలోని మహిళల మీద ఊరి ప్రజల సమక్షంలో, బజారులో అత్యాచారం, హత్యా జరిగినపుడు గానీ, హాస్టల్‌లో నిశ్శబ్దంగా తన చదువు తాను చదువుకుంటున్న మైనారిటీ వర్గానికి చెందిన ఆయేషా మీరా మీద అత్యాచారం, హత్య జరిగినపుడు గానీ ఇంత దేశవ్యాప్త మంటలను, మీడియా స్పందనల వెల్లువలుగానీ పెల్లుబుకపోవడం యాదికి వచ్చి పోల్చి చూసి ఇంత నిష్టూరంగా మాట్లాడవలసి వస్తున్నది. అట్లని నిర్భయ పూర్తిగా ఆధిపత్య వర్గానికి చెందినదనే నిష్టూరమూ కాదు. ఆమె జెండర్ రీత్యా మాత్రమే పీడిత, శ్రామిక వర్గం.

పైన పేర్కొన్న సంఘటనలలోని మహిళలతో పోల్చినపుడు గానీ, నివసిస్తున్న సంఘటన జరిగిన స్థలం విద్యారీత్యా ఎలైట్ సెక్షన్‌కు చెందినది. రాజుల సంస్కృతి ప్రజలది అంటే చెల్లదు అని చెరబండరాజు ఆగ్రహాకాంక్ష వ్యక్తం చేసినా చరిత్ర అంతా ఎలైట్ వర్గాల సంస్కృతినే వీలైనంత వరకు మప్పడం రుద్దుకోవడం ఉంటుంది. మప్పడంలో ఆధిపత్య వర్గాల ప్రయోజనం, రుద్దుకోవడంలో పీడిత వర్గాల అమాయకత్వం, తెలివి తక్కువతనం అంటే ఎక్కువవుతదేమో, ఉంటాయి. అందుకే మొన్న ప్రెస్ కౌన్సిల్ చైర్మన్ ఖట్జూ గారన్నది 'భారతదేశంలో 90 శాతం మంది ఇడియట్స్' అని, ఆయన అట్లనడంలో సదరు ఇడియట్స్ మీద అసహ్యంతో, చులకనతో అన్నది కాదు. పది శాతం ఉన్న వైజ్ ఆధిపత్య వర్గాల మీద ఉన్న అసహనం, అసంతృప్తులతో 'దొరలననలేక తొత్తులనని' ఉంటడు.

ఇక ఢిల్లీ విషయానికి వస్తే సమస్య గురించి వామపక్షవాదులు, మానవతా వాదులు కొందరు వాస్తవ విశ్లేషణలు, న్యాయమైన, ఆరోగ్యకరమైన పరిష్కారాలు చేస్తుంటే, మతతత్వవాదులు, సాంప్రదాయ వాదులు తమ పాత వాదనల మీదే నిలబడి ఉన్నారు. పునరుక్తే అయినా కొన్ని మళ్లీ చెప్పుకోవాలి.

అహ్మదాబాద్‌కు చెందిన, ఆసారాం బాపు అనే స్వయం ప్రకటిత అవతార పురుష దేవుడు 'రేపిస్టుతో సమానంగా బాధితురాలూ దోషియే. ఆవిడ నేరస్తుల ముందు మోకరిల్లి సోదరా అని సంబోధించి వేడుకోవలసి ఉండే' అనీ, రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ అధ్యక్షులు మోహన్ భగత్ 'గ్రామీణ నేపథ్యం గల 'భారత్'లో అటువంటి సంఘటనలు జరుగవనీ, కేవలం పాశ్చాత్య సంస్కృతీ ప్రభావిత 'ఇండియా'లో మాత్రమే అట్లా జరుగుతాయనీ' సెలవిచ్చారు. ఇంకా వారే 'ఒక్క చేతితో చప్పట్లు సాధ్యమవుతాయా, నేనట్లా అనుకోను..' అంటూ ఒక సామాజిక సూత్రాన్ని ప్రవచించారు. 'స్త్రీ పురుషుడు భార్యా భర్తలు అనబడే ఒక సామాజిక ఒప్పందంలో ఉంటే – నీవు (స్త్రీ) ఇంటిని చూసుకుంటూ నన్ను సంతృప్తిపరుచు. నేను (పురుషుడు) నీ అవసరాలు తీరుస్తూ నీకు రక్షణ కల్పిస్తాను. ఈ కాంట్రాక్ట్‌కు కట్టుబడి ఉన్నంతకాలం అతడు రక్షిస్తుంటాడు' అని. ఈయనగారి జమాతే ఇస్లామీ – హింద్ కౌంటర్ పార్ట్ గారి ఉవాచ ఏమిటంటే 'సహ విద్యను నిషేధించాలి. విద్యా సంస్థలు అమ్మాయిలకు గౌరవ ప్రదమైన డ్రెస్‌కోడ్‌ను తప్పనిసరి చేయాలి'.

నిజానికి ఈ ఆలోచనలకు మూలాలు ఆయా మతాల ప్రాచీన గ్రంథాలలోనే ఉన్నాయి. బృహదానంద ఉపనిషత్‌లో యాజ్ఞ వల్క్యుల వారు బలాత్కారాన్ని పట్టించుకోవలసిన గంభీరమైన విషయం కాదని సెలవిస్తూ 'స్త్రీ తన రుతు స్రావకాలం ముగిసినంక స్నానం చేసి దుస్తులు మార్చిన పిదప చాలా పవిత్రమైన, అద్భుతమైన స్థితిలో ఉంటుంది. అటువంటి అద్భుతమైన స్త్రీని ఎవరైనా (పురు) కామ కార్యానికి కోరవచ్చు. ఆమె నిరాకరించినపుడు తాయిలం – లంచం ద్వారా, దానికీ లొంగకుంటే బెత్తంతో, పిడికిళ్లతో కొట్టి లొంగ దీసుకోవచ్చు' అని ప్రవచించారు.

భూస్వామ్య, పురుషాధిక్య సమాజంలో 'స్వంత' భార్య అనే స్త్రీని పురుషుని వంశాన్ని నిలిపి ఉంచే, కొనసాగించే జీవమున్న ఆస్తిని చేసి, ఇతర పరస్త్రీ లైంగికతను మాత్రం అమ్మే, కొనే లేదా దొంగలించే,

చెరబట్టే వస్తువుగా, ఆస్తిగా చేసింది. ఇక పెట్టుబడిదారీ పురుషాధిక్య సమాజం గురించి చెప్పే పనిలేదు. వస్తువులను అవసరం కోసం గాక, అమ్మడం – కొనడం కోసం, వ్యాపారం – లాభం కోసం తయారు చేయడం మొదలైనంక కళలు, ఉద్యోగాలు, ఆనందం వంటి వాటినీ సరుకును చేసింది. వ్యాపారం కోసం సరుకుకు ఆకర్షణలను, మెరుపులను అద్దినట్లే, స్త్రీ అనబడే వస్తువుకూ శృంగారం, సెక్స్‌ల కోసమే అన్నట్లు మెరుపులు దిద్ది, ప్రచార ప్రసార మాధ్యమాల ద్వారా రెచ్చగొడుతున్నది. లేని, అసందర్భ సమయాసమయ విచక్షణలేని అవసరాలను కల్పిస్తుంది. అవసరాలను కొనలేని మనిషి దొంగతనమో, దౌర్జన్యమో, దురాక్రమణో చేసి పొందగోరడం భూస్వామ్య పెట్టుబడిదారీ సమాజాల్లో ఉన్నదే. ఇంద్రుడు అహల్యను, గంధర్వుడు వరూధినిని దొంగతనంగా అనుభవించడం, భీష్ముడు తమ్ముల కోసం కాశీరాజు కూమార్తెలను చెరబట్టడం వంటివి పవిత్ర రామాయణ, పంచమవేద మహాభారతంలోని విషయాలే. పైగా ఇక్కడ పేర్కొన్న మగవాళ్లు దేవుళ్లు, కథానాయకులు. ప్రతినాయకులు (విలన్‌లు) కారు.

మతం ఏదైనా స్త్రీకి లైంగిక కన్యత్వ 'పవిత్రత'నే, బోటికి ప్రాణం, మౌనం', అత్యున్నత విలువగా ప్రతిపాదించాయి. అట్లే మాతృత్వాన్నీ ఒక వరంగా, ఉన్నత గమ్యంగానూ చేసినాయి. జీసస్ కన్యకు జన్మించాడు. కనుక పురుషాధిక్యత మీద, అన్యాయం మీద ధిక్కారాన్ని ప్రదర్శించిన స్త్రీ మీద లైంగిక దాడి చేయడమే పురుషాధిక్య విజయ సూచిక. అది సులభ సాధ్యంగానపుడు మృగహింస హత్య.

సోషలిస్టు విప్లవ దశలో చైనా, రష్యాలున్నప్పుడు ఈ రేపులు లేవు. ఒకటో అరో ఉన్నా కూడా ఆదశకు పూర్తిగా చేరని, కొనసాగుతున్న క్రమపు కాలంలో ఉండవచ్చు. అవీ అంతకు ముందున్న వ్యవస్థల పుణ్యమే లేదా చుట్టూ ఉన్న వ్యతిరేక వ్యవస్థల కుట్రనో ప్రభావమో మాత్రమే.

కళాశాలల్లో స్త్రీల హక్కుల కోర్సులు ప్రవేశపెట్టడం, విద్యార్థినులకు మార్షల్ ఆర్ట్స్ శిక్షణా కోర్సులు ఇవ్వడం సమస్యలకు పరిష్కారాలు కావు. ఆర్‌టిఐ ఆక్టివిస్టులకు, విజిల్ బ్లోయర్స్‌కు ఏం గతి పట్టిందో, పడుతున్నదో, వాళ్ల హత్యల పట్ల పెట్టుబడిదారీ దోపిడీ ప్రభుత్వాల స్పందనలు, ఆ చట్టాల, న్యాయస్థానాల అమలు తీరు మన కళ్ల ముందున్నదే. మార్షల్ ఆర్ట్స్‌లో శిక్షణనిచ్చినంత మాత్రాన మృగ సంబంధమైన పశుబలాన్ని ఎదుర్కొంటారనే గ్యారంటీ లేదు. ఫాస్ట్ ట్రాక్ కోర్టులు కఠిన శిక్షా స్మృతులు మొదలైన డిమాండ్లు ప్రకటనలు ఖట్జూ గారన్న 90 శాతం ను కొనసాగించేటందుకే. అందుకు మన కండ్లముందే ఢిల్లీ సంఘటన తర్వాత కూడా కొనసాగుతున్న బాలికల మీద, స్త్రీల మీద హింసలే నిదర్శనం. ఈ వ్యాసం రాస్తున్నప్పుడే టివిలో స్ట్రోలింగ్, ముంబయిలో నాలుగేళ్ల బాలికపై బస్ కండక్టర్ అఘాయిత్యం.

ఈ రోజంతా ఆగ్రహావేశాలతో నేరస్తులను శిక్షించాలంటూ తీవ్ర నిరసనలు తెలిపిన వాళ్లు ఈ మత సంస్కృతి మూలాల మీదగానీ, ఈ మగమృగ సంస్కృతిని పెంచి పోషిస్తున్న పెట్టుబడి సినిమా, మీడియా, వ్యాపార సంస్కృతి మీద గానీ ఇంత తీవ్రంగా నిరసించి రోడ్డు మీదకురారు. గుప్పెడు మంది అభ్యుదయవాదులు మొన్నకు మొన్న 'సారీ టీచర్' వంటి సినిమాల మీద గొంతెత్తి న్యాయ స్థానాలనా శ్రయించినా, తూతూ మంత్రపు సవరణలతో, కోతలతో బయటకు వచ్చి, వారి ఆక్రందనలు అరణ్య రోదనలే. వాళ్ల చెవిలో పూలే.

రకరకాల వివక్షల మీద తిరుగుబాటు చేసే అభ్యుదయవాదులు స్త్రీ పురుష లైంగికత సంస్కృతీ సంబంధాల మీద ప్రభావం చూపే జీవ సంబంధమైన, భౌగోళికాంశాల ప్రభావం ఫలితంగా ఏర్పరుచుకున్న దంతా తెగల సంస్కృతులలోని కట్టుబాట్లను కూడా కొన్నింటిని ఆలోచించాలి. మతాలలో ప్రాంతీయ, ప్రాచీన, పరిణామ క్రమంలో ఏర్పరుచుకున్న సామాజిక నియమాల్లో మూఢ మూర్ఖత్వాలు ప్రవేశించి ఉండవచ్చు. కరుడుగట్టుకు పోయి ఉండవచ్చు. కానీ అన్నీ పూర్తిగా నిరసించదగినవి, కొట్టి పారేయదగినవి కావేమో. ఉదాహరణకు సెక్స్ విషయంలో జంతుజాలాన్ని పరిశీలిస్తే, కాలానుగుణ రుతువుల్లో కూడా ఆడజాతి అందుకు సిద్ధంగా, ఆసక్తిగా ఉన్నా పాసివ్‌గా ఉంటుంది. అదే మగజాతి ఆక్టివ్‌గా ఉండి స్వజాతితో పోటీ పడుతుంది. కొట్లాడుతుంది. ఇదో అంశం కాగా, భూమధ్యరేఖకు సమీపంలో ఉన్న ప్రాంతాల్లోని మనుషులకు, దూరంగా శీతల దేశాల్లోని మనుషుల లైంగిక ఉద్దీపనల విషయంలో తేడాలుంటాయేమో. వాటి పరంగా నాగరికతా సంస్కృతులు ఏర్పడ్డాయేమో ఆలోచించాలి. పాశ్చాత్య అభివృద్ధి చెందిన దేశాల్లో లింగభేదం లేకుండా ఆలింగనల ద్వారా, ముద్దుల ద్వారా శుభాకాంక్షలు తెలుపుకుంటారు. భారత్ వంటి కొన్ని ఇతర దేశాల్లో దృశ్యం, కరస్పర్శా చాలు సెక్స్ ఉద్దీపనలు కలగడానికి. వీటికనుగుణంగా కూడా సంస్కృతులు అభివృద్ధి చెంది ఉండవచ్చు. వీటిలోనికి పెట్టుబడిదారీ విశృంఖల సంస్కృతి చొరబాటు ఉండనే ఉంది. అదొక విషయం.

ఇకపోతే వివక్షలు, తత్సంబంధిత విలువలు లేని సోషలిస్టు సమాజం అనండి, మానవతా సమాజం అనండి, వాటి స్థాపన సుదూర గమ్యం. దానికి చేరుకునే మధ్య దూరం ఒక పెద్ద అగాథం. పోరాట మార్గం కత్తుల వంతెన. ఒకవైపు దాన్ని చేరుకునే పోరాటం చేస్తూనే, తాత్కాలిక వ్యవస్థీకృత సమాజంలో బాధితులకు తాత్కాలిక ఉద్వేగ ఉపశమనంగా, నేరస్తులకు భయంగా అడ్డుగోడగా కఠిన శిక్షాస్మృతులు అవసరమే. కాని అన్ని దౌర్జన్యాలకు, హింసలకు పరిష్కారం సామాజిక మార్పు వరకు వేచి ఉండాలి అనుకోవడం నేరాన్ని పూర్తిగా వ్యవస్థల మీదే మోపడం కూడా సరియైంది కాదేమో. ఉరిశిక్షతో నిజానికి నేరస్తుడు కళ్ల ముందు నుండి అదృశ్యమై, పెట్టుబడిదారీ అనారోగ్య పోటీ సమాజంలో మిగిలిన విశాల ప్రజానీకం నేర సంఘటనలను తొందరగానే మరిచిపోతారు. అట్లని నాలుగ్గోడల నడుమ యావజ్జీవ కారాగార శిక్షలు కూడా విశాల ప్రజాశ్రేణులకు కనపడవు. సదరు నేరస్తుడు, శిక్ష వల్ల కలిగే హింసను భరించలేక ఆత్మహత్యకు పాల్పడితే వేరే విషయం కానీ, వాడు బజార్లోనో, రోడ్డు మీదో జనసమ్మర్ధంలో శిక్షను కొన ఊపిరి దాకా అనుభవించాలే. కృంగి కృషించాలి. అది మృగ సమాజాన్ని ఆధిక్య పశుత్వాన్నీ వదులుకోని మిగిలిన ఇతరులకు కళ్ల ముందు కనిపిస్తూ వెన్నులో వణుకునూ, చెమటనూ పట్టిస్తుండాలే. సవరణకు లోబడి ఇట్లంటున్నాను ఆలోచించండి. ఇన్ని త్యాగపూరిత ఉద్యమాలు జరుగుతుండగా ఇగ్నోరెన్స్ ఈజ్ బ్లిస్ అన్నట్లు ఫూల్స్ పారాడైజ్‌లో ఉండడానికే మెజారిటీ, విద్యావంతులైన జనం కూడా ఇష్టపడుతున్నారు.

*(రచయిత రిటైర్డ్ ఉపాధ్యాయులు)* వీ

# తెలుగు, తెగులు, మిగులు మహా (అ) సభలు

***ప్రపంచ తెలుగు మహాసభల పేరిట పాలకవర్గాలు జరిపిన సభలు అప్రజాస్వామికమైనవని, ప్రత్యేక తెలంగాణ ఆకాంక్షల నుంచి దృష్టి మళ్లించడానికి జరిపినవని అంటున్నారు* వరవరరావు**

రాజుల సంస్కృతి ప్రజలది అంటే
చెల్లదు చెల్లదు చెల్లదులే

**– చెరబండరాజు**

ప్రపంచ తెలుగు మహాసభలు అంటే ప్రపంచంలో ఉన్న పదకొండు కోట్ల తెలుగు ప్రజలని ఒక చోట చేర్చాలా, అదెట్లాగూ అసాధ్యం. ఈ సభల కోసమే సభలకు ముందే తెలుగు భాషా సంఘం అధ్యక్షుడుగా నియమింపబడిన మండలి బుద్ధప్రసాద్ గారు ప్రపంచ వ్యాప్తంగా ఉన్న పదకొండు కోట్ల తెలుగు ప్రజల భావ సమైక్యత సాధించడానికి ఈ తెలుగు మహాసభలని ఒక తెలుగు పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో చెప్పాడు. మరి ఈ భావ సమైక్యత ఎట్లా సాధ్యం? ఆయన ప్రపంచ వ్యాప్తంగా ఉన్న పదకొండు కోట్ల తెలుగు ప్రజల గురించి మాట్లాడాడు. కాబట్టి ఆయనకు కనీసం ఈ పదకొండు కోట్ల మందిని ఒకే రాష్ట్రంలో బలవంతంగా ఉంచడం వల్ల సాధ్యం కాదనే వివేకం ఉందని అనుకోవాలి. వేరు వేరు ప్రాంతాల్లో, దేశంలోనూ, దేశం బయటా, రాష్ట్రంలోనూ, రాష్ట్రం బయటా ఉన్న తెలుగు వాళ్ల మధ్యన భావ సమైక్యతను సాధించడం మరి ఏ ప్రాతిపదికత మీద సాధ్యమవుతుంది? పునాది స్థాయిలోనయితే అది రాజకీయ, ఆర్థిక సమానత్వం వల్ల సాధ్యం అవుతుంది. ఉపరితలంలో అది రాజకీయ, సాంస్కృతిక సమానత్వం వల్ల సాధ్యం కావాలి. ఈ సమానత్వాన్ని ఒక వర్గ సమాజంలో పీడక పాలకవర్గం సాధిస్తుందని అనుకోవడం ఒక భ్రమ. పాలకులు ముఖ్యంగా అధికారంలో ఉన్నటువంటి పార్టీ ప్రజల భావసమైక్యతను సాధించే ఒక కార్యక్రమాన్ని చేపడుతుందని ఆశించడం వర్తమాన పరిస్థితుల్లో ఎంత అసాధ్యమైన విషయమో వివరంగా చర్చించనక్కర్లేదు. కనుక ఏ నేపథ్యం నుంచి ఈ ప్రపంచ తెలుగు మహాసభల ఆలోచన వచ్చిందో రెండు సందర్భాలను తీసుకొని స్థూలంగా చర్చించుకుందాం.

తెలుగు సభలు అన్నప్పుడు తెలుగు ప్రజలకు సంబంధించిన అన్ని అంశాలు ప్రస్తావనకు వచ్చి, కూలంకషంగా చర్చించబడి, అందులో ఉన్న సమస్యలు ఏమిటి, వాటికి పరిష్కారాలు ఏమిటి అని కనుగొనడమే అనుకున్నప్పటికీ, భావసమైక్యత అనే మాట వాడేదాన్ని బట్టి గానీ, 1975 నుంచి ఇప్పటికి నాలుగుసార్లు జరిగిన తీరునుబట్టి గానీ ప్రధానంగా ఈ సభలు తెలుగు భాష, సంస్కృతి, సాహిత్యం మొదలైన లలిత కళల గురించి చర్చించే వేదికగా ఉంటుందనేది ఊహించుకో వచ్చు. ఇటువంటి సభలు గతంలో తెలుగు భాషా సంఘాలో, తెలుగు సాహిత్య సంఘాలో నిర్వహించి, అపూర్వమైన విజయాన్ని సాధించిన సందర్భాలు ఉన్నాయి. తెలంగాణకు సంబంధించినంత వరకు శ్రీకృష్ణదేవరాయ భాషా నిలయం ఏర్పడిన దగ్గరి నుంచి గ్రంథాలయోద్యమం మొత్తంగానూ, ఆంధ్ర సారస్వత పరిషత్ ఏర్పడిన దగ్గరి నుంచి తెలంగాణ సాహిత్య రంగం మొత్తంగానూ తెలంగాణ ప్రజల్లో ఒక జాగరూకతనూ, ఒక చైతన్యాన్నీ తెలుగు భాషా, సాహిత్య సంస్కృతుల పట్ల ఒక వికాసాన్ని తెచ్చాయి. తెలంగాణ రచయితల సంఘం ఏర్పడి 1953లో అలంపురంలో తెలుగు మహాసభలు నిర్వహించి ఇప్పటికీ జ్ఞాపకం పెట్టుకునేంత అపూర్వంగా జరిపినవి. ఆ సభలు పూర్తిగా గడియం రామకృష్ణ శర్మ వంటి స్థానిక, ఆంధ్ర సారస్వత పరిషత్ బాధ్యుడు పూనుకొని నిర్వహించిన సభలు మాత్రమే కాకుండా, తెలుగు నేల మీది అప్పటి రచయితలూ, బుద్ధిజీవులందరూ ఒక వేదిక మీద వచ్చే సభలైనవి. ఆ సభలకు వచ్చిన ఒకే ఒక ప్రభుత్వ ప్రతినిధి భారత ఉపాధ్యక్షుడు సర్వేపల్లి రాధాకృష్ణన్ స్వయంగా సాహిత్యవేత్త. ఆయన రావడం సాహిత్య సభ సందర్భమే కాకుండా, అలంపురంలో శిల్పకళా ఖండాలు తుంగభద్రలో మునిగిపోకుండా కాపాడబడే ప్రభుత్వ సహకారానికి కూడా దోహదం చేసింది. ప్రభుత్వమే పూనుకొని ఇటువంటి భావసమైక్యత కోసం సభలు జరపాల్సిన అవసరం లేదని చెప్పడానికే ఈ ఉదాహరణ. ఇటువంటి ప్రయత్నాలు ప్రజల నుంచి, ఆయా సామాజిక వర్గాల నుంచి జరగాలే. ఈనాటికీ మహారాష్ట్రలో లేదా ఇరుగు పొరుగు రాష్ట్రాల్లో ఇటువంటి సభలను స్వతంత్ర సాహిత్య సంఘాలు నిర్వహిస్తాయి. అవి ఒక మేర ప్రభుత్వాల సహాయం తీసుకోవచ్చు. దిగజారిపోయే పరిస్థితి అన్ని అంశాలనూ, కార్పొరేట్ శక్తులు, వాటి దళారీగా పనిచేసే ప్రభుత్వం తమ చేతుల్లో తీసుకొనే పరిస్థితి మన దగ్గర 1975 ప్రపంచ తెలుగు సభల నుంచి ప్రారంభమైంది.

1960లలో విశ్వసాహితి అనే సంస్థ తరఫున పోతుకూరి సాంబశివరావుగారు ఆంధ్ర సారస్వత పరిషత్‌లోనే ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించారు. ఆయనకు సాధ్యమైన స్థాయిలో. గుంటూరు శేషేంద్ర శర్మ, ఇందిరా ధనరాజ్‌గిరి వంటి వాళ్లు ఆ సభల ద్వారానే హైదరాబాద్‌లో సాహిత్య లోకానికంతా పరిచయమయ్యారు, చాలా కృషి చేశారు. 1956లో రాష్ట్రం ఏర్పడగానే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కూడా వచ్చింది. మిగతా లలిత కళలకు కూడా అకాడమీలు వచ్చాయి. ఆంధ్ర భాషా సంఘం ఇప్పటి వలె నామమాత్రం కాకుండా ఉండేది. తెలుగు అకాడమీ ఉన్నది. వీటికున్న స్వతంత్ర ప్రతిపత్తి ఎంత అనే అంశం అలా ఉంచి, ఇవేవీ కాకుండా 1975 నుంచి ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించే బాధ్యత నేరుగా ప్రభుత్వమే ఎందుకు

తీసుకుంటున్నది? ఏ భావ సమైక్యత కోసం ఈ సభలు? అనేది ప్రజాస్వామ్య దృక్పథం కలవారు అందరూ ఆలోచించవలసిన అంశం.

1975లో మొదటిసారి ప్రభుత్వపరంగా పెద్ద ఎత్తున ప్రపంచ తెలుగు మహాసభలు జరపాలని అప్పటి ముఖ్యమంత్రి జలగం వెంగళరావు తలపెట్టాడు. అవి 1975 ఏప్రిల్‌లో జరిగాయి. ఆ కాలం గుర్తు చేయగానే ఇంకో రెండు నెలలు పోగానే దేశంలో ప్రాథమిక హక్కులను కూడా హరించిన ఆంతరంగిక ఆత్యయిక స్థితి (ఎమర్జెన్సీ) ఎవరికైనా గుర్తొస్తుంది. అట్లాగే జలగం వెంగళరావు అనగానే 1967 నుంచి హోం మంత్రిగాను, 1973 నుంచి ముఖ్యమంత్రిగాను తెలుగు నేల మీద కనీ వినీ నిర్బంధాన్ని, రాజ్యహింసను అమలు చేసిన వానిగా ఎవరికైనా గుర్తుకొస్తుంది. ఒకరకంగా ఈ ఎమర్జెన్సీకి ఉపరితల రంగంలో డ్రెస్ రిహార్సల్ వంటివే అప్పటి ప్రపంచ తెలుగు మహాసభలు. 1967 అక్టోబర్ 31న ప్రారంభమైన శ్రీకాకుళ రైతాంగ పోరాటాన్ని ఎన్‌కౌంటర్‌ల పేరుతో నెత్తుటేర్లలో ముంచి, పోలీసు క్యాంపులు పెట్టి, కల్లోలిత ప్రాంతాలు ప్రకటించి, 1972 నాటికి వెంగళరావు ప్రభుత్వం 370 మంది విప్లవకారులను పొట్టన పెట్టుకున్నది. అట్లాగే, ఒక విధంగా ఆయన జిల్లా అయిన ఖమ్మంలోనే కొత్తగూడెంలో తెలంగాణ హక్కుల కొరకు ప్రారంభమైన ఉద్యమం 1969 నాటికి ప్రత్యేక తెలంగాణ ఉద్యమంగా ఒక మిలిటెంట్ రూపాన్ని తీసుకొని సమకాలీన ఫ్రెంచ్ విద్యార్థి విప్లవాన్ని తలపించేంత మిలిటెంట్‌గా సాగితే, దానిని కూడా కర్ఫ్యూలూ, పోలీసు కాల్పులు, నిర్బంధాలు, చిత్రహింసల నెత్తురుటేర్లలో ముంచి 370 మంది విద్యార్థులను, యువకులను పొట్టన పెట్టుకున్నది కూడా ఈ వెంగళరావు ప్రభుత్వమే. తిరిగి 1972లో జై తెలంగాణ, జై ఆంధ్ర ఉద్యమాలు వచ్చినప్పుడు రెండు చోట్లా తీవ్ర నిర్బంధాన్ని అమలు చేసి, రావిశాస్త్రిగారు చెప్పినట్టు 'ప్రభుత్వం నడవడం అంటే పోలీసు వ్యవస్థ నడవడం'గానే సాగిన రోజుల్లో తెలుగు ప్రజలందరికీ నిర్బంధాన్ని చవిచూపింది ఈ ప్రభుత్వమే. 1973 నుంచి దేశవ్యాప్తంగానే అవినీతికి వ్యతిరేకంగా యువతరం ఒక అసంతృప్తిలో పోరాటాలు చేపట్టినప్పుడు బీహార్, గుజరాత్ లాంటి చోట్ల నూతన సృజనాత్మక పోరాటాలు వస్తున్నప్పుడు ఆ నేపథ్యం నుంచే దేశవ్యాప్తమైనటువంటి రైల్వే సమ్మె 1974లో వచ్చింది. దేశవ్యాప్తంగా ఇందిరాగాంధీ, రాష్ట్రంలో వెంగళరావు 35 రోజుల పాటు సాగిన ఈ పోరాటాన్ని క్రూరంగా అణిచివేసారు. అటు ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలోనూ, ఇటు రైల్వే సమ్మెలోనూ తమకు బలమున్న ప్రాంతాలలో ముఖ్యంగా వరంగల్ జిల్లాలో కాజీపేట, డోర్నకల్ వంటి చోట్ల ఈ రైల్వే సమ్మెలోనూ వేలాది మంది కార్మికులను ఈ ప్రభుత్వం ఉద్యోగాల నుంచి తొలగించి, తీవ్ర నిర్బంధానికి గురిచేసింది. ఈ సమయంలో ముందు వచ్చినవే ప్రపంచ తెలుగు మహాసభలు. ముఖ్యంగా ఇప్పుడు చాలామంది విశ్లేషకులు చెపుతున్నట్లుగా 'జై ఆంధ్ర', 'జై తెలంగాణ' ఉద్యమాల ద్వారా స్థిరపడిపోయిన ఆంధ్ర, తెలంగాణ వేర్పాటువాదాన్ని తొలగించి 'భావ సమైక్యత' సాధించడానికే వెంగళరావు ప్రపంచ తెలుగు మహాసభలు తలపెట్టాడు. స్థూలంగా పైకి కనిపించే ఈ లక్ష్యంతో పాటు, శ్రీకాకుళ ఉద్యమం, ప్రత్యేక తెలంగాణ ఉద్యమాల నుంచి రైల్వే సమ్మె దాకా ఒక అండర్ కరెంట్‌గా చోదక శక్తిగా ఉన్న విప్లవోద్యమాన్ని అణచడంగా కూడా వెంగళరావు లక్ష్యం ఉన్నది. ప్రభుత్వం ప్రత్యక్షంగా ఈ సభలు నిర్వహించడం, ఇది ప్రభుత్వ వ్యవహారంగా ఉండడం గురించి అప్పుడు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షుడుగా ఉన్న విశ్వనాథ సత్యనారాయణను కూడా ఒప్పించి శ్రీశ్రీ ప్రపంచ తెలుగు మహాసభల బహిష్కరణకు పిలుపునిచ్చాడు. విప్లవోద్యమంపై నిర్బంధానికి స్పష్టమైన వ్యక్తీకరణగా కనిపిస్తున్న సత్యం, కైలాసాలు, పంచాది కృష్ణమూర్తి, పంచాది విమలల మొదలు, పాణిగ్రాహి, చిన్నబాబుల వరకు ఎన్‌కౌంటర్ హత్యలు, విరసం పుస్తకాల నిషేధం, విరసం రచయితల అరెస్టులు మొదలు విప్లవకారులనూ, విప్లవ రచయితలనూ పెద్ద ఎత్తున నిర్బంధించిన సికింద్రాబాద్ కుట్ర కేసు వరకు శ్రీశ్రీ ఉదాహరణలుగా పేర్కొన్నాడు. శ్రీశ్రీ అండర్ కరెంట్‌గా ఉన్న ఈ నిర్బంధం గురించి బహిష్కరణ కోరుతున్నాడని గ్రహించగానే విశ్వనాథ సత్యనారాయణ వెనక్కి వెళ్లాడు గాని, 1975 ఏప్రిల్‌లో శ్రీశ్రీ నాయకత్వంలో ఈ ప్రపంచ తెలుగు మహాసభలను చెరబండరాజు మొదలైన విప్లవ రచయితలు, రాడికల్ విద్యార్థులు బహిష్కరించి, అరెస్టయి ముప్పై గంటలు పైగా బొలారం పోలీస్ స్టేషన్‌లో నిర్బంధించబడినారు. ఇది అంతర్జాతీయంగా సంచలన వార్త అయింది. జలగం వెంగళరావు ముఖ్యమంత్రిగా ఏనుగు అంబారీపై హైదరాబాద్ నగర వీథుల్లో తిరిగి, ఆకాశ వీథుల నుంచి సమాచార శాఖ అధికారి పూలవర్షంలో తడిసినప్పటికీ శ్రీశ్రీని అక్రమ నిర్బంధంలో పెట్టిన అపకీర్తిని మాత్రం మూటకట్టుకున్నాడు. ఈ సభలను ప్రత్యేక తెలంగాణ ఉద్యమం రోజుల్లో మంత్రులతో పాటు వేదికను పంచుకోనని ప్రతిజ్ఞ చేసిన ప్రజాకవి కాళోజీ కూడా బహిష్కరించాడు. కాళోజీ ఈ నియమాన్ని 1969 నుంచి ఎమర్జెన్సీ తొలిగే వరకు కొనసాగించాడు.

చరిత్ర ఒక్కొక్కసారి విషాదంగానూ, ఒక్కొక్కసారి ఫార్స్‌గానూ పునరావృతం అవుతుందంటారు. ఈసారి ఇది విషాదంగా మాత్రమే కాదు, ఫార్స్‌గా కూడా పునరావృతం అయింది. 1975 ప్రపంచ తెలుగు మహాసభల్లో కనీసం పాలకవర్గాలకూ, ప్రభుత్వానికీ అండగా ఉండే రచయితలైనా కొందరు ఆ సభల్లో పాల్గొని ఉంటారు. విశ్వనాథ సత్యనారాయణ, దాశరథి, సి. నారాయణరెడ్డి మొదలైనవాళ్లు. సభలు నిర్వహించిన వాళ్లలో దేవులపల్లి రామానుజరావు వంటి వాళ్లు ఉండి ఉంటారు. ఈసారి ఈ సభల్లో అటువంటి సాహిత్య గంధం ఉన్న వాళ్ల పేరే వినం. చివరికి ఈ సభలకు డా. సి.నారాయణరెడ్డి, ఎన్. గోపి, అంపశయ్య నవీన్ వంటి వాళ్లు కూడా వెళ్లలేదు. (తెలంగాణలో తెలంగాణ రాష్ట్ర ఆకాంక్షతో ఆత్మహత్యలు చేసుకున్న వెయ్యి మంది యువకుల శవాల మీది నుంచి ఆ సభలకు వెళ్లడానికి తనకు మనస్కరించలేదని ఎన్. గోపి అన్నాడు.)

ఒకవైపు భావసమైక్యత గురించి మాట్లాడే ప్రభుత్వం భావ సమైక్యత, భాషా సంస్కృతాల ద్వారా సాధించవలసిన ఒక ప్రయోజనాన్ని, ఒక ఆధిపత్య భావజాలాన్ని ఎట్లా బలి పెడుతుందో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఒక ఉదాహరణ. భాషా ప్రాతిపదికపై ఏర్పడిన తొలి రాష్ట్రం ఇది. విశాలాంధ్రలో ప్రజారాజ్యం భావనతో ఆరంభమై, ఆంధ్రప్రదేశ్ ఏర్పడే నాటికి ఆ పేరు ఎంత కృత్రిమ మార్పు చెందిందో, ఆ ఆకాంక్ష అంత ఛిద్రమైన స్థితిలో తెలుగు ప్రజలు ఒకటయ్యారు. ఇంక అక్కడి నుంచి

చరిత్రంతా ఒక అణచివేత చరిత్రే. తెలుగు జాతిగా ఒక అణచివేత చరిత్రే. తెలుగు జాతిలోనే ఒక ఆధిపత్య వర్గం మిగిలిన తెలుగువారిని అణచివేసిన చరిత్రే. అది తెలంగాణ ప్రాంత ప్రజలను డెల్టా జిల్లాల సంపన్న వర్గాల అణచివేత కావచ్చు, అది డెల్టా జిల్లాల్లోనే కంచికచెర్ల కోటేషు మొదలు లక్షింపేట దళితుల వరకు అణచివేసిన చరిత్ర కావచ్చు. ఇది అన్ని జీవన రంగాల విషయంలోను అన్వయించకపోవచ్చు. 150 సంవత్సరాల క్రితం కృష్ణా గోదావరి నదులపై ఆనకట్టల నిర్మాణం జరిగిన తరువాత అదనపు విలువ నుంచి పుట్టుక వచ్చిన ఒక సామాజిక సంపన్న వర్గం, ఈస్ట్ ఇండియా కంపెనీ వచ్చిన దగ్గరి నుంచి ఫ్యూడల్ బ్రాహ్మణీయ భూస్వామ్య భావజాలం, ఇంగ్లిష్ చదువులకూ, శాస్త్రాలకూ, చట్టాలకూ ఎగబాకిన బ్యూరాక్రసి కలిసి 1956 నాటికి ఒక దళారీ, దోపిడీ వర్గంగా రూపొందినవి. పైన చెప్పిన నిర్బంధం అంతా ఈ దళారీ, దోపిడీ వర్గం అమలు చేసిందే. వెంగళరావు వంటి పేర్లు స్పష్టత కోసం ఆయా సందర్భాలలో వచ్చేవి మాత్రమే.

ఇటువంటి ఆధిపత్య వర్గాలు ప్రజలను అణచివేయడానికి ప్రధానంగా రెండు ఆయుధాలను ఉపయోగిస్తాయి. ఒకటి, నేరుగా, ప్రత్యక్షంగా హింసించే, ప్రాణం తీసే ఆయుధం. అది లాఠీ, కత్తి, తుపాకి ఏదైనా కావచ్చు. మరొకటి, పరోక్షంగా హింసించే ఆధిపత్య భాష. మామూలుగా మనం విద్యార్థులకు డిబేట్ పోటీలకు పెట్టే కత్తి గొప్పా, కలం గొప్పా అనే చర్చ వలె వర్గ సమాజంలో రెండు శిబిరాలకు కత్తితో పాటు కలం అండ ఉంటుంది. ఈ రెండూ ఒకవర్గ సమాజంలోని రెండు వర్గాలకు ఎప్పుడూ అవసరమైనవే. ఒక భూమి సేన, ఒక సాంస్కృతిక సేన. భూమి సేనతో తనను రక్షించుకునే ఆధిపత్య పాలన, సాంస్కృతిక సేనతో తన భావజాలాన్ని రక్షించుకునే కుట్రయే ప్రపంచ తెలుగు మహాసభలు. కనుక చెరబండరాజు రాజుల చరిత్ర ప్రజలది కాదు అన్నప్పుడు రాజులు తలపెట్టే ఏ పని అయినా అది భూమి మీద అయినా, ఆకాశంలో అయినా, అది పునాదిలోనయినా, ఉపరితలంలోనయినా అది ప్రజలకు మేలు చేసేది కాదు అనేది మౌలికంగా ప్రజాస్వామ్యవాదులు అర్థం చేసుకోవాల్సిన అంశం. ఇటువంటి సందర్భంలో ప్రజాపక్షం వహించేటటువంటి కవులూ, కళాకారులూ, రచయితలూ, బుద్ధిజీవులూ ప్రాంతాలకూ, కులాలకూ, మతాలకూ వాటాల ప్రాతిపదికన కాకుండా ప్రభుత్వ స్వభావ ప్రాతిపదికగా ఈ సభలను బహిష్కరించాల్సి ఉంటుంది.

2012 డిసెంబర్ 27న తిరుపతిలో నాల్గవ ప్రపంచ తెలుగు మహాసభలు జరగడానికి ముందు ఒకసారి మారిషస్‌లోనూ, మరోసారి కౌలాలంపూర్‌లోనూ ఈ సభలు జరిగాయి. కనుక తెలుగు సమాజానికి అంత దూరంగా జరిగిన ఈ సభలు పెద్దగా పట్టలేదు. ఈ ముప్పై ఏడేళ్లకు తిరిగి ఈ నేల మీదకు తిరిగివచ్చిన ఈ సభల నాటికి ఆంధ్రప్రదేశ్ ఒక నిప్పుల కుంపటిపై ఉన్నది. వాస్తవానికి దేశమే అట్లా ఉన్నది, కాని ప్రస్తుతం మనం ఈ సభల సందర్భంగా తెలుగు సమాజం గురించే మాట్లాడుకుందాం. ఈ తెలుగు సమాజం దేశంలో 2009 నవంబర్‌లో ప్రారంభమైన గ్రీన్‌హంట్ ఆపరేషన్ పేరిట ప్రజల మీది యుద్ధం నుంచి విడిగా ఏమీలేదు. అందుకే అప్పుడెట్లాగైతే శ్రీకాకుళ ఉద్యమ నేపథ్యం నుంచి రైల్వే సమ్మె నేపథ్యం వరకు అణచివేత సంస్కృతిలో భాగంగా ప్రపంచ తెలుగు సభలు వచ్చాయని చెప్పానో, ఇప్పుడు అట్లాగే ఈ ప్రపంచ తెలుగు మహాసభలు గ్రీన్‌హంట్ ఆపరేషన్ సాంస్కృతిక వ్యక్తీకరణ అని విరసం భావించింది. విరసంతో పాటు, అరసం, తెలంగాణ రచయితల సంఘం, మరెన్నో విప్లవ ప్రజాసంఘాలు ఈ సభలు అప్రజాస్వామికమైనవని, దశాబ్దన్నరగా సాగుతున్న ప్రత్యేక తెలంగాణ ఉద్యమం నుంచి దృష్టి మళ్లించడానికి వచ్చినవని స్పష్టంగానే చెప్పి, బహిష్కరించారు, నిరసించారు, దూరం ఉన్నారు. కత్తి పద్మారావు మరికొందరు దళిత రచయితలు కూడా ఈ సభలను బహిష్కరించారు. ఏ సంఘంలో లేని ఎంతో మంది ప్రజాస్వామిక దృక్పథం గల బుద్ధిజీవులు కూడా ఈ సభలకు వెళ్లకుండా ఉన్నారు.

అప్పుడైనా విప్లవోద్యమం మీద, విప్లవకారుల మీద, విప్లవ రచయితల మీద తీవ్ర నిర్బంధం ఉందేమో కానీ, ఇప్పుడు మొత్తంగా సామ్రాజ్యవాద ప్రపంచీకరణను వ్యతిరేకిస్తున్న వారి మీద, సెజ్‌లను, పవర్ ప్లాంట్‌లను, ఓపెన్ కాస్ట్‌లను, ఇందిరా సాగర్ వంటి ప్రాజెక్ట్‌లను వ్యతిరేకిస్తున్న వారి మీద, తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమంలో ఉన్న వారి మీద, వేలాది మంది మీద నిర్బంధమూ, రాజ్యహింస కొనసాగుతున్నది. ఇవాళ తెలుగు నేల మీద ప్రత్యామ్నాయ భావజాలంతో ఉన్నవాళ్లు గానీ, తెలంగాణ రాష్ట్రం కోరుతున్న వాళ్లు గానీ, తమ మీద కేసులు లేకుండా, జైలు వెళ్లకుండా ఉన్నవాళ్లు ఒక్కళ్లు లేరు. తెలంగాణలో విద్యార్థులైతే ఒక్కొక్కళ్లూ పదుల నుంచి వంద దాకా కేసుల్లో ఇరికించబడి, జైళ్లలోకి, కేసుల చుట్టూ తిరుగుతున్నారు.

2012 డిసెంబర్ నాటికి 1975 ఏప్రిల్ నాటి వలనే తెలుగు నేల మీద విప్లవోద్యమం సెట్‌బ్యాక్‌కు గురై ఉన్నది. శ్రీకాకుళ ఉద్యమం పూర్తిగా తుడిచిపెట్టుకుపోయి, 1974 స్వియ విమర్శతో మళ్లీ ఒక పునర్ నిర్మాణ ప్రయత్నం జరుగుతున్నప్పటికీ దానికొక రూపకల్పన 1976లో నాగ్‌పూర్‌లో జరిగిన తెలంగాణ ప్రాంతీయ కమిటీ మార్క్సిస్ట్ లెనినిస్ట్ సమావేశంలో కానీ రోడ్ టు రెవల్యూషన్ ద్వారా ఏర్పడలేదు. ఎమర్జెన్సీ ఎత్తివేసి 1978 ఫిబ్రవరిలో వరంగల్‌లో ఆర్ఎస్‌యు సభలు, మేలో గుంటూరు రాడికల్ యువజన సభలు జరిగి 'గ్రామాలకు తరలండి' పిలుపు ఇచ్చి తరువాత జగిత్యాల జైత్రయాత్ర (సెప్టెంబర్ 1978)తో గాని అది ఒక అప్రతిహత మార్గం తీసుకోలేదు. ఇప్పుడు నాయకత్వం క్షేమంగా ఉన్నప్పటికీ ఉత్తర తెలంగాణ ఒక సెట్‌బ్యాక్ గురై, ఆంధ్రా-ఒరిస్సా సరిహద్దు విప్లవోద్యమం నారాయణపట్న వంటి ఉద్యమాలతో పురోగమిస్తున్నప్పటికీ నల్లమల ఉద్యమం పూర్తిగా దెబ్బతిని, తెలుగు నేల మీద నిర్మాణం కనిపించని స్థితి ఉన్నది. ప్రభావం మాత్రం బలంగా ఉన్నది.

ప్రత్యేక తెలంగాణ ఉద్యమం 1969-72 వలె కాకుండా 1996 నుంచే ఒక విధంగా చంద్రబాబు నాయుడు ప్రపంచ బ్యాంక్ అభివృద్ధి నమూనాకు ప్రత్యామ్నాయంగా ప్రజాస్వామిక ప్రత్యేక తెలంగాణ ఉద్యమంగా మొదలై కొనసాగుతూ ఉన్నది. ఒక్కొక్కసారి మిలియన్ మార్చ్, సకల జనుల సమ్మె, చలో హైదరాబాద్ వంటి రూపాల్లోనూ, కొన్నిసార్లు 2009 నవంబర్ 29 నుంచి డిసెంబర్ 10 వరకు సాగిన, ప్రపంచాన్ని కుదిపేసిన పదిరోజులు గానూ సాగినప్పటికీ, మరొకవైపు ఎన్నికలూ, లాబీయింగ్ వంటి రూపాలూ ఎట్లా సాగినప్పటికీ తెలంగాణ

ఆకాంక్ష, భావన అనేవి పదహారేళ్లుగా తెలంగాణ వ్యాప్తంగా స్థిరపడిన ఒక భావన ఇది. ఇది రెండు తెలుగులు వేరన్నంత తీవ్రస్థాయిక్కూడా వెళ్లింది. కనుక ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని అణచివేయడం కూడా ఈ ప్రపంచ తెలుగు సభల తక్షణ, ప్రత్యక్ష లక్ష్యంగా ఉన్నది. ఇవి కాకుండా ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాల్లో ప్రపంచ బ్యాంక్ అభివృద్ధి నమూనా వల్ల జరుగుతున్న విధ్వంసం, ముఖ్యంగా దక్షిణ సముద్ర తీరం అంతా పవర్ ప్రాజెక్టుల కోసం జరుగుతున్న విధ్వంసం, ప్రజల తిరుగుబాటు, రాయలసీమ కరువు వంటి అంశాల నుంచి దృష్టి మళ్లించడానికి కూడా ఈ సభలు తలపెట్టారు. దేశంలోనే ఒక ధోరణిగా మారిన అవినీతి, స్కాంలు, పాలకులు జైళ్లలో మినీ పార్లమెంట్‌లూ, అసెంబ్లీలూ నిర్వహించుకునే స్థితి నుంచి దృష్టి మళ్లించడానికి కూడా ఈ సభలు తలపెట్టారు.

కనుక సారాంశంలో ఇది గ్రీన్‌హంట్ ఆపరేషన్‌లో భాగమైన సాంస్కృతిక వ్యక్తీకరణగా విరసం భావించి ఈ సభలను బహిష్కరించాలని పిలుపు ఇచ్చింది. ఈసారి ఈ బహిష్కరణ పిలుపు ఎంత ప్రజాస్వామికమైన ఆమోదాన్ని పొందిందంటే 1975 సభలు శ్రీశ్రీ వంటి శిఖరాయమానమైన వ్యక్తి అరెస్ట్ అయి అందరి దృష్టిని ఆకర్షిస్తే, ఈసారి పేర్కొనదగిన రచయిత, బుద్ధిజీవి ఎవరూ ఈ సభలకు వెళ్లకపోవడం వల్ల అధిక సంఖ్యలో బహిష్కరించి, నిరసన తెలపడం వల్ల చాలా మంది దృష్టిని ఆకర్షించింది. విప్లవ రచయితలు కర్నూలు లోనూ, తిరుపతిలోనూ అరెస్ట్ అయ్యారు. తిరుపతి సభా ప్రాంగణంలో డిటిఎఫ్ టీచర్లు అరెస్ట్ అయ్యారు. తిరుపతిలో అరసం నిరసన తెలిపింది. తెలుగు భాషా సంఘం మిలిటెంట్‌గా ప్రతిఘటించింది. తెలంగాణ రచయితల సంఘం అయితే మొత్తంగా ఆ సభలను బహిష్కరించడమే కాకుండా, ప్రత్యామ్నాయంగా డిసెంబర్ 20న హైదరాబాద్‌లో తెలంగాణ యుద్ధభేరిని కూడా నిర్వహించింది.

ప్రపంచ తెలుగు మహాసభ రూపంలో దళారీ పాలుకులు చేసిన కుట్ర ఏమిటో ఈ 20వ తేదీ నాటికి, ముఖ్యంగా ఇది రాస్తున్న కాలం నాటికి తెలంగాణ విషయంలో ఇది స్పష్టంగా అర్థమైంది. ఈ సభలు జరుగుతున్నప్పుడే డిసెంబర్ 28న ఢిల్లీలో కేంద్ర హోంమంత్రి అఖిలపక్షం సమావేశం వేశాడు. సరిగ్గా ఒక నెల రోజుల్లో, అంటే జనవరి 28 నాటికీ తెలంగాణ విషయం తేల్చివేస్తామని చెప్పాడు. తెలంగాణకు అనుకూలమైన నిర్ణయం వస్తుందని కొన్ని రాజకీయ పార్టీలు భావించాయి కాని, అది తెలంగాణ డెవలప్‌మెంట్ కౌన్సిల్‌గానూ, హైదరాబాద్‌ను కేంద్ర పాలిత ప్రాంతంగా, రెండు రాష్ట్రాల రాజధానిగానూ ప్రకటించే నిర్ణయం వస్తుందని చాలా మంది భయసందేహాలు వ్యక్తపరిచారు. ఇది అంత తొందరగా తీసుకోగలిగిన నిర్ణయం కాదని, నెల అంటే ముప్పై రోజులే కానక్కర్లేదని గులాంనబీ ఆజాద్ తేల్చేశాడు. కనుక ఈ కుట్ర ప్రపంచ తెలుగు మహాసభల నాటికి, అవి తిరుపతిలో సభ జరుగుతుండగా ఢిల్లీలో అఖిలపక్షం ఏర్పాటు చేసే నాటికే ప్రజాస్వామ్య వాదులందరికీ అర్థమైంది. (ఇది ఒకరకంగా 2004 అక్టోబర్ 14న ప్రభుత్వానికీ, మావోయిస్టు పార్టీకీ చర్చలు జరుగుతుండగా ముఖ్యమంత్రి వెళ్లి పులిచింతల ప్రాజెక్టుకు శంకుస్థాపన చేయడం వంటి కవ్వింపు చర్య.) ఎప్పుడూ కాంగ్రెస్‌కూ, సోనియాకూ అనుకూలంగా మాట్లాడే కెసిఆర్ అఖిలపక్షం నుంచి బయటకు వచ్చి పాలిపోయిన మొఖంతో తెలంగాణకు ఏమీ ఒరగబోవడం లేదని చెప్పడానికి మించిన దాఖలా అక్కర్లేదు.

పాలకవర్గ స్వభావాన్ని అలా ఉంచి, తెలుగు భాషా సంఘం ముందుకు తెచ్చినట్టుగా అసలీ ప్రపంచ తెలుగు మహాసభలు జరిపే అర్హత 1956 ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డప్పటి నుంచి గత అరవై ఐదు సంవత్సరాలలో ఏ ప్రభుత్వమైనా, ఏమేరకైనా సాధించిందా? భాషా రాష్ట్రాలంటే ఆ ప్రాంతీయ భాషలు అధికారానికి రావాలి. అంటే ఆంధ్రప్రదేశ్‌లో తెలుగూ, ఉర్దూ భాషలు అధికారానికి రావాలి. అధికారం అంటే సచివాలయం, అత్యున్నత న్యాయస్థానం, విశ్వవిద్యాలయ వ్యవహారాలు, కార్యకలాపాలు, విద్యా బోధన ఆ భాషల్లో జరగాలి. కాన్వెంట్ స్థాయి నుంచి యూనివర్సిటీ స్థాయి వరకు ఇంగ్లిష్ విద్యా బోధన, సెషన్స్ కోర్టు నుంచే ఇంగ్లిష్‌లో విచారణలూ, తీర్పులూ, సచివాలయ ఉత్తర్వులన్నీ ఇంగ్లిష్‌లో ఇప్పటికీ నడుస్తున్న రాష్ట్రం మనది. చివరికి తెలుగు మహాసభల సమాచారమూ, ఆహ్వానాలూ కూడా ఇంగ్లిష్‌లో వెలువడిన విచిత్రమైన స్థితి మనది. ప్రభుత్వ పాఠశాలలు మూలపడుతూ, ఉర్దూ మాధ్యమంగా ఉన్న వందలాది పాఠశాలలూ మూతపడుతూ, విద్య మొత్తంగా ప్రైవేటీకరణకు గురవుతున్న స్థితి, సచివాలయాన్ని కార్పొరేట్ శక్తులు నడుపుతున్న స్థితి చూస్తున్నప్పుడు ఈ సభలు ఎవరి ప్రయోజనం కొరకు జరుగుతున్నా యన్నది పెద్ద విశ్లేషణ అక్కర్లేకుండానే ఎవరైనా చెప్పగలిగేదే.

ఈ రెండు ప్రపంచ తెలుగు మహాసభల మధ్యకాలంలో తెలుగు సమాజంలో వచ్చిన మరొక మార్పు ఆరంభంలో చెప్పుకున్నట్లుగా స్వతంత్ర భాషా సాహిత్య సంస్థల నుంచి ప్రభుత్వం ఈ సభలు నిర్వహించే మార్పుతో పాటు, కార్పొరేట్ సంస్థలు, ఎన్ఆర్ఐలు భాషా సాంస్కృతులకు పోషకులు అయ్యే స్థితి కూడా ఒక దుర్మార్గమైన మార్పు. ఈ రెండు సభలకు మధ్యకాలంలో రాంకీ, జిఎంఆర్ వంటి సంస్థలు ఇటీవలి కాలంలో తెలుగు సాహిత్య, సాంస్కృతిక పోషకులుగా ముందుకొచ్చాయి. అకాడమీల చుట్టూ తిరిగే కవులూ, కళాకారులూ, బుద్ధిజీవులూ, కార్పొరేట్ సంస్థల చుట్టూ తిరిగే వాళ్లుగా మారిపోయారు. రాజస్వామ్యం నుంచి భాషా, సాంస్కృతిక, సాహిత్య కళాపోషణ ప్రజాస్వామ్యం వైపు కాకుండా కార్పొరేట్‌స్వామ్యం వైపు తరలిపోయింది. ఈ ప్రపంచ తెలుగు మహాసభలు ఈ కుట్రను గ్రహించే క్రమంలో ఒక మేరకు ఒక కుదుపు, ఒక కనువిప్పు అయ్యాయని ఆశిద్దాం. తిరుపతి ప్రపంచ తెలుగు మహాసభల్లో మరి ఈసారి ఎవరు ఎక్కువగా పాల్గొన్నారయ్యా అంటే ఎన్ఆర్ఐలు ఎక్కువ సంఖ్యలో పాల్గొన్నారు. సినిమా ప్రముఖులను చూడడానికి వచ్చిన ప్రజలు వేల సంఖ్యలో పాల్గొన్నారు. బిల్ క్లింటన్ వచ్చిన నాటి నుంచి గత పద్నాలుగు సంవత్సరాలుగా తెలుగు సమాజంలో తానా, ఆటా, అభో విభో వంటి సంస్థల సంరంభం, ప్రత్యేక తెలంగాణ ఉద్యమ కాలం నుంచి ఎన్ఆర్ఐల సందడి ఎక్కువైంది. తెలుగు సమాజం అవసరాలను, భాషా, సాహిత్య, సాంస్కృతిక ప్రమాణాలను నిర్ణయించే పీఠాలు అమెరికాలో ఏర్పడి అంతర్జాలం వల్ల, నిరంతర రాకపోకల వల్ల కూడా తమ ప్రభావాన్ని చూపుతున్నాయి. ప్రపంచ తెలుగు మహాసభలు కూడా తెలుగు సమాజం

# తెలుగు భాషావాదం - కొన్ని సమస్యలు

***ప్రాథమిక విద్యార్థి దశ నుంచే నాణ్యమైన విద్య అందేలా ప్రభుత్వాలపై ఒత్తిడి తేవాలనీ, ఇతర భాషల నుంచి మంచి సాహిత్యాన్ని తెలుగులోకి అనువదించి మాతృభాషాభివృద్ధికి కృషి చేయాలనీ అంటున్నారు ఎన్‌విఎస్ నాగభూషణ్***

ఏమైతేనేం, సర్కారు అనుకున్నట్లుగానే తన పంతం నెరవేర్చుకుంది. తేదీ మార్చకుండా, ఊరు మార్చకుండా, ముఖ్యమంత్రి, ప్రతిపక్ష నాయకుడు ప్రాతినిధ్యం వహిస్తున్న జిల్లాలోనే, కేవలం స్థలం మాత్రం మార్చి జాతర ముగించింది. పక్కన ఎన్నో అలకలూ, అనుమానాలూ, కోపాలూ, తాపాలూ, ఆశ్రితులకు ఉన్నతాసనాలూ, పిలిచినా పెద్ద పీట వెయ్యలేదన్న సణుగుడులూ, సరిపెట్టుకున్న వారికి సంతోషాలూ ఒక పక్క; మరో పక్క బహిష్కరణలూ, నిరసన ప్రదర్శనలూ, సమాంతర సమావేశాలతో తంతు ముగించారు. ముందే ఊహించినట్లుగా పూర్వ సంస్థల పునరుద్ధరణా, ప్రత్యేక మంత్రిత్వ శాఖ, 2013 సంవత్సరాన్ని తెలుగు భాషా వికాస సంవత్సరంగా ప్రకటించి ముఖ్యమంత్రి ఇవి ఉట్టి సమావేశాలు కావు, గట్టి సమావేశాలేనని తెలియజెప్పడానికి ప్రయత్నించారు.

సమావేశాలకు ముందూ, ఆ సమయంలోనూ ఈ సభల విషయంలో ఎన్నో చర్చోపచర్చలూ, వాద ప్రతివాదాలూ జరిగాయి, జరుగుతున్నాయి. ఎన్నో సలహాలూ, సూచనలూ, అంతరార్థ అన్వేషణలూ... కొందరైతే ఇది బడుగు బలహీనులపై సాగుతున్న కుట్ర అన్న ఆరోపణలూ, ఒక మాజీ తెలుగు వీరుడైతే అకస్మాత్తుగా ఒక ప్రాంతం మీద ప్రేమను ప్రకటించి, వాళ్లు లేకుండా సమావేశాలా అని పెద్ద అక్షరాలతో అభ్యంతరం వ్యక్తం చేసినా ముఖ్యమంత్రిగారు మొండిగా అనుకున్న పని కానిచ్చేశారు.

ఏమైనా ఒక భాషకు, ఎక్కువ మంది ప్రజల నిత్య వ్యవహారాల్లో ఉపయోగించే భాషే అయినప్పటికీ, దాన్ని మాతృభాషగా భావించడం లోనే మనకు తెలీకుండానే ఒక సెంటిమెంట్ ఏర్పడిపోతుంది. ఇది 'భావ వినిమయ సాధనమే భాష' అన్న భాషకు గల సామాన్యార్థాన్ని దాటి మరీ, దానికి ఒక ఉన్నత స్థానాన్నిచ్చేట్టు చేస్తుంది. దాంతో 'ఈ భాష అందరికీ లేదా అధిక సంఖ్యాకులకు తెలుసు కాబట్టి, ఈ భాషలోనే అన్ని వ్యవహారాలూ సాగించడం మంచిది' అనే సౌలభ్యం నుండి వేర్వేరు ధోరణులు తలెత్తేట్టు చేస్తుంది. ఉదాహరణకు చూడండి:

ఇది మన భాష, ఇది పరభాష. మనకు ఇతర భాషలు వచ్చినా, మన భాషలోనే మాట్లాడాలి. (ఆ ఇతర భాషలు ఆవలి వారికి వచ్చినా గానీ). ఇతర భాషల్లో మాట్లాడితే, మన మాతృభాషకు ద్రోహం చేసినట్లే. అలాగే మన భాషలో చదివితే బాగా అర్థమవుతుంది, పరాయి భాషలో

---

నుంచి కన్నా, ఇటువంటి బయటి తెలుగు వ్యవస్థల  నుంచి ఎక్కువ అండదండలు పొందాయి. ఆ అర్థంలో మండలి బుద్ధప్రసాద్ ఆశించిన ఆ 'స్థాయి' భావ సమైక్యత (దళారీ భావ సమైక్యత) సాధించినవాళ్లే అయ్యారు. ఈ ప్రపంచ తెలుగు మహాసభ సందర్భంలోనే కాకతీయుల పాలనకు ఎనిమిది వందల సంవత్సరాలు నిండినై అనే కారణంతో వరంగల్‌లో కాకతీయ ఉత్సవాలు ప్రారంభించారు. గతంలో కృష్ణదేవరాయల పాలన ఐదు వందల సంవత్సరాలు పూర్తి చేసుకున్నదని ఆయన రాజధాని కర్ణాటకలోని విజయనగరం గనుక అవి హైదరాబాద్‌లో ప్రారంభించారు. కాకతీయ ఉత్సవాలకు కూడా ప్రపంచ తెలుగు సభల వలె నలభై కోట్ల రూపాయలు కేటాయించాలని, అవి కూడా ఏడాది పాటు ఘనంగా జరపాలని తెలంగాణవాదులు డిమాండ్ చేశారు. కాని, ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి, ముఖ్యంగా సామాజిక తెలంగాణకైనా, ప్రత్యామ్నాయ భావజాలానికైనా ప్రతీకగా తీసుకుంటున్న సమ్మక్క, సారలక్కల పోరాటాన్ని అణచివేసిన వాళ్లు కాకతీయులే. ఆ ఒక్క కారణంతోటైనా కాకతీయ ఉత్సవాల గురించి తెలంగాణవాదులు అటువంటి పోటీతత్వంతో వ్యవహరించవలసింది కాదు. ఆ విషయంలో మావోయిస్టు పార్టీ ఉత్తర తెలంగాణ అధికార ప్రతినిధి జగన్, విరసం, భువనగిరి సాహిత్య మిత్రమండలి మాత్రమే స్పష్టమైన వైఖరి తీసుకొని, కాకతీయ ఉత్సవాలు కూడా బహిష్కరించదగ్గవే అని పిలుపునిచ్చాయి.

ఈ ముప్పై ఏడేళ్ల కాలంలో ఇటునుంచి అటు మెటామార్ఫిసిస్ పొందిన ఒక కవి 1975 ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా రాసిన కవితతోటే ఈ రచనను ముగిస్తాను.

*ఆకలేస్తోందా నీకు?*
*ఆంధ్ర సంస్కృతి మహోజ్వలమైనది*
*తినడానికి తిండిలేదా నీకు?*
*తెలుగుభాష 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్'*
*పోలీసులు నిన్ను చితగ్గొడుతున్నారా?*
*మనకి అంతర్జాతీయ ఖ్యాతి అవసరం –*
*నన్నయ్య గొప్పవాడు*
*నాకు ఆకలేస్తోంది*
*కృష్ణదేవరాయల రోజుల్లో...*
*ఒరేయ్! నాకు ఆకలేస్తోంది*
*ఏ దేశమేగినా ఎందుకాలిడినా...*
*నీయమ్మ! నాకాకలేస్తోందిరా!*

*(రచయిత విప్లవ కవి, విప్లవ రచయితల సంఘం నాయకులు)* వీ

చదివితే బాగా అర్థం కాదు అన్న విషయం వాస్తవమే. కానీ పరాయి భాషలో చదివినా బాగా అర్థం చేసుకోగలిగిన వారు కూడా, అలా చదివితే మాతృభాషకు ద్రోహం చేసినట్టే అనే ధోరణికి ఇది దారి తీస్తుంది. అంతేగాక, అసలు పరాయి భాషలో బోధించకూడదు అనే తత్వానికి కూడా ఇది దారి తియ్యడం చూస్తూనే ఉన్నాం. ఈ బోధనా మాధ్యమం విషయంలో ఎన్నో చర్చోపచర్చలు జరిగాయి. ఇంగ్లిష్ బాగా వస్తుందన్న ఆశతోనే ఆ బోధనా మాధ్యమం వైపు జనం పరుగులు తియ్యడానికి కారణం. ఉన్నత విద్యలో ఎలాగూ తెలుగు మీడియం పుస్తకాలు లేవు, ముఖ్యంగా ఇంజనీరింగ్, శాస్త్ర రంగాలలో. అవన్నీ ఇంగ్లిష్‌లోనే ఉన్నాయి కదా! ఇంటర్మీడియట్ వరకూ తెలుగు మాధ్యమంలో చదివి, ఆపై ఇంగ్లిష్ చెప్పే పాఠాలు అర్థంగాక విద్యార్థులు తెల్లమొహం వెయ్యడం, వారి ఆత్మ విశ్వాసాన్ని దెబ్బతియ్యడం చూస్తూనే ఉన్నాం.

అంతేకాదు, తెలుగు మీడియం విద్యార్థులు ఉద్యోగాలొచ్చాక పరాయి ప్రాంతాలకు, ముఖ్యంగా విదేశాలకు వెళ్లినప్పుడు భాషతోనూ, యాసతోనూ కూడా ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ఇప్పుడు వీరి సంఖ్య తగినంత ఉంది కదా! ఇక ఒక భాషగా ఇంగ్లిష్‌ను నేర్పుతున్నారు సరే. కానీ ఆ భాష ఎంతవరకూ వారికి వంటపడుతోంది. అసలు ఇంగ్లిష్ అనే కాదు, త్రి భాషా సూత్రంలో భాగంగా తెలుగు, ఇంగ్లిష్, హిందీ నేర్పుతున్నారు కదా! వీటిలో మాతృభాష అయిన తెలుగులోనే విద్యార్థులు తప్పుల తడకలతో రాస్తున్నారు. కేవలం విద్యార్థుల్నే అనాల్సిన పనిలేదు. వీటి బోధకుల్లోనే ఆ ప్రావీణ్యం చాలా మందిలో తక్కువ. ఉన్న మేరకైనా నేర్పడానికి ప్రస్తుతం వారికి తగినంత సమయం లేదు. ప్రస్తుత ఐఎఎస్‌ల పాలనలో వారు ప్రవేశపెట్టే రకరకాల స్కీముల నిర్వహణకే వారి తల ప్రాణం తోకకొస్తోంది. ఇక విద్యార్థుల భాషా ప్రావీణ్యాలను సరిగా పరీక్షించి మెరుగుపెట్టే అవకాశం ఏదీ? అయినప్పటికీ విద్యార్థులకి మార్కులు బాగానే వస్తున్నాయి. బాగానే వస్తున్నాయి అనడం కంటే, వచ్చేట్టు చేస్తున్నారు అనడం సబబు. లేకుంటే అయ్యవార్లకు అధికార్ల, ముఖ్యంగా కలెక్టర్ల బెదిరింపులు సిద్ధంగా ఉన్నాయి మరి.

ఈరోజు కొందరు భాషావాదులు అభ్యంతర పెడుతున్న మరో అంశం భాషా సంకరం! ఇది కూడా ఇంగ్లిష్ సంకరం గురించే తప్ప, సంస్కృత, పాకృత ఉర్దూ, పోర్చుగీస్, అలాగే సమీప రాష్ట్రాల భాషల సంకరం గురించి కాదు. అయితే ఈ మిగిలిన పదాల వలెనే, ఇప్పటికీ తెలుగు భాషలో కలిసిపోయిన పలు ఇంగ్లిష్ పదాలున్నాయి. కొందరు పరిశుద్ధ వాదులు ఇలాంటి పదాల పట్ల కూడా అభ్యంతరం చెబుతూ, ఇంగ్లిష్ పదాలకు బదులు అర్థం గాని సంస్కృత పదబంధాల సృష్టి కోసం పాకులాడుతున్నారు. ఒక పత్రికైతే పనిగట్టుకుని భాషా సేవ చేస్తున్నామన్న భావనలో ఇలాంటి కార్యక్రమానికి పూనుకుంది. కొన్ని ఉదాహరణలు చూడండి: 'కార్పొరేషన్'కు 'ప్రాధికార సంస్థ'లనీ; 'పబ్లిక్ సర్వీస్ కమిషన్'కి 'ప్రజా సేవా సంఘం' అనీ; 'ఐఎఎస్' బదులుగా 'భారతీయ పాలన సేవ' అనీ; 'స్టేట్ అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్'కి 'రాష్ట్ర పాలన ధర్మాసనం' అనీ – ఇలా సృష్టించిన పదబంధాలు ప్రజలకు సౌలభ్యం కలిగిస్తాయా లేక అయోమయానికి గురిచేస్తాయా అన్నది ఆలోచించాలి.

ఆంగ్ల పద బాహుళ్యంతో కూడిన తెలుగు వాక్యాల్ని ఉపయోగించడం సరికాదనడంలో ఎలాంటి సందేహమూ లేదు. కానీ అదే సందర్భంలో అసలు ఆంగ్ల పదాలే ఉపయోగించకుండా ఉండాలనే ఉద్దేశంతో ప్రజలకు చిరపరిచితమైన ఆంగ్ల పదాలకు బదులు ఒక మోజుగా మారుతున్న సంస్కృతీకరణ యత్నాల్ని కూడా తిరస్కరించాలి. నేడు చాలా మంది తెలుగు భాషోద్యమకారులు తమది మాతృభాషాభిమానమే తప్ప, పరభాషా వ్యతిరేకత కాదంటున్నారు గానీ, వీరి ఇలాంటి చర్యలు ఆంగ్లం పట్ల గుడ్డి వ్యతిరేకతకే దారితీస్తాయని గ్రహించాలి.

ఇక తెలుగు భాషను ఎలా అభివృద్ధి చెయ్యడం అన్న ఆలోచన వచ్చినప్పుడు, ఆంగ్ల భాష అభివృద్ధి క్రమాన్ని గమనిస్తే మార్గం తెలుస్తుంది. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల వల్ల ప్రపంచంలోని మారుమూల ప్రాంతాలు కూడా నష్టపోయాయి. అయితే అందువల్ల, ప్రపంచంలోని నాగరిక భాషలన్నింటికీ ఒక గొప్ప మేలు కూడా జరిగింది. అదేమిటంటే ఆంగ్ల భాష ప్రపంచంలోని సకల భాషలలో గల సాహిత్యానికే ఒక వారధిగా ఉపయోగపడడం! ఆయా భాషలలో గల ఉత్తమ సాహిత్యం ఆంగ్లంలోకి తర్జుమా కావడం, అలాగే ఆంగ్లంలోకి వచ్చిన ఆయా ఉత్తమ సాహిత్య గ్రంథాలు ఇతర భాషల్లోకి తర్జుమా కావడం వల్ల, ఆంగ్లం తెలిసినంత మాత్రాన ప్రపంచ సాహిత్యాన్ని అధ్యయనం చేసే సౌలభ్యం ఏర్పడి, అదొక అంతర్జాతీయ భాషగా ఎదిగింది. అలాగే ఆంగ్లం తెలిసిన వారు ఆయా భాషల్లోని ఉత్తమ సాహిత్యాన్ని తెలుగులోకి అనువదిస్తూ, ఆయా దేశాల ప్రజల సంస్కృతి, చరిత్ర వంటి అంశాల్ని అవగాహన చేసుకోవడానికి ఉపకరిస్తున్నారు. ఇలా అంతర్జాతీయ భాషగా ఎదిగిన ఆంగ్లం ఆయా భాషల్నించి వందలాది పదజాలాన్ని గ్రహించి, గ్రహిస్తూ తన పద సంపదను పెంచుకుంటోంది. అలాగే ఆయా భాషల్లోకే పదాల్ని అందిస్తోంది. తెలుగు భాషలో కూడా ఈ ప్రక్రియ అధిక మొత్తంలో జరుగుతూంటే అది ప్రజల సంస్కృతీ వికాసానికీ, భాషకూ కూడ ఎంతో ఉపయోగకరం.

పదజాలం పెంపు గురించి ఆలోచిస్తున్నప్పుడు మరో అంశాన్ని కూడా పరిగణనలోకి తీసుకోవాలి. అదేమిటంటే మాండలికాలలో గల పదాల్ని స్వీకరించడం. వివిధ తెలుగు మాండలీకాల్లో ఎంతో పదజాలం ఉపయోగింప బడుతోంది. ఆ మాండలీక పదజాలాన్ని ప్రధాన స్రవంతి తెలుగులోకి విరివిగా స్వీకరించాలి. ఆ పదజాలంతో కలిపి కొత్త పదబంధాల సృష్టి జరిగితే ఉపయోగం. అంతే తప్ప, అతివేలమైన సంస్కృతీకరణ ద్వారా ఆ పని చేస్తే ఉపయోగం లేదు. ఈ విషయంలో పత్రికలు నిర్వహించాల్సిన పాత్ర ఎంతైనా ఉంది. ఈ కార్యక్రమం ఏక పక్షంగా సాగకపోవడం మంచిది. మాండలీకాల్లో సాహిత్య రచన తరచూ జరగాలి. అయితే అలాంటి రచనల్లో ఆయా ప్రత్యేక మాండలీక పదాలకు ఎక్కడికక్కడ అర్థ, వివరణ ఇవ్వాలి. లేకపోతే అర్థం గాక పాఠకులు విముఖులయ్యే ప్రమాదం ఉంది.

మరొక విషయం కూడా ఇక్కడ ప్రస్తావించడం అవసరం. మారుతున్న పరిస్థితుల్లో ఉద్యోగాల కోసమే గాక, ఉన్నత విద్య కోసం కూడా మనవారు మనదేశంలోని వివిధ రాష్ట్రాలకే గాక, ఇతర దేశాలకూ వెడుతున్న సంగతి తెలిసిందే. అయితే అలా వెళ్లి వారు పలు కష్ట నష్టాల్ని ఎదుర్కోవలసి వస్తోంది. వాటిలో ప్రధానమైనది భాష. కనుక మన విద్యా విధానంలో కేవలం త్రిభాషా సూత్రంతోటే సరిపెట్టుకోవడం గాక,

పాఠశాలా విద్య అనంతరం, ఇంటర్మీడియట్, ఆ పైన ఒకే దాక్షిణాత్య భాషను, మరొక ఆసియా లేక ఐరోపా భాషను ఐచ్ఛికంగా ఎంచుకునే అవకాశం కల్పిస్తే ఎంతైనా ఉపయోగకరంగా ఉంటుంది. ఇప్పుడు బహు కొద్ది చోట్ల ఫ్రెంచ్‌ని ఎంచుకునే అవకాశం ఉంది. ఇది మరిన్ని భాషలకు, మరిన్ని చోట్ల విస్తృతంగా అందుబాటులోకి తీసుకురావాలి. ఇది విద్యార్థుల ఉద్యోగావకాశాల్ని కూడా విస్తృత పరస్తుంది. అంతేగాక బహు భాషావేత్తలు మనకు లభ్యం అవుతారు. ఇది సాంస్కృతిక రంగంలో కూడా ఎంతో ఉపకరిస్తుంది.

మన తెలుగు వారి స్వభావాన్ని గమనిస్తే, పూర్వం నుంచీ మనవారు భాషా దురహంకారానికి దూరంగానే ఉన్నారని గమనించవచ్చు. ఒక్కసారి చరిత్రలోకి తొంగి చూస్తే, 'తెలుగదేలయన్న దేశంబు తెలుగేను' అన్న పద్యాన్ని తిరగేసి అర్థం చేసుకుంటే, తెలుగువారు ఎంతైనా ఉదారులని చెప్పాలి. అందుకే మన ప్రాంతానికి గల భౌగోళిక స్థితి కూడా ఉపకరించిందనవచ్చు. అటు ఉత్తర భారతానికీ, ఇటు దక్షిణ భారతానికీ మధ్య వారధిలా మన ప్రాంతం ఉంది. అందుచేతనే పూర్వ రాజ భాషలైన సంస్కృత ప్రాకృతాల నుండే గాక, మధ్య యుగాల నాటి రాజ భాష ఉర్దూ నుండి కూడా, అటు తర్వాత పోర్చుగీసు, చివరగా ఆంగ్లం నుండి వందలాది పదజాలాన్ని వద్దనకుండా స్వీకరించింది. ఎందరో ఆయా భాషలు రాజ్యమేలిన కాలంలో ఆయా భాషల్లో పాండిత్యం సంపాదించి రాజాదరణ పొందారు. అయితే అదే సమయంలో తెలుగు పట్ల నిర్లక్ష్యం, చిన్నచూపు చూసే వారంటున్నరు గానీ, ఇందులో పూర్తి సత్యం ఉందని అనుకోను. ఇక్కడ రాజాదరణ లేకపోబట్టి పంపాది తెలుగు కవులు ఆంధ్ర ప్రాంతం వదిలి, కన్నడ దేశం వెళ్లి గౌరవాలు పొందారు. ఆనాటి సాహిత్యానికి ఏవో మత, చారిత్రక కారణాల వల్ల నష్టం జరిగింది. ఏమైనా మనకు మాతృభాష దురహంకారం లేనందుకు సంతోషించాలి. అక్కడ బలవంతంగా మైనారిటీల గొంతు నొక్కేసి మరీ తమిళాన్ని రుద్దుతున్నారు. తమిళ చైతన్యం జాతి దురహంకారానికి, భాషా దురహంకారానికి దారితీసింది. వారికి తెలుగు వచ్చి కూడా తెలుగు వారు అక్కడికెడితే తమిళంలోనే మాట్లాడతారు.

కనుక మనకు కావాల్సింది భాషా దురభిమానం కాదు, సెంటిమెంటూ కాదు. సామాన్య ప్రజలు, చదువు రాని ప్రజలకూ అర్థమయ్యే తెలుగులో పాలనా వ్యవహారాలన్నీ సాగేలా చర్యలు తీసుకోవాలి. తెలుగు ప్రజల అభివృద్ధి కోసం, తెలుగు విద్యార్థుల అభివృద్ధి కోసం చర్యలు తీసుకోవాలి. ఇందుకు ప్రపంచ తెలుగు మహాసభలు జరపడం మాత్రమే సూచిక కాదు. తెలుగు భాష అభివృద్ధి కోసం వాస్తవికమైన చర్యలు తీసుకోవాలి. మొదట తప్పులు లేని తెలుగు రాయడం విద్యార్థులకు నేర్పండి. అలాగే ఇతర భాషల్ని కూడా చిత్తశుద్ధిగా నేర్పండి. భాషా సాహిత్యాలే వ్యక్తిత్వ వికాసానికి పునాది. విద్యార్థి దశలోనే వ్యక్తిత్వ వికాసానికి చర్యలు తీసుకోవాలి. అందుకు పాఠశాల విద్యలో భాషలకు ప్రాధాన్యతనివ్వాలి. భాషల్ని నేర్పే క్రమంలో, ముఖ్యంగా తెలుగును నేర్పే క్రమంలో ప్రాచీన సాహిత్య పాఠాల్లో కుల, మత, పురుష దురహంకారాలకు, అలాగే సెక్స్‌ని, మూఢ నమ్మకాలకు ఆస్కారం ఇచ్చే భాగాల్ని తొలగించాలి. మన పాఠ్య భాగ నిర్ణేతలు కాకారాయుళ్లవడం వల్ల ఎలాంటి విచక్షణా పాటించకుండా గుడ్డిగా పాఠ్యాంశాల్ని నిర్ణయిస్తున్నారు. పలు సందర్భాల్లో పాఠాలు చెప్పడంలో ఉపాధ్యాయులు సిగ్గుపడాల్సి వస్తోంది. అయినా మన విధానాలు మారవు. ఇలాంటి విషయాల్ని తల్లిదండ్రులే నిలదీయాల్సి ఉంది. అప్పుడే ఈ పాఠ్య భాగ నిర్ణేతలకు, ప్రభుత్వాలకు బుద్ధి వస్తుంది. ఢిల్లీలో జరిగిన 'నిర్భయ' ఉదంతం అటు ప్రభుత్వాలకే కాకుండా, తల్లిదండ్రులకు కూడా కనువిప్పు కావాలి.

భాషకు పరిపూర్ణతనిచ్చేది సాహిత్యమే. అంతేకాదు, అది సాంఘిక పరిణామానికీ దోహదం చేస్తుంది. ఒకప్పుడు పిచ్చి సాహిత్యానిక్కూడా విపరీత ఆదరణ లభించింది. ఇప్పుడు మంచి సాహిత్యానిక్కూడా ఆదరణ లేదు. పిచ్చి సాహిత్యం బదులు పిచ్చి సినిమాలను ప్రజలూ, ప్రభుత్వాలూ ఆదరిస్తున్నారు. ప్రతి రంగంలోనూ సినిమా నటులకే పెద్ద పీట! తెలుగు భాషోత్సవాల్లో కూడా జరిగిందిదే. ఆ ఉత్సవాలకు పెట్టిన ఖర్చులో పదోవంతు సాహిత్యం, ఇతర కళలకూ ఖర్చు పెడితే ఎంతో ఉపయోగం ఉండేది. ఇతర కళా రంగాలకు కూడా ప్రభుత్వం అంతో ఇంతో ఖర్చు పెడుతోంది. కొంతమందికి పింఛన్లిస్తోంది. రచయితలకూ, కవులకూ ఒక్క పైసా విదిలిస్తోందా?

ప్రచురణ రంగానికి వస్తే అది సొంతం పడకేసింది. రచయితలూ, కవులే తమ పుస్తకాలు ముద్రించుకోవలసి వస్తోంది. కొద్దిమందికి తెలుగు విశ్వవిద్యాలయం ముద్రణ సహాయం చేస్తోంది గానీ, అది ప్రచురణ వ్యయంలో 20 శాతం కూడా ఉండదు. ఇక పుస్తకాలు కొనే దిక్కేలేదు. ముద్రించుకొని ఉచితంగా ఇచ్చుకోవాలి. ప్రభుత్వం ఏదో ఉద్ధరిస్తా మంటోంది గనుక, ఎలా ఉద్ధరిస్తుందో చూడాలి. ఆ ఉద్ధరింపులో అనువాదాలకు పెద్ద పీట వెయ్యాలి. అనువాద సాహిత్యం ద్వారానే మన సాహిత్య స్థానం ఏమిటో తెలుస్తుంది. మనం ఎంత వెనకబడ్డామో, ఇంకెన్ని శిఖరాలు అధిరోహించాలో గమనానికి వస్తుంది. అంతేకాదు, లైబ్రరీలను, కంప్యూటర్ సెంటర్లుగా మార్చే పనికి స్వస్తి చెప్పి, పుస్తక కేంద్రాలుగా, సాహిత్య కేంద్రాలుగా తీర్చి దిద్దాలి. ఇదంతా ప్రభుత్వం చేస్తుందా? భాషావాదులు వాస్తవ కార్యాచరణకు పూనుకుంటారా? వేచి చూడాలి.

చివరిగా ఒకమాట. 'మమ్మీ' అన్నా, 'అమ్మా' అన్నా అమ్మే. 'డాడీ' అన్నా, 'నాన్నా' అన్నా నాన్నే. 'మమ్మీ, డాడీ'లని పిలిపించుకుంటూ, ఆ పిలుపుల్లోనే ఆనందం అనుభవించే తల్లిదండ్రుల మానసిక స్థితిని హేళన చెయ్యడం గాక, వారి ఆకాంక్షలేమిటో గ్రహించి గౌరవించాలి! వారికి ఆశలుపెట్టి, దబ్బుదండుకుని, అటు 'అమ్మ'కీ, ఇటు 'మమ్మీ'కీ రెంటికీ కాకుండా చెడిపోయేలా వారి పిల్లల భవిష్యత్తును నాశనం చేసే నకిలీ విద్యా సంస్థల దగాకోరుతనాన్ని బట్టబయలు చెయ్యండి. నాణ్యమైన విద్యను అందించేలా ప్రభుత్వాలపై ఒత్తిడి పెంచండి, రిజల్ట్సే ధ్యేయమైన విద్య వద్దని ప్రభుత్వాలకి, ప్రభుత్వాధికారులకి, ముఖ్యంగా కలెక్టర్లకి చెప్పండి. అలాగే పల్లెల్లోని ప్రభుత్వ పాఠశాలల్లో ప్రతి తరగతికీ ఒక ఉపాధ్యాయుణ్ని నియమించమని చెప్పండి. పనికిమాలిన స్కీముల్ని ఎత్తేయమని చెప్పండి. ఇది ప్రజలందరి, ముఖ్యంగా భాషా విద్యార్థుల కర్తవ్యం. కాదంటారా?

*(రచయిత రిటైర్డ్ లెక్చరర్)* వీ

# మోడీత్వం - లౌకిక ప్రజాతంత్రవాదులకు సవాలు

***గుజరాత్‌లో నరేంద్ర మోడీ తిరిగి అధికారంలోకి రావడంలో కార్పొరేట్ శక్తులూ, మీడియా సంస్థలూ మతతత్వ ముద్రను అప్రధానం చేసి, అభివృద్ధి మంత్రం జపిస్తూ తమ వంతు పాత్ర నిర్వహించాయని అంటున్నారు*** **ఎ. నర్సింహారెడ్డి**

ఇటీవల జరిగిన గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల్లో నరేంద్ర మోడీ మూడో సారీ గెలిచాడు. నాలుగవసారి ముఖ్యమంత్రి పదవిని అధిష్ఠించాడు. ఆయన ఒక కరడుగట్టిన హిందూత్వవాది, వివాదాస్పదుడు. అయితే విమర్శలు, పొగడ్తలు లక్ష్యపెట్టని మనస్తత్వం అతనిది. 2002 నాటి మారణకాండకు బాధ్యుడిగా ఆరోపణలు ఎదుర్కొంటున్నప్పటికీ ఒక్కసారి కూడా పశ్చాత్తాపం చెందలేదు. గుజరాత్‌లో భాజపా వరుసగా ఐదోసారి విజయం సాధించింది. మోడీ నేతృత్వంలో మూడోసారి గెలుపు బాటన నడిచింది. దాదాపుగా మూడింట రెండొంతుల మెజారిటీ సాధించింది. మొత్తం 182 స్థానాల్లో 115 సీట్లు గెలుచుకుని అధికారాన్ని నిలబెట్టుకుంది. అయితే మోడీ ప్రభుత్వంలో పనిచేసిన ఏడుగురు మంత్రులు తాజా ఎన్నికల్లో పరాజయం పాలయ్యారు. ఇక ప్రత్యర్థి కాంగ్రెస్ 61 సీట్లు గెలుచుకుని 22 ఏళ్లుగా తనకు అలవాటైన ప్రతిపక్ష హోదాతో సరిపెట్టుకుంది. కాకపోతే 2007 కంటే 2 సీట్లు ఎక్కువగా సాధించగలిగింది. మోడీపై తిరుగుబాటు చేసి గుజరాత్ పరివర్తన్ పార్టీ పెట్టి ఎన్నికల్లో పోటీచేసిన మాజీ ముఖ్యమంత్రి కేశూభాయ్ పటేల్ కేవలం రెండు సీట్లు మాత్రమే గెలుచుకున్నారు.

సంఘ పరివార్ ప్రత్యక్ష ప్రతినిధిగా ప్రభుత్వ పగ్గాలు చేపట్టిన తొలి నేత మోడీ. ఆ సిద్ధాంతాలను ఆచరణలో అమలు చేసి అల్లకల్లోలానికి కారకులైనారు. ఇప్పుడేమో ఆ విషయాలన్నీ మర్చిపోయి అభివృద్ధినే చూడమని ఆయన చెప్పడం, దానికి కొందరు మేధావులు, పారిశ్రామిక వేత్తలనబడేవారంతా వంతపాడటం మహా విచిత్ర దృశ్యంగా గోచరిస్తుంది. నాలుగు వందల ఏళ్ల కిందట బాబర్ హయాంలో జరిగిన అన్యాయాన్ని సరిదిద్దాలని చెప్పేవారు గుజరాత్‌కు వచ్చేసరికి మాత్రం పదేళ్ల కిందటి మారణకాండను మర్చిపొమ్మన్నారు. ప్రపంచీకరణకు మతం, మార్కెట్ తత్వాలు రెండు ముఖాలనుకుంటే అవి అక్షరాలా మూర్తీభవించిన కాషాయ కరోడా మోడీ. ఇక హిట్లర్ ప్రపంచాన్ని జయించాలని అనాడు బయలుదేరినట్లే, మోడీ ఈనాడు ఢిల్లీ పీఠం ఆక్రమించాలనుకుంటున్నాడు. అయితే హిట్లర్ లాగానే ప్రజల చేత మట్టికరువక తప్పదు. ఇది చారిత్రక వాస్తవం.

గుజరాత్ ఎన్నికలను మినీ సార్వత్రిక ఎన్నికలుగా రాజకీయ విశ్లేషకులు అభివర్ణించారు. గోద్రా చీకటి రోజులను తెరవెనక్కి పంపేసి... అభివృద్ధి భ్రమలను చూపించి ఇంకోసారి మోడీ గెలిచారు. ఈ ఎన్నికలు మతతత్వ ముద్రను అప్రధానం చేసి అభివృద్ధి మంత్రం జపించడంలో కార్పొరేట్ శక్తులు, మీడియా ముందున్నాయి. పట్టణ మధ్యతరగతిని భ్రమల్లో ముంచెత్తాయి. వీళ్ల మైండ్ సెట్ కూడా ప్రపంచీకరణ విధానాలకు, వినిమయ సంస్కృతికి సానుకూలంగా ఉంది. గుజరాత్‌లో పట్టణ జనాభా 43 శాతం. 2001 నుంచి మోడీ అందిస్తున్న రాజకీయ సుస్థిరత ఈ వర్గాలను ఆకట్టుకుంది. 'వికాస్ పురుష్'గా మోడీ విధానాలతో సంతుష్టులైన పట్టణ మధ్యతరగతి ప్రజలు మోడీ చూపిన భ్రమలకే మొగ్గారు. గుజరాత్ ఓటర్లలో మూడోవంతు మంది 18 నుంచి 29 సంవత్సరాల మధ్య వయస్సుగల యువతే. వీరిని ఆకట్టుకునేందుకు మోడీ 'యువ వికాస్' యాత్ర పేరిట నెల రోజుల భారీ ప్రచారోద్యమాన్ని చేపట్టారు. ఇది మొత్తం 182 అసెంబ్లీ స్థానాలకు గాను 117 అసెంబ్లీ స్థానాలగుండా సాగింది. గిరిజన ఓటర్లను ఆకట్టుకోవడానికి గిరిజన ప్రాంతాలైన దాంగ్, నర్మద, దహోద్, వల్సాద్ వంటి ప్రాంతాల్లోని యువతకు 2007-12 కాలంలో రు. 18 వేల కోట్లతో 'వనబంధు యోజన' పథకం చేపట్టాడు. ఇవన్నీ మోడీ గెలుపుకు దోహదపడ్డాయి. 2011లో సెప్టెంబర్ 17-19 తేదీలలో చేపట్టిన 'వైబ్రంట్ గుజరాత్' సదస్సు నుంచి ఎన్నికల నాటికి విదేశీ, దేశీయ పెట్టుబడులన్నీ కలిసి రు.10,04,006 కోట్లు దాటి పోయాయి. రాష్ట్రంలో వ్యాపార, వాణిజ్యాలను సరికొత్త, ఉత్థానానికి తీసుకెళ్లాయి. రాష్ట్రంలో సారథి మారిపోతే తమ వ్యాపారాలకు నష్టం వాటిల్లుతుందేమోననే భయం వారిలో తలెత్తింది.

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అభివృద్ధి నమూన విధ్వంసకరమైంది. అది సహజవనరులను కబలిస్తూ అశేషప్రజానీకపు జీవనాధారాలను కొల్లగొట్టి ప్రజలను నిర్వాసితులను చేస్తుంది. గుజరాత్‌లో కూడా గ్రామీణ ప్రాంత ప్రజల జీవన విధానం చాల దుర్భరంగా పరిణమించింది. గుజరాత్ సామాజికంగా పలు అంశాల్లో వెనుకబడి ఉంది. గ్రామీణ రంగం దెబ్బతినడం, మహిళలు, బాలికల్లో పౌష్టికాహార లోపం, స్త్రీ, పురుష లింగ నిష్పత్తిలో తీవ్ర వ్యత్యాసం, నానాటికీ పెరిగిపోతున్న పేదరికం, భూములు కోల్పోయిన రైతులు, గ్రామీణ నిరుద్యోగం వంటి సమస్యలు అక్కడ ఉన్నాయి. ప్రభుత్వ కాంట్రాక్టులు పొందిన వారు కప్పం కట్టవలసిందే. రాజకీయ నాయకుల, అధికారుల అక్రమాలు అక్కడ కూడ ఉన్నాయి. పారిశ్రామికంగా ముందున్న గుజరాత్ విద్య, వైద్య, ఆరోగ్యరంగాలలో వెనుకబడి ఉంది. ఆ రాష్ట్రంలో కూడా పేదరికం వెక్కిరిస్తుంది. సంపద, పేదరికం ఏకకాలంలో వృద్ధి చెందుతున్నాయి.

ప్రజల మనోభావాలను రెచ్చగొట్టడంలో మోడీ ఆరితేరిన దిట్ట. గుజరాత్ అస్తిత్వ నినాదం గుజరాతీ జాతిలోనూ శక్తివంతమైన అస్త్రంగా పనిచేసింది. 'గరవో గుజరాతీ' నినాదంతో దేశంలో మిగతా ప్రాంతాల వారికంటే గుజరాతీయులు గొప్పవారన్న అభిప్రాయాన్ని అక్కడి ప్రజల్లో

కలిగించడంలో మోడీ కృతకృత్యులయ్యారు. జాతీయ భావం తరహాలో ప్రాంతీయ భావాన్ని అక్కడ మోడీ వ్యాపింపజేశారు. అన్ని రాష్ట్రాల మాదిరిగానే గుజరాత్‌లోనూ అవినీతి ఉంది. బంధుప్రీతి ఉంది. గుజరాత్‌లో లోకాయుక్తను 2003 నుంచి నియమించలేదు. ఎన్నికల ప్రచారంలో కోట్లాది రూపాయలు నీళ్లలా ప్రవహించాయి. కేంద్ర పథకాల నిధులను దారి మళ్లించాడు. దళితులు, గిరిజనులు, ముస్లింలు మోడీని వ్యతిరేకిస్తున్నారు. మోడీకి దేశంలో ఫాసిస్టు ముద్ర ఉన్నా ఆయనే గెలిచారు. గత రెండు దశాబ్దాలుగా గుజరాత్‌లో బిజెపికి పట్టణ ప్రాంతంలో వాణిజ్య, వ్యాపార వర్గాలు, గ్రామీణ ప్రాంతంలో సంపన్న రైతులు సాంఘిక పునాదిగా ఉన్నారు. కమ్యూనిటి పరంగా చూస్తే గుజరాత్‌లో 20 శాతం పటేళ్లు, 11 శాతం క్షత్రియులు, 6 శాతం వైశ్యులు ట్రేడింగ్ కమ్యూనిటిగా మోడీకి సాంఘిక పునాదిగా ఉన్నారు. గ్రామీణ ప్రాంత ధనిక రైతులు మోడీ వెంట ఉన్నారు. మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో పాలకుల అభివృద్ధి, భావజాలమే పాలితుల అభివృద్ధి, భావజాలంగా ప్రబలంగా ఉంటుందని మరోసారి గుజరాత్ ఎన్నికల్లో రుజువైంది. ఈసారి ఎన్నికల్లో మతపరమైన భావోద్వేగాలు లేవు. గోధ్రా అల్లర్ల ప్రస్తావన రాలేదు. జనాకర్షణ పథకాల హామీలు లేవు. అంతా అభివృద్ధి మంత్రమే.

గుజరాత్‌లో ఎవరు పరిశ్రమను ప్రారంభించాలన్నా అత్యంత వేగంగా అనుమతులు మంజూరవుతాయి. టాటాలు, బిర్లాలు, అంబానీలు ప్రస్తుతం గుజరాత్‌పై చూపించినంత శ్రద్ధ ఇతర రాష్ట్రాలపై చూపించడం లేదంటే అతిశయోక్తి కాదు. పెట్టుబడులు పెట్టడానికి వచ్చే వారు ఒక్క ఫోన్ చేస్తే చాలు, రాష్ట్ర యంత్రాంగమంతా కదులుతుందని ముఖేష్ అంబానీ వంటి వారు బహిరంగంగానే కితాబు ఇచ్చారు. "ధీరూబాయి అంబానీ పుట్టిన నేలలో మోడీ వారి కలలను నిజం చేస్తూ గుజరాత్‌ను అంతర్జాతీయంగా ఆదర్శంగా నిలుపుతున్నారు. ఆయన నేతలకే నేత, రాజులకు రారాజు. దేశంలో గుజరాత్‌ను 'గ్లోబల్ గేట్ వే'గా తీర్చి దిద్దుతున్నారు" అని ముఖేష్ అంబానీ మోడీని పొగడడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి. మరో విశేషం ఏమిటంటే, గుజరాత్‌లో మంత్రులకు ప్రత్యేకంగా విచక్షణాధికారాలంటూ ఏమీ లేవు. అధికారుల్నే బాధ్యుల్ని చేయడం జరుగుతుంది తప్ప మంత్రులను బాధ్యుల్ని చేయడం జరగదు. అందువల్ల ఫైళ్లు వేగంగా కదులుతాయి. భూముల క్రయ విక్రయాల్లో, భూముల అభివృద్ధిలో మంత్రులే కాదు, అధికారులు సైతం జోక్యం చేసుకోవడానికి వీల్లేదని మోడీ మొదట్లోనే ఆదేశాలు జారీ చేశారు. అంతా ఆయన కనుసన్నలలోనే జరుగుతాయి.

గుజరాత్‌లో ముస్లింలు కూడా మోడీ నాయకత్వాన్ని ఆమోదిస్తు న్నారనీ, ముస్లింలు అధికంగా ఉన్న నియోజకవర్గాలలో కూడా బి.జె.పి. గెలుపొందిందని వార్తలు వచ్చాయి. ఇది నిజమే కావచ్చు. అయితే ఏ పరిస్థితులలో అలా జరిగిందన్నది ముఖ్యం. గుజరాత్‌లో మోడీని ఎదుర్కొగల ప్రత్యామ్నాయ నాయకుడు లేనందున ఆయనతో విభేదిస్తే తమకు రక్షణ ఉండదన్న ఉద్దేశంతో విధిలేని పరిస్థితులలో ముస్లింలు ఆయన నాయకత్వాన్ని సమర్థిస్తూ ఉండవచ్చు. ఈ ఎన్నికలలో బి.జె.పి. తరఫున ఒక్క సీటు కూడా ముస్లింలకు కేటాయించకపోవడాన్ని బట్టి మోడీ మనస్తత్వాన్ని అర్థం చేసుకోవచ్చు. ముస్లిం ఓటర్లు ఎక్కువగా ఉన్న 12 నియోజక వర్గాలలో 8 స్థానాలు మోడీకే దక్కాయి. ఈ దేశంలో ముస్లింలు తాము మైనారిటీలమన్న వాస్తవాన్ని గుర్తించి అణిగిమణిగి ఉంటే, వారి రక్షణకు ఢోకా ఉండదన్నది మోడీలాంటి వారి అభిప్రాయం. గుజరాత్ వరకు ఈ ఫార్ములా అమలు జరుగుతూ ఉండవచ్చు. దేశంలోని ఇతర ప్రాంతాల విషయానికొస్తే అక్కడ ముస్లింలు మోడీని తమ ప్రధాన శత్రువుగా చూస్తున్నారు. వాస్తవానికి మాజీ ప్రధాని అటల్ బిహారీ వాజ్‌పేయి తర్వాత వివిధ వర్గాల ప్రజల ఆమోదం పొందిన నాయకత్వం బి.జె.పి.లో ఇంతవరకు రాలేదనే చెప్పవచ్చు. ఈ నేపథ్యంలో మోడీ వంటి వారిని ప్రధాని అభ్యర్థిగా ప్రకటిస్తే ముస్లింలే కాకుండా క్రిస్టియన్లు కూడా గంపగుత్తగా కాంగ్రెస్ పార్టీకి అండగా నిలిచే అవకాశం ఉంటుందని రాజకీయ విశ్లేషకులు భావిస్తున్నారు. స్వతహాగా నిరంకుశ పోకడలు కలిగి ఉన్న మోడీ చేతికి అధికారం వస్తే గుజరాత్ ఫార్ములానే దేశమంతటా విస్తరింపజేస్తారని ముస్లిం మైనారిటీలు భయాందోళనలు చెందడం సహజం. తాము ద్వితీయ శ్రేణి పౌరులుగా ఈ దేశంలో జీవించడానికి ఏ ముస్లిం కూడా అంగీకరించడు. ప్రపంచ వ్యాప్తంగా పలు ముస్లిం దేశాలు సామ్రాజ్యవాదుల కబంధ హస్తాల్లో బందీ అవు తున్న తీరును ఇక్కడి ముస్లింలు ఇప్పుడిప్పుడే అర్థం చేసుకుంటున్నారు.

2002 గోధ్రా అల్లర్ల తరువాత గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్ర మోడీ ఎంతో దూరం ప్రయాణం చేశారు. ఈ రోజున ఆయనను బిజెపి ప్రధానమంత్రి అభ్యర్థిగా కొందరు ప్రస్తావిస్తున్నారు. లౌకిక వాదుల నుండి ఇప్పటికీ ఆయన నిందలను ఎదుర్కొంటున్నా, ఆయన మద్దతు దారులు, సంఘ్‌పరివార్ ఆయనను తమ ప్రచారాస్త్రంగా వాడుకొంటు న్నారు. హిందూత్వంకు ప్రతిరూపంగా ఆయన్ను చూపిస్తున్నారు. మోడీ తన ఓటర్లనేగాక యావద్దేశాన్ని రెండుగా చీల్చివేశారు. ఆయన్ని మెచ్చుకొనేవారు, ప్రేమించేవారు అలాగే ఆయనను అభిమానించనివారు, వ్యవహారణతీరు, అహంకార పోకడలు నచ్చనివారుగా చీలిపోయి ఉన్నారు. ఆసక్తికరమైన విషయమేమిటంటే, ఆయన్ని మెచ్చుకునే వారిలో కొంతమంది బడా పారిశ్రామికవేత్తలు కూడా ఉన్నారు. వారికాయన అనుకూలంగా సహాయపడ్డారు. వారు ఆయన కోసం బహిరంగంగానే లాబీయింగ్ చేస్తుంటారు. అంతర్జాతీయంగా కూడా అతనికి వీసా ఇచ్చేందుకు అమెరికా తిరస్కరించడం నుండి ప్రతిష్టాత్మక టైమ్ మేగజైన్ అట్టమీద ఆయన చిత్రాన్ని ప్రముఖంగా ముద్రించి కథనాన్ని ప్రచురించేంత వరకు, ఇప్పుడు బ్రిటన్ తమ వ్యాపారం కోసం ఆయన్ను ప్రసన్నం చేసుకొనేంతవరకు ఎంతోదూరం ప్రయాణం చేశారు. ఆయన్ను సుపరిపాలనకు, అభివృద్ధికి మారురూపంగా చిత్రిస్తున్నారు. ఈ రెండు ఆకర్షణీయమైన పదాలను ఆయన్ను వర్ణించేందుకు ఈ రోజున వాడుతున్నారు. చైనాను సైతం మోడీ మచ్చిక చేసుకోగలిగారు. ఇదంతా ద్రవ్య పెట్టుబడి మాయాజాలం, మోడీ తాబేదారితనం.

గుజరాత్ మారణకాండకు బాధ్యుడైన మోడీ పదేళ్లకైనా కనీసం పశ్చాత్తాపం వ్యక్తం చేయలేదు. గుజరాత్ వెలిగిపోతుందని ఎంత అరిచి గీపెట్టిన ఆయన ఒడిగట్టిన మారణకాండకి నివృత్తి ఉంటుందనుకోవడం కల్ల. తనకు అన్ని మతాలు ఒక్కటేనని ఎన్నిలేఖలు రాసినా, ఎన్ని సద్భావనా దీక్షలు చేసినా 2002 నాటి గుజరాత్ అల్లర్లు ఇప్పటికీ మానని గాయాలే. ముస్లింల మనసుకు కలిగిన గాయాలు మాసిపోయేవి

కావు. గుజరాత్‌లో ముస్లింలు నివసించే ప్రాంతాలలో మంచినీటి సరఫరా లేదు. ప్రభుత్వ ఉద్యోగాలల్లో ముస్లింల సంఖ్య నామమాత్రమే. ప్రభుత్వ బ్యాంకులు ముస్లింలకిచ్చే రుణాలు అత్యల్పమే. మోడీకి ముస్లింలు ప్రేమతో ఓటు వేయలేదు. భయంతో ఓటు వేశారన్నది పచ్చినిజం. హిట్లరుకు ప్రతి రూపమే మోడీ. తన ప్రాపంచిక దృక్పథం హిందుత్వం, హిందుయేతరులు భారతీయులు కారు. మోడీ సద్భావనాదీక్ష లక్ష్యం చేసిన పాపాలను కడిగేసుకోవడానికి కాదు. తన మతోన్మాద కోణానికి మసిబూసి తన ప్రాభవాన్ని గుజరాత్ సరిహద్దులు దాటించి ఢిల్లీ పీఠం ఎక్కడానికి చేస్తున్న ప్రయత్నంలో భాగమే. అయితే ఇది కార్పొరేటు శక్తులు ఆడిస్తున్న నాటకం. మోడీ పాత్రదారుడు మాత్రమే. అయినా బిజెపిలో చాలామంది ఆ పదవిని ఆశిస్తున్నారు. ఎన్‌డిఎ కూటమిలోని జెడి (యు)కి చెందిన నితీశ్ కుమార్‌కు మోడీ పొడగిట్టదు. తన పదేళ్ల పాలనలో శాంతి, సమైక్యత, సామరస్యం సాధించానని మోడీ చేస్తున్న వాదనను మించిన అసత్యం మరొకటి లేదు.

గోద్రా సంఘటన తర్వాత 2002 ఫిబ్రవరి 27న రాత్రి సీనియర్ పోలీసు అధికారులను సమావేశపరిచి గోద్రా దుర్ఘటనపై ఆగ్రహం వెళ్లగక్కుతున్న హిందువులను అడ్డుకోబోకండి అని మోడీ చేసిన ధర్మ ప్రభోదాన్ని గురించి సీనియర్ ఐపిఎస్ అధికారి సంజీవ్ భట్ బయటపెట్టాడు. గుజరాత్ మాజీ మంత్రి హరేన్ పాండ్యా హత్యకేసులో ప్రభుత్వంలో పెద్దల హస్తముందని, అందుకు కావల్సిన సాక్షాధారాలున్నాయని భట్ ప్రకటించాడు. భట్ సిబిఐకి దాదాపు 600 పేజీలతో కూడిన పత్రాలను అందజేశాడు. మోడీ ప్రభుత్వం భట్‌ను అరెస్టుచేసి వేధిస్తుంది. ఆయన ఇంటి మీద దాడులు చేసి ఆయన కుటుంబ సభ్యులను వేధిస్తున్నారు. బాబు బజరంగ్, హరేశ్‌భట్, రమేశ్ దవే వంటి వారు గుజరాత్ మారణకాండ సందర్భంగా తాము వందలాది ముస్లింలను కడతేర్చామని కొన్ని పత్రికలు (తెహల్కా) స్టింగ్ ఆపరేషన్‌లో బాహటంగానే అంగీకరించారు. విధి నిర్వహణలో బాధ్యతలు విస్మరించారన్న ఆరోపణలున్న పోలీసు అధికారులపై ఇప్పటికీ ఏ చర్య తీసుకోలేదు. గుజరాత్ మారణకాండకు ప్రభుత్వ ప్రోత్సాహం ఉందన్న ఆరోపణలు అనేక వర్గాలనుంచి అనేకసార్లు వచ్చాయి. మోడీని, ప్రభుత్వాన్ని తప్పు పట్టిన పోలీసు అధికారులందరినీ వేధిస్తున్నారు. మానవ హక్కులను మోడీ ఖాతరు చేయడన్న ఆరోపణలు బలంగా ఉన్నాయి.

2002లో గుజరాత్ భయానక మత హత్యాకాండకు రంగస్థలమైంది. అందుకు ఆధ్వర్యం వహించిన సంఘ్ పరివార్ ప్రతినిధిగా మోడీ ఏకపక్ష పాలనకు ఎదురు లేకుండా పోయింది. వివిధ న్యాయస్థానాల్లో ఆయనపై పరంపరగా కేసులు నమోదైనాయి. అనేక అభిశంసనలు కూడా ఎదురైనాయి. బెస్ట్ బేకరీ కేసు వంటివి దేశాన్ని ఆకర్షించాయి. వీటితో పాటే ఆయన మంత్రివర్గ సభ్యుల అవినీతి వ్యవహారాలు కూడా రచ్చకెక్కాయి. మతాన్ని రాజకీయ ప్రయోజనాల కోసం ఉపయోగించి మారణహోమం సృష్టించడం అన్నిటికన్నా పెద్ద అక్రమ వ్యవహారం. ఇలాంటి ఉదంతాలు లోకాయుక్త ముందుకు వచ్చే అవకాశం చాలా ఉంటుంది. అందుకే 2003 డిసెంబర్ నుంచి లోకాయుక్త స్థానం ఖాళీగా ఉంది. 2002 అల్లర్లను లోకాయుక్త విచారించే అవకాశముందన్న కారణంగానే, విచారణకు అవకాశం లేకుండా చేయడానికి జస్టిస్ ఎంబి షా అధ్యక్షతన ప్రత్యేకంగా ఒక విచారణ కమిషన్‌ను నియమించారు. దాంతో అప్పటి లోకాయుక్త జస్టిస్ ఎస్ఎం సోని రాజీనామా చేశారు. దాన్నే అవకాశంగా తీసుకున్న మోడీ మరొకరిని నియమించకుండానే కథ నడిపించేందుకు ప్రయత్నించారు. చివరకు గవర్నర్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి సూచించిన వ్యక్తినే లోకాయుక్తగా నియమించారు. దీనిపై ప్రభుత్వం సుప్రీంకోర్టుకెళ్లింది. హైకోర్టు సూచించిన వ్యక్తినే లోకాయుక్తగా నియమించారు గనుక అదేమీ తప్పు కాదు అని సుప్రీంకోర్టు సమర్థించింది. అవినీతికి ఆవగింజంత అవకాశమివ్వని ఆదర్శనేతగా ఆకాశానికెత్తించుకున్న మోడీకి అలాంటి వ్యవహారాలను దర్యాప్తు చేసే లోకాయుక్త యంత్రాంగం పట్ల వైముఖ్యమెందుకు?

మోడీ ఒక రాజకీయ నాయకుడిగానే కాకుండా, హిందుత్వ మత రాజకీయాలకు ప్రతీకగా మారిన నేపథ్యంలో గుజరాత్ ఎన్నికల ప్రభావం దేశ రాజకీయాలపై కూడా ప్రసరించవచ్చు. మోడీ జాతీయ రాజకీయాలలో అడుగు పెట్టక ముందే, సొంత పార్టీలోనే అనుకూల, వ్యతిరేక శిబిరాలు ఏర్పడ్డాయంటే, ఆయన ప్రభావం, ప్రాబల్యం ఎంతగా ఉన్నదో అర్థం చేసుకోవచ్చు. అయితే మోడీ ప్రధాని అభ్యర్థిగా మారడం అనుకున్నంత సులభం కాదు. ఆయనకు ప్రతికూల వర్గం పార్టీలోనే తయారయింది. సొంత పార్టీ అగ్ర నాయకత్వం ఆయన ప్రతిభను ఆమోదిస్తున్నప్పటికీ ఆయన ప్రభను ఆమోదించేందుకు సిద్ధంగా లేదు. ఆయన జాతీయ స్థాయికి రావడం పార్టీ ఢిల్లీ వర్గాలకు ఏ మాత్రం మింగుడు పడని విషయం. నితిన్ గడ్కారీకి రెండవ పర్యాయం అధ్యక్ష పదవిని కట్టబెట్టడంలోని అంతర్యం అదేనని ఆ పార్టీ వర్గాల సమాచారం. ఆర్ఎస్ఎస్ ఆశీస్సులు ఒకప్పుడు మోడీకి మెండుగా ఉండేవి. అయితే ప్రస్తుతం సంఘ్‌పరివార్‌లోనూ అనేకులు ఆయన్ని వ్యతిరేకిస్తున్నారు. ఆర్ఎస్ఎస్ సైతం జాతీయ నాయకత్వం స్థానంలోకి గడ్కారీని ప్రోత్సహిస్తున్న విషయం తెలిసిందే. అయితే మోడీ గెలుపు, తక్కిన దేశంలోని మైనారిటీ వర్గాలను కాంగ్రెస్ వెనుక బలంగా సమీకృతులను చేసే అవకాశం ఉంది. అది కాంగ్రెస్‌కు జాతీయ స్థాయిలో సానుకూల అంశం కావచ్చు. బీహర్, బెంగాల్, ఉత్తర్ ప్రదేశ్‌లలో ముస్లింల సంఖ్య అధికం, కాబట్టి జెడి(యు), ఎస్‌పి, బిఎస్‌పి, తృణమూల్, తెలుగుదేశం పార్టీలు మోడీని సమర్థించకపోవచ్చు. ఇవి ముస్లిం ఓట్లతోనే అధికారం పొందాయి.

విహెచ్‌పి నేతలు కూడా ఆయన ఏకపక్ష వైఖరిని సహించలేక ప్రత్యర్థులను బలపర్చారు. ఇదంతా మోడీ వ్యక్తిగత లక్షణమా లేక బిజెపి ఆర్ఎస్ఎస్ విధాన ఫలితమా అంటే రెండూ ఉంటాయి. అధికారం ప్రధానంగా దేనికైనా పాల్పడ్డమే సంఘ్ పరివార్ ఏకైక సూత్రం. దాని కోసం ఎవరికి సేవ చేయడానికైనా, ఎవరిపై దౌర్జన్యం సాగించడానికైనా వారు సిద్ధపడిపోతారు. హిట్లర్ నుంచి థాకరే వరకూ అనుసరించిన వేదవాక్యమూ అదే. దానికి ప్రతిరూపం వంటి మోడీ కూడా ముస్లింలనూ, రాజకీయ ప్రత్యర్థులనూ, నచ్చని అధికారులనూ వెంటాడి వేధిస్తూనే కార్పొరేట్ ప్రపంచానికి ఎర్రతివాచీ పర్చి ఆహ్వానిస్తూ వచ్చారు. వీసా ఇవ్వం పొమ్మన్న దేశాలన్నీ ఇతనే మన ముద్దు బిడ్డ అని పసిగట్టాయి. కనుకనే ఆర్థికవేత్తలు, ఆర్థిక సంస్థలు ఇచ్చిన లెక్కలను పక్కనబెట్టి

ఆయనను అసాధారణ పాలనా దక్షుడిగా, అభివృద్ధికి మారుపేరుగా చిత్రించే ప్రక్రియ పెద్ద ఎత్తున సాగింది, సాగుతోంది.

గుజరాత్ ఎన్నికల్లో శాసన సభ్యులుగా ఎన్నికైన వారిలో సుమారు 57 మంది నేరచరితులున్నారు. ఎన్నికల వ్యవస్థ నుండి కండ బలాన్ని, ధన బలాన్ని తగ్గించాలనే ఘోష చాలా కాలంగా వినిపిస్తోంది. కాని ఆచరణ తద్భిన్నంగా ఉంది. వందలకోట్ల ఆస్తుల వ్యాపారులు పలువురు ఈసారి ప్రజా ప్రతినిధులుగా ఎన్నికైనారు. నాలుగింట మూడొంతులు కోటీశ్వరులే. గత ఎన్నికలతో పోల్చితే 31 శాతం పెరిగారు. శాసన కర్తలుగా ఎన్నుకోబడిన ప్రతినిధుల్లోనే పెద్ద సంఖ్యలో నేరచరితులున్నప్పుడు మన ప్రజాస్వామ్యం ఎటు ప్రయాణిస్తున్నట్టు? ఎన్నికల్లో గెలవడానికి నేరచరిత, ధనసంపత్తి బహుశా అదనపు అర్హతలుగా మారినట్లున్నాయి. రాజకీయ పార్టీల మధ్య ఏకాభిప్రాయం లేదనే కారణంతో ఎన్నికల సంస్కరణలు వాయిదా పడుతున్నాయి. దేశ వనరులు విదేశీ సంస్థలకు దోచిపెట్టే సంస్కరణలు చట్టాలు అవుతున్నాయి గానీ మహిళ రిజర్వేషన్ బిల్లు, ప్రైవేట్ సంస్థల్లో రిజర్వేషన్లు లాంటి ప్రజానుకూల బిల్లులు సంవత్సరాల తరబడి పార్లమెంటులో దుమ్ము కొట్టుకుంటున్నాయి.

జనవరి రెండవ వారంలో అహ్మదాబాద్‌లో జరిగిన వైబ్రంట్ సమ్మిట్‌లో వచ్చే ఆర్థిక సంవత్సరాని(2013-14)కి ప్రవేశపెట్టే బడ్జెట్ దేశ ఆర్థిక వృద్ధికి దోహదపడేదిగా ఉండాలని పారిశ్రామికవర్గాలు డిమాండ్ చేశాయి. ప్రస్తుతం దేశ ఆర్థిక వ్యవస్థకు వృద్ధి రేటు పెరుగుదల అత్యవసరమని, జనాకర్షణ పథకాలు కాదని గుజరాత్ వైబ్రంట్ సమ్మిట్‌లో గోద్రేజ్ ఇండస్ట్రీస్ చైర్మన్, భారత పరిశ్రమల సమాఖ్య (సిఐఐ) ప్రెసిడెంట్ ఆదీ గోద్రేజ్ అన్నారు. సదస్సులో పాల్గొన్న ఎల్&టి ఎండి, సిఇఒ వెంకటరామన్, అసోచామ్ ప్రెసిడెంట్ రాజ్ కుమార్ ధూత్ కూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ఈ విషయంపై త్వరలోనే ప్రధాని, ఆర్థిక మంత్రులతో చర్చించనున్నట్లు వెంకటరామన్ తెలిపారు. వచ్చే ఏడాదిలో పార్లమెంట్ ఎన్నికలున్నప్పటికీ కేంద్రం ప్రజాకర్షక పథకాలకు పెద్దపీట వేయదనే నమ్ముతున్నట్లు ధూత్ పేర్కొన్నారు. అలాగే ధనికులపై అధిక పన్నులు విధించాలన్న ఆలోచనను కూడా మరో ఏడాది పాటు వాయిదా వేయాలని ఆయన కోరారు. ధనికుల వద్ద ఉన్న డబ్బుతో పెట్టుబడులు పెట్టొచ్చని, అప్పుడే దేశంలో ఉద్యోగ వకాశాలు పెంచేందుకు సాధ్యమవుతుందన్నారు. వైబ్రంట్ సమ్మిట్‌లో గృహ నిర్మాణ రంగానికి సంబంధించి రు. 1.34 లక్షల కోట్ల విలువైన అవగాహన ఒప్పందాలు (ఎంఒయు) కుదిరాయి. చవక గృహ నిర్మాణాల సాంకేతికతకు సంబంధించి గుజరాత్ ప్రభుత్వంలో అమెరికాకు చెందిన హావ్తోర్న్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ రు. లక్ష కోట్ల విలువైన ఎంఒయు కుదుర్చుకుంది. అలాగే టాటా హౌజింగ్ డెవలప్‌మెంట్ కంపెనీ లిమిటెడ్ రు. 3,500 కోట్ల ఒప్పందం ఖరారు చేసుకుంది. ఫిన్‌లాండ్‌కు చెందిన ఎలెమాటిక్ రు. 15 వేల కోట్లు, యుఎస్‌లోని స్పిరోల్ ప్రీకాస్ట్ రు. 5 వేల కోట్ల ఎంఒయులకు కుదుర్చుకున్నాయి. మొత్తం 8 కంపెనీలు అగ్రిమెంట్లు చేసుకున్నాయి.

మన దేశంలో ప్రజల ప్రయోజనాలను పరిరక్షించాల్సిన ప్రభుత్వాలు ప్రపంచ ద్రవ్య పెట్టుబడుల ప్రయోజనాలను పరిరక్షించే పనిలో పడ్డాయి. ప్రజల్లో చీలికలు తెచ్చి వారిలో ప్రతిఘటన శక్తిని, పోరాట పటిమను దెబ్బతీస్తున్నాయి. అందులో భాగంగానే ప్రపంచీకరణ శక్తులు దేశంలోని మధ్యేమార్గ నాయకులను, పార్టీలను నిర్వీర్యం చేస్తున్నాయి. మిత వాద, ఉగ్రవాద మత శక్తులనే రంగంలో మిగులుస్తున్నాయి. దేశంలో విలువలతో కూడిన రాజకీయాలను సమాధి చేసి, భిన్న మతాల, తెగల మధ్య నిరంతర ఘర్షణలు సృష్టిస్తున్నాయి. రాజకీయ వ్యవస్థను బలహీనపరుస్తున్నాయి. ఈ పరిస్థితిని అధిగమించాలంటే, భారతదేశ సమ్మిళిత భావనను పునరుద్ధరించాలంటే, మనను చుట్టుముడుతున్న హిందుత్వ ఫాసిస్టు దోరణులపై పోరాటం చేయాలి. నయా ఉదారవాదం పైనా, సామ్రాజ్యవాద ప్రపంచీకరణపైనా పోరాటాన్ని సంఘటిత పరచాలి. ఈ పోరాటానికి అన్ని ప్రజాస్వామ్య, లౌకిక, ప్రగతిశీల శక్తుల మద్దతు సమీకరించాలి. ప్రజల దైనందిన జీవన విధానంలో అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి ప్రదర్శించే ఆధిపత్యంపై గళం విప్పే అన్ని శక్తులు సంఘటితంగా ఉద్యమించాలి. ఇరుగు పొరుగు దేశాల అనుభవాల దృష్ట్యా దేశంలోని ప్రగతి శీల శక్తులు ఇప్పటికైనా అప్రమత్తం కావాలి. జాతీయత, జాత్యహంకారం పేర వచ్చే ముప్పునకు మధ్య గల తేడాను ప్రజలకు వివరించడం బుద్ధిజీవుల తక్షణ కర్తవ్యం. ప్రజలకు ప్రజల మధ్య ఏర్పడే సమస్యలను, ప్రజలకు, రాజ్యం మధ్య ఏర్పడే సమస్యలను రాజ్యం పరిష్కరిస్తుంది. మతం సమస్యలను పరిష్కరించదు సరికదా! ప్రజల మధ్య విద్వేషాలను రెచ్చగొట్టి ప్రజాసమస్యలను పక్కదారి పట్టిస్తుంది. అందుకే ఆధిపత్యవర్గాలు, దోపిడీ వర్గాలు, సామ్రాజ్యవాదం కుమ్మక్కై మతతత్వాన్ని ప్రోత్సహిస్తాయి. ప్రజల చైతన్యాన్ని నీరుకార్చేందుకు మతతత్వ ఫాసిస్టు దోరణులను ఆశ్రయిస్తున్నాయి. ఈ నేపథ్యంలో లౌకిక ప్రజాతంత్ర శక్తులు అప్రమత్తమై ప్రజలను చైతన్యపరచడం తప్ప మరోమార్గంలేదు.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

*వీక్షణంకు వచ్చే రచనలలో కొన్ని జిరాక్స్ కాపీలు వస్తున్నాయి. జిరాక్స్ నాణ్యత సరిగా ఉండడంలేదు. కొన్నిటిలో చేతి రాతలు కూడా కష్టంగా ఉంటున్నాయి. అందువల్ల అర్థం చేసుకొని టైప్ చేయడంలో చాలా ఇబ్బందులు, సమస్యలు ఎదురవుతున్నాయి. అక్షరాలు అర్థమయ్యేలా రాయండి. జిరాక్స్ మీరు ఉంచుకుని ఒరిజినల్స్ మాకు పంపి సహకరించండి.*

*- సం.*

*ఇటీవల పోస్టల్ శాఖ అన్ని మనీ ఆర్డర్‌లను టెలిగ్రాఫిక్ మనీ ఆర్డర్‌లుగా పంపుతున్నది. మీరు ఎం.ఒ. చేసినప్పుడు కింద కూపన్‌లో రాసిన ఉత్తరం ఈ టెలిగ్రాఫిక్ ఎం.ఒ.లో మాకు చేరదు. కనుక ఎం.ఒ.లు చేసేవారందరూ విడిగా ఒక పోస్ట్‌కార్డు మీద మీరు ఎం.ఒ. ఎందుకు పంపుతున్నారో రాయండి. - సం.*

# కార్పొరేట్ కీలు బొమ్మ ప్రభుత్వాలు

***అభివృద్ధి పేరుతో సారవంతమైన డెల్టా భూములను, సహజ వనరులను కార్పొరేట్ సంస్థలకు కట్టబెడుతూ ప్రజలకు జీవనాధారం లేకుండా చేస్తున్న ప్రభుత్వ విధానాలను వివరిస్తున్నారు పి.వి. రమణ***

**కా**ర్పొరేట్ సంస్థల గుప్పిట్లో మన దేశ పాలకులు ఎంత కీలు బొమ్మలుగా మారారో గుర్తించడానికి రిలయన్స్ ఇండస్ట్రీస్ అధికారానికి అడ్డొచ్చిన మంత్రుల్ని కూడా బలి ఇవ్వడం మంచి ఉదాహరణ. మన ప్రజాస్వామ్య పాలకులు ప్రజలందరికీ చెందిన సహజ వనరుల్ని కార్పొరేట్ సంస్థలకు ధారపోసి, వాటి దళారీలుగా పరిపాలన సాగిస్తున్నారు.

రాజ్యాంగం ఆర్టికల్ 39 (బి) ప్రకారం దేశంలో సహజ వనరుల ప్రదేశాలన్నీ ప్రజల సామూహిక ఆస్తి. వాటిని వారి అందరి సంక్షేమం కొరకే ఉపయోగించాలి తప్ప దుర్వినియోగపరిచే అధికారం రాజ్యానికి లేదు. కాని దానికి భిన్నంగా సహజ వనరుల్ని బహుళజాతి కంపెనీలకు, కార్పొరేట్ సంస్థలకు అప్పజెప్పడమే కాకుండా, వారు సాగిస్తున్న పర్యావరణ విధ్వంసాన్ని, తద్వారా ఆహార భద్రతకు కలిగిస్తున్న వినాశనాన్ని కూడా ప్రోత్సహిస్తున్నారు.

కృష్ణా-గోదావరి బేసిన్‌లోని సహజ వనరులు ప్రపంచంలోనే ప్రాముఖ్యత కలిగి ఉన్నాయి. ఇవి డెబ్బై వేల కిలోమీటర్ల విస్తీర్ణంలో వ్యాపించి ఉన్నాయి. ఇందులో ఇరవై ఎనిమిది వేల కిలోమీటర్ల భూమి పైనా, నలభై రెండు వేల కిలోమీటర్లు సముద్ర భాగంలోనూ విస్తరించి ఉన్నాయి. సముద్రభాగంలో ఇరవై నాలుగు వేల చదరపు కిలోమీటర్ల ప్రాంతంలో నాలుగు వందల మీటర్ల లోతు ఉన్న నీటి ప్రాంతంలోనూ, పద్దెనిమిది వేల చదరపు కిలోమీటర్ల ప్రాంతంలో రెండు వేల మీటర్ల లోతు ఉన్న నీటి ప్రాంతంలోనూ ఈ వనరులున్నాయి. ఈ ప్రాంతంలో ప్రభుత్వరంగ సంస్థ ఆయిల్ అండ్ నేచురల్ గ్యాస్ కార్పొరేషన్ (ఒఎన్‌జిసి) ఆధ్వర్యంలో 1977 నుండి చమురు, సహజ వాయువుల కొరకు అన్వేషణ ప్రారంభించారు. ఈ ప్రాంత నిక్షేపాలన్నీ మూడు మిలియన్ సంవత్సరాల క్రితంకు చెందిన ఇసుకరాతి పొరల నుండి లభ్యమవుతున్నట్లు గుర్తించారు.

కేంద్ర పెట్రోలియం, సహజవాయు మంత్రిత్వశాఖ న్యూ ఎక్స్‌ప్లోరేషన్ పాలసీ ప్రకారం కృష్ణా-గోదావరి (కెజి) బేసిన్‌ను కొన్ని బ్లాకులుగా విభజించి ప్రైవేట్ కంపెనీలకు బిడ్డింగ్ పద్ధతిలో అన్వేషణకు అప్పగించింది. అందులో రిలయన్స్ ఇండస్ట్రీస్, గుజరాత్ స్టేట్ పెట్రోలియం కార్పొరేషన్, కెయిర్న్ ఎనర్జీ లాంటి సంస్థలు పాల్గొన్నాయి. రిలయన్స్ కంపెనీ సముద్ర జలాల్లో వెయ్యి మీటర్ల లోతులోకి ఐదు బావులు తవ్వి సహజ వాయువు నిక్షేపాలున్నట్లు కనుగొంది. వీటి పరిమాణం 140 బిలియన్ క్యూబిక్ మీటర్లుగా అంచనా వేశారు. కాని అక్కడ దాదాపు 1400 బిలియన్ క్యూబిక్ మీటర్లు ఉండవచ్చని నిపుణుల అంచనా. నిజానికి సహజ వాయువును అన్వేషించడం, గుర్తించడం వంటి ముఖ్యమైన కార్యక్రమాలన్నీ ప్రభుత్వ రంగ సంస్థ ఒఎన్‌జిసి చేపట్టి పూర్తి చేసిన తర్వాతే రిలయన్స్ వారికి అప్పజెప్పారు.

కెజి బేసిన్‌లో సహజ వాయు నిక్షేపాలు లభించినట్లు తెలియగానే నేషనల్ థర్మల్ పవర్ కార్పొరేషన్ (ఎన్‌టిపిసి) సహజ వాయువు కోసం ప్రపంచ వ్యాప్తంగా ఉత్పత్తిదారులను బిడ్‌ల కోసం ఆహ్వానించింది. అప్పుడు రిలయన్స్ కంపెనీ మిలియన్ మెట్రిక్ బ్రిటిష్ థర్మల్ యూనిట్ (ఎంఎంబిటియు) 2.34 డాలర్లకు సహజ వాయువును సరఫరా చేయగలమని బిడ్ వేసింది. నిజానికి ఎంఎంబిటియుకు 0.60 డాలర్లు మాత్రమే ఖర్చవుతుందని నిపుణుల అంచనా. స్వయంగా రిలయన్స్ కంపెనీ 2.34 డాలర్లకు సరఫరా చేస్తామని హామీ ఇచ్చినా, మన ప్రభుత్వం 4.20 డాలర్లకు ఒప్పందం చేసుకొంది. దీని వలన ఎన్ని వేల కోట్ల రూపాయల ప్రజల సొమ్మును రిలయన్స్ దోపిడీ చేసిందో ఊహించగలం.

## డెల్టాలో పర్యావరణ విధ్వంసం

కృష్ణా-గోదావరి బేసిన్‌లో సహజ వాయువు ఉత్పత్తి 1988లో ప్రారంభమైంది. 1993లో రవ్వ క్షేత్రంలో మొదలై 1998 నాటికి విస్తృతంగా ఉత్పత్తి చెయ్యడం ప్రారంభమైంది. వాటి మొత్తం ఉత్పత్తి కంటే రిలయన్స్ ఇండస్ట్రీస్ వారిచే ఏప్రిల్ 2009లో డీప్ వాటర్‌లోకి 'డి6' బ్లాకులో ప్రారంభించిన ఉత్పత్తి పది నుండి పదిహేను రెట్లు ఎక్కువ. పైగా ఈ క్షేత్రంలో మెత్తని ఇసుక పొరల నుండి సహజ వాయువు వెలికి తీస్తుండడం వలన దాని ప్రభావం కాకినాడ, ఉప్పాడ వరకు అంటే దాదాపు తొంభై కిలోమీటర్లకు మించి కనిపిస్తుంది. సాధారణంగా ఉత్పత్తి మొదలు పెట్టిన 5-7 సంవత్సరాల తర్వాత భూమి క్రుంగడం ప్రారంభిస్తుంది. కాని డి6 ప్రభావం వెంటనే కనపడింది. ఉత్పత్తి చేస్తున్న ఈ క్షేత్రం కూడా క్రుంగిపోయిందని చెపుతున్నారు. దీని ప్రభావం వలన భూమి క్రుంగుడు సంవత్సరానికి 50 సెంటిమీటర్లు ఉంటుందని తెలుస్తుంది. డి6, దాని చుట్టుపక్కల ఉన్న లోతైన బ్లాకుల నుండి ఉత్పత్తి చేయడం కొనసాగిస్తే ఆ రాతి పొరలు సముద్రం లోపలి భాగాల్లోకి జారిపోయే ప్రమాదం పొంచి ఉంది.

సహజ వాయువు ఉత్పత్తి వలన గోదావరి డెల్టాలో సముద్ర తీరం నుండి ఇరవై కిలోమీటర్ల వరకు చాలా ప్రదేశాల్లో నీరు, మట్టి సంబంధమైన పర్యావరణంలో చాలా మార్పులు చోటు చేసుకొంటున్నాయి. ఈ మార్పుల వలన ప్రజలు తాగేనీటిని, ఆహారం

సమకూర్చే భూమిని, కొబ్బరి చెట్లను శాశ్వతంగా కోల్పోతున్నారు. చాలా గ్రామాలలో మంచినీటి బావులు ఉప్పునీటి బావులుగా మారిపోయాయి. పొలాల్లో కూడా వేసవిలో చెలిమెలు తీస్తే వచ్చే మంచినీరు ప్రస్తుతం ఉప్పుగా మారిపోయింది. ఈ ఉప్పు నీరు వేసవిలో భూమిపైకి ఉబికి వచ్చి ఆ ప్రాంతాలన్ని ఉప్పు నేలలుగా మార్చేస్తుంది. దాంతో ఈ భూములు పంటలకు పనికి రాకుండా పోతున్నాయి. ఇప్పటికే డెల్టా ప్రాంతాలలో చాలా చోట్ల వరిపంట దిగుబడి సగానికి తగ్గిపోయింది. కొబ్బరి కాయల దిగుబడి మూడవ వంతుకు పడిపోయింది. మురుగు కాల్వల ద్వారా సముద్రపు నీరు పోటు సమయంలో పొలాల్లోకి ప్రవేశించి పంటలను నాశనం చేస్తున్నాయి.

చమురు, సహజ వాయువుల ఉత్పత్తి భూభాగంలో జరిగినపుడు సంబంధిత రూల్స్‌లో ఆర్టికల్ 11.1 ప్రకారం మైనింగ్ లీజ్‌ను కొన్ని ప్రాంతాలలో నిషేధించారు. పెట్రోలియం, సహజ వాయువు రూల్స్ ప్రకారం, ఆర్టికల్ 11.2 ప్రకారం రైల్వే లైను, పైపు లైను, సర్వే చేయబడిన రోడ్లు, నివాస స్థలాలు, పరిశ్రమలు, విమానాశ్రయాలు, మిలిటరీ లేదా ప్రభుత్వ భవనాలు, గనులకైతే కనీసం మూడు కిలోమీటర్ల దూరం తర్వాత మాత్రమే తవ్వకాలు జరగాలి. దీనిని బట్టి జనావాస ప్రాంతాలు నిషేధించబడినవి. కాని ఇందుకు విరుద్ధంగా డెల్టాలో జనావాస ప్రాంతాలలోనే ఉత్పత్తి సాగిస్తున్నారు. డెల్టా భూముల్లో చమురు, సహజ వాయువుల ఉత్పత్తి చేపట్టకూడదు. సముద్ర భాగంలో కూడా చేయకూడదు. ఎందుకంటే సముద్ర భాగంలో తీరానికి యాభై కిలోమీటర్ల దూరంలో ఉత్పత్తి జరిగినా దాని ప్రభావం సమీప భూమి ప్రాంతాలపై ఉంటుంది.

ఆర్టికల్ 14.9 ప్రకారం ఒక ప్రాజెక్టు పని పూర్తయ్యాక ఆ ప్రాంతాన్ని, ఆ ప్రాజెక్టు ప్రారంభించక ముందు ఎలా ఉండేదో అదే స్థితిలో ప్రజలకు అప్పజెప్పాలి. ఇందులో ఆ ప్రాంతపు భూమిలోని డ్రైనేజ్, ఉపరితల మట్టి, చెట్లు, తీసిన గోతులు పూడ్చడం లాంటి పర్యావరణ పరిస్థితుల్ని పూర్తి చెయ్యాలి. దానికయ్యే ఖర్చు తమ బడ్జెట్‌లో కేటాయించాలి. కాని ఇటువంటి పనులు కంపెనీలు చెయ్యకపోయినా ప్రభుత్వం వారిపై ఎటువంటి చర్యలు తీసుకోకపోగా మరిన్ని ప్రాజెక్టులకు అన్ని రకాల అనుమతులు ఇస్తున్నారు.

## ప్రభుత్వ సంస్థల నిర్వాకాలు

కేంద్ర ప్రణాళికా సంఘం ఇంతకు ముందు జరిపిన పరిశీలన ప్రకారం సహజ వాయువును ఎక్కడ ఉత్పత్తి చేస్తున్నారో అక్కడే ఉపయోగించాలి. దాని ప్రకారం దాని ద్వారా ఉత్పత్తి చేసిన విద్యుత్తును మన రాష్ట్రంలోనే అధికంగా ఉపయోగించాలి. తర్వాత మిగిలిన విద్యుత్‌ను పై రాష్ట్రాలకు ఎగుమతి చేయడం ఆర్థికంగా సమంజసమని అభిప్రాయపడింది. పైపులైన్ల ద్వారా ఎగుమతి చేయడం వలన ఖర్చులు విపరీతంగా పెరుగుతాయని కూడా అభిప్రాయ పడ్డారు. కాని కెజి బేసిన్‌లో రిలయన్స్ కంపెనీ దూర ప్రాంతాలకు పైపులైన్లు వేస్తున్న ప్రభుత్వం అభ్యంతరం చెప్పడం లేదు.

రిలయన్స్ కంపెనీలకు అనుకూలంగా గ్యాస్ ధర నిర్ణయంలోనూ ప్రభుత్వ సంస్థలు పూర్తిగా సహకరించాయి. మొదట యూనిట్ గ్యాస్ 2.34 డాలర్లకు సరఫరా చేయగలనని చెప్పిన కంపెనీకే తర్వాత యూనిట్‌కు 4.20 డాలర్ల ధరను నిర్ణయిస్తూ రిలయన్స్ దోపిడీలో పాలుపంచుకున్నారు. ప్రభుత్వ నిర్ణయం తమకు ఎంతో లాభసాటిగా ఉన్నప్పటికీ గ్యాస్ లభ్యత తగ్గిపోతుందనే నెపంతో నేడు రిలయన్స్ కంపెనీ ధరను 14 డాలర్లకు పెంచమని డిమాండ్ చేస్తోంది.

## రిలయన్స్‌పై కాగ్ విమర్శ

కాగ్ గత సంవత్సరపు ఆడిట్ రిపోర్ట్‌లోనే చమురు మంత్రిత్వ శాఖను తీవ్రంగా విమర్శించింది. రిలయన్స్‌కు అనుకూలంగా ఉండడమే కాకుండా, వారు ఉత్పత్తి క్రమంలో అవలంబిస్తున్న పద్ధతుల్ని పట్టించుకోని మంత్రిత్వ శాఖను విమర్శించింది. కెజి బేసిన్‌లో సహజ వాయు అన్వేషణ, ఉత్పత్తుల ఒప్పందంలో అనేక అవకతవకలున్నాయని పేర్కొంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కంపెనీతో కుమ్మక్కు అవడం వలన సహజ వాయువు ధర అధికంగా నిర్ణయించబడి, ప్రభుత్వ ఖజానాకు భారీగా గండి పడిందని, వినియోగదారులపై విపరీతమైన భారం పడిందని పేర్కొంది.

సెప్టెంబర్‌లో పార్లమెంట్‌కు సమర్పించిన కాగ్ నివేదికలోని అంశాలు: 'రిలయన్స్ ఇండస్ట్రీస్, కెయిర్న్ ఇండియా, గెయిల్ ఇండియా సంస్థలన్నీ, సహజ వాయువు ఉత్పత్తి, పంపిణీ విషయంలో నిబంధనలకు విరుద్ధంగా అనేక కార్యక్రమాలు జరిపినట్లు తెలిసింది. ప్రైవేట్ కంపెనీల ఒప్పందాల ప్రకారం కార్యక్రమాలు సాగిస్తున్నాయా లేదా అని చమురు మంత్రిత్వ శాఖ ఏమాత్రం పట్టించుకోలేదు. కెజి బేసిన్‌లో నిబంధనల ప్రకారం ప్రభుత్వానికి వదలాల్సిన 25 శాతం స్థలాన్ని రిలయన్స్ కంపెనీయే అట్టిపెట్టుకున్నా ప్రభుత్వం ఎటువంటి అభ్యంతరం చెప్పలేదు. రిలయన్స్ ఇండస్ట్రీస్ డి1, డి3, డి6 బ్లాక్‌లను కనుగొనడానికి, అభివృద్ధి చేయడానికి పెట్టిన పెట్టుబడి 2.39 బిలియన్ డాలర్ల నుండి ఒక్కసారే 8.8 బిలియన్ డాలర్లకు పెంచేసింది. ఈ పెంపుదల కంపెనీ సామర్థ్యం పైనా, వారి లెక్కల వివరాల పైనా అనుమానంగా ఉంది. కెయిర్న్ ఇండియా రాజస్థాన్‌లో ఆర్‌జెఒఎన్ 90/1 బ్లాక్ విషయంలో అనేక అవకతవకలకు పాల్పడినట్లు రుజువైంది. బాగా లాభాలొచ్చే బ్లాకుల్లో ప్రొడక్షన్ షేరింగ్ కాంట్రాక్టు (పిఎస్‌సి) నిబంధనలను రిలయన్స్ ఉల్లంఘించిన విషయం చమురు మంత్రిత్వ శాఖకు తెలిసినా పట్టించుకోలేదు.'

ప్రభుత్వాధికారులు, రిలయన్స్ ఇండస్ట్రీస్‌ల మధ్యగల అక్రమ సంబంధాల గురించి 2009లోనే సీనియర్ ఇన్‌కం టాక్స్ అధికారులు హెచ్చరించారు. మానవ వనరుల అభివృద్ధి, సమాచార సాంకేతిక శాఖ మంత్రి కపిల్ సిబాల్ బంధువు వినోద్ కుమార్ సిబాల్. ఈయన మాజీ డైరెక్టర్ జనరల్ ఆఫ్ హైడ్రో కార్బన్ (డిసిఎచ్)గా పనిచేసారు. రిలయన్స్ ఇండస్ట్రీస్ ఈయన కొరకు ఒక ఫ్లాట్ కొన్నట్లు సిబిఐకి సమాచారం అందింది. అమెరికాలోని హూస్టన్‌కు చెందిన జిఎక్స్ టెక్నాలజీకి చెందిన సుజాతా వెంకటరామన్ సిబాల్‌కు, అతని కుటుంబానికి అనేక సహాయాలు అందజేసినట్లు కూడా రుజువులు అందాయి. సిబాల్ చిన్న కూతురు స్విట్జర్లాండ్‌లో అతి ఖరీదైన హోటల్ మేనేజ్‌మెంట్ సంస్థలో చదువు పూర్తి చేసేందుకు అవసరమైన పూర్తి ఖర్చు జిఎస్ సంస్థే

భరించింది. సిబాల్‌పై ఈ విషయంలో సిబిఐ అక్టోబర్ 2009లోనే కేసు వేసింది. కేంద్ర విజిలెన్స్ కమిషన్ (సివిసి) కూడా ఈ విషయంలో సిబిఐ విచారణ కొరకు ఆదేశించినట్లు తెలిసింది.

రిలయన్స్ ఇండస్ట్రీస్ అనేక అవకతవకలకు పాల్పడినట్లు రుజువైనా, ప్రభుత్వం కావేరీ బేసిన్‌లో సహజ వాయువు, చమురు వనరులను గుర్తించడానికి, అభివృద్ధి చేయడానికి అనుమతులిచ్చిన కావేరీ బేసిన్‌లో సివిపిఆర్ డి6 బ్లాక్ 8600 చ.కి.మి. ప్రాంతంలో వంద మిలియన్ బారెళ్ల చమురు, మూడు ట్రిలియన్ క్యూబిక్ మీటర్ల సహజవాయు నిక్షేపాలున్నట్లు అంచనా.

## రిలయన్స్ దోపిడీని ప్రశ్నించినందుకు బలైన జైపాల్ రెడ్డి

కెజి బేసిన్ డి6 బ్లాక్ నుండి సహజ వాయువు ఉత్పత్తి విషయంలో అనుమతి, ఉపయోగం, సరఫరా, ధరలకు సంబంధించి చమురు, సహజ వాయు శాఖ కేబినెట్ మంత్రి జైపాల్ రెడ్డి అక్టోబర్ 10, 2012న 'ఎంపవర్డ్ గ్రూప్ ఆఫ్ మినిస్టర్స్' (ఇజిఒఎం)కు పంపిన నోట్‌లో పాయింట్ 3.12 ఆర్థిక పరిణామాలపై చాలా వివరంగా ఉంది. 'అంతర్జాతీయ ప్రమాణాల ఆధారంగా గ్యాస్ ధరను రిలయన్స్ పెంచాలని ప్రతిపాదిస్తుంది. దీని ప్రకారంగా యూనిట్ (ఎంఎంజిటియు) ధర 14.20 డాలర్ల నుండి 14.51 డాలర్ల వరకు ఉండవచ్చు. దీని వలన ధరలో ఒక్కసారే పది డాలర్లు పెంపుదల వలన వచ్చే రెండు సంవత్సరాల్లో రిలయన్స్ కంపెనీకి 8.5 బిలియన్ డాలర్లు (దాదాపు నలభై వేల కోట్ల రూపాయలు) అదనపు రాబడి లభిస్తుంది. కంపెనీ చెపుతున్న తక్కువ ఉత్పత్తి అంచనాలు, ధరల పెంపుదల వలన సహజ వాయువు ఉపయోగించే రాష్ట్రాలకు 10.5 బిలియన్ డాలర్లు (50 వేల కోట్ల రూపాయలు) అదనపు భారం పడుతుంది. ఉత్పత్తి తగ్గిపోవడం వలన ప్రభుత్వం ఇచ్చే సబ్సిడీలపై 6.3 బిలియన్ డాలర్లు (30 వేల కోట్ల రూపాయలు) అదనపు భారం పడుతుంది.'

ఈ విధంగా రిలయన్స్ కంపెనీ వ్యవహారం ప్రభుత్వ ఖజానాకు ఎంత చేటు తెస్తుందో తెలపడమే కాకుండా ఉత్పత్తి పడిపోయిందనే నెపంతో కోరిన ఒక బిలియన్ డాలర్లు నష్ట పరిహారాన్ని ఆపాలని నోటీసు ఇచ్చారు. విపరీతమైన ఆలస్యం కారణంగా అనుమతిచ్చిన నాలుగు గ్యాస్ పైపులైన్ల ప్రాజెక్టులను రద్దు చేసారు. చివరగా అక్టోబర్ 23న జైపాల్‌రెడ్డి కాగ్‌ను ఆడిట్ కొనసాగించమని ఉత్తరం రాసారు. దీంతో రిలయన్స్ అధినేత ముకేష్ అంబానీకి కోపమొచ్చింది. దాంతో అక్టోబర్ 26న జైపాల్‌రెడ్డిని ప్రభుత్వం పెట్రోలియం మంత్రిత్వ శాఖ నుండి మార్చేసింది. దీన్ని బట్టి దేశాన్ని ఎవరు పాలిస్తున్నారో సులువుగా అర్థమవుతుంది. గతంలో ముకేష్ అంబానీ తండ్రి ధీరూభాయి అంబానీ కోట్ల రూపాయల ఎక్సైజ్, రాబడి పన్నులను ఇందిరాగాంధీ సహకారంతో ఎగవేసిన సంగతి మర్చిపోలేం. రిలయన్స్‌కు అనుకూలంగా లేకపోవడం వల్లనే 2006లో అప్పటి పెట్రోలియం మంత్రి పదవి నుండి మణిశంకర్ అయ్యర్‌ను కూడా తొలగించారు.

నిపుణుల అంచనా ప్రకారం గ్యాస్ యూనిట్ ధర ఒక డాలరు వరకు ఉండవచ్చునని చెపుతున్నప్పుడే రిలయన్స్ 2.34 డాలర్లకు సరఫరా చేయగలనని బిడ్ వేసింది. అయినా ప్రభుత్వం యూనిట్ ధరను 4.20 డాలర్లుగా నిర్ణయించింది. గ్యాస్ లభ్యత తగ్గిపోయిందని, ఖర్చులు పెరిగిపోయాయనే నెపంతో ఇప్పుడు యూనిట్ ధర 14 డాలర్లు రిలయన్స్ డిమాండ్ చేసింది. గ్యాస్ ధరపై ప్రభుత్వం నియమించిన రంగరాజన్ కమిటీ అమెరికా, జపాన్, యూరోప్ మార్కెట్ ధరల సరాసరి ఆధారంగా యూనిట్ ధర 8 డాలర్ల వరకూ పెంచవచ్చుననే సిఫారసు చేసింది. కార్పొరేట్ సంస్థలకు దోచి పెట్టడానికి ప్రభుత్వంలోని అన్ని రంగాలూ పోటీ పడుతున్నాయనడానికి ఇవన్నీ నిదర్శనాలే.

రిలయన్స్ ఇండస్ట్రీస్ లాంటి అనేక కార్పొరేట్ సంస్థలు, బహుళజాతి కంపెనీలు నేడు మన ప్రభుత్వాల్ని శాసిస్తున్నాయి. తద్వారా లక్షల కోట్ల రూపాయల ప్రజల సొమ్మును కొల్లగొడుతున్నాయి. అభివృద్ధి పేరుతో బంగారు పంటలతో కోట్లాది మంది ప్రజల ఆహార అవసరాల్ని తీరుస్తున్న డెల్టా భూముల్ని సర్వనాశనం చేస్తున్నాయి. ప్రజల సమైక్య ఉద్యమాల ద్వారానే ఈ దుష్ట శక్తుల ఆగడాల్ని అరికట్టగలం.

*(రచయిత కార్మికోద్యమ నాయకులు)* వీ

# చీకటి నుంచి మరింత చీకట్లోకి

***ప్రభుత్వరంగంలోని విద్యుత్ సంస్థలను పని చేయకుండా చేసి, ప్రైవేట్ రంగానికి అప్పగించాలంటున్న ప్రపంచ బ్యాంక్ విధానాలను ప్రజలు అడ్డుకోవాలని అంటున్నారు* వి. హనుమంతరావు**

విద్యుత్ కొరత ఒకవైపు, ఆ విద్యుత్ ధర పెరుగుదల మరొక వైపు ప్రజల చెంపలు వాచిపోతున్నాయి. రాష్ట్రంలో ప్రతి జిల్లా కేంద్రంలో వేలాది మంది వినియోగదారులు ప్రదర్శనలు చేశారు. నినాదాలు చేశారు. ఘెరావ్‌లు చేశారు. దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలు చేశారు. కాంగ్రెస్ తప్ప అన్ని ప్రతిపక్ష పార్టీలు సమైక్యంగా ఈ ప్రదర్శనలకు నాయకత్వం వహించాయి. ఛార్జీల పెరుగుదల ప్రయత్నాలను విరమించాలన్నారు. మరింతగా ధర పెంచే ప్రతిపాదనలను డిస్కాంలు ప్రభుత్వం నియమించిన కమిటీ ముందుంచాయి. ఆ కమిటీ ఈ ప్రతిపాదలను అంగీకరిస్తే, ఇది వరకే వివిధ పేర్లతో పెంచిన ఛార్జీలు, వెయ్యబోయే ఛార్జీలు కలిపి మొత్తం రు. 33,000 కోట్లతో ప్రజల నడ్డి విరుగుతుంది. ఇవన్నీ ప్రతిపాదనలే, నిర్ణయించలేదు కదా అని ఆందోళనకారులను బుజ్జగించ ప్రయత్నిస్తోంది ప్రభుత్వం. కాని ప్రజలు డిస్కాంల ప్రతిపాదనలను స్వీకరించవద్దని కోరుతున్నారు. ఒకసారి నిర్ణయం చేసిన తర్వాత ఆందోళన ప్రారంభిస్తే ప్రభుత్వానికి ప్రెస్టీజ్ అడ్డు వస్తుంది. రాష్ట్రంలో యావన్మంది ప్రజలు వీధుల్లోకి రాకపోతే వీపు విమానం మోత మోగుతుంది. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొని ఏం ప్రయోజనం?

ఈ పరిస్థితి అన్ని రాష్ట్రాల్లోనూ, కేంద్రంలోనూ నెలకొని ఉంది. ఈ సంక్షోభం కేవలం రాష్ట్రాన్నే కాదు, కేంద్రం కూడా ఈ సమస్యనెలా పరిష్కరించాలా అని జుట్టు పీక్కొంటోంది.

ఈ విద్యుత్ కొరత ఈనాటిది కాదు. 1995లో 'వెలుతురు నుంచి చీకట్లోకి' అనే పేరుతో నేను రచించిన పుస్తకంలో (విద్యుచ్ఛక్తి మీద తెలుగులో రాసిన మొదటి పుస్తకం ఇదే. నార్ల తాతారావు ఈ పుస్తకాన్ని విడుదల చేసి ఇందులో వెలిబుచ్చిన అభిప్రాయాలతో తాను ఏకీభవిస్తున్నానని అన్నారు.) కేంద్ర విద్యుత్ సంస్థ 13వ విద్యుత్ సర్వే నివేదిక ప్రకారం రాష్ట్రంలోని అవసరాలతో పోలిస్తే విద్యుత్ సరఫరా 23.2 వంతులు తక్కువ కాగా, అది 1991-92 నాటికి 27.3 వంతులకు, 1994-95 నాటికి 37.1 వంతుకు పెరుగుతుందని అధికారిక అంచనాలే తెలియజేస్తున్నాయి. మన రాష్ట్ర ప్రభుత్వం చేతకాని దద్దమ్మా, కేంద్రం మాట ఏమిటని చూడబోతే ఎనిమిదవ ప్రణాళిక రచించే నాటికి దేశంలో 48 వేల మెగావాట్ల విద్యుచ్ఛక్తి కావాల్సి ఉంటుందని, అంత విద్యుదుత్పత్తి చేయడానికి కావాల్సిన ఆర్థిక వనరులు లేవని 38 వేల మెగావాట్ల లక్ష్యాన్ని నిర్ణయించారు. ఆ తర్వాత అది సాధ్యం కాదని 38 వేల మెగావాట్లకు కుదించి, అదీ సాధ్యం కాదని 28 వేల మెగావాట్లకు కుదించారు. ఇందులో ప్రైవేట్ రంగానికి 12 వేల మెగావాట్ల లక్ష్యంగా నిర్ణయించారు. 1995లో ఈ పుస్తకం రచించిన నాటికి బోణీ కూడా లేదు. కాగా మనం విద్యుచ్ఛక్తి కొరతతో దశాబ్దాలుగా కాపురం చేస్తున్నామని, ఆ కొరత తీర్చలేని అసమర్థ ప్రభుత్వం చేత మనం పాలించబడుతున్నామని అనుకోవాలి.

విద్యుచ్ఛక్తి గురించి మాట్లాడుకొనేటప్పుడు కొన్ని ప్రాథమిక విషయాలు తెలుసుకోవాలి. నూరు మెగావాట్ల విద్యుదుత్పాదన చేసే కేంద్రాన్ని ప్రారంభించితే మనకు వంద మెగావాట్ల విద్యుచ్ఛక్తి సరఫరా కాదు. ఉపయోగించే బొగ్గు నాణ్యత, లభ్యత, యంత్రాల సామర్థ్యం, లోపాలు తదితర కారణాలుంటాయి. నిధుల కొరత మరో కారణం. యంత్రాన్ని పనిచేయించడంలో ఇంజనీర్ల సామర్థ్య లోపం, నిధుల కొరత, ఆ కొరతలో సమకూర్చే నిధులు కూడా సకాలంలో విడుదల చేయక పోవడం. సాధారణంగా బ్యాంకుల నుంచో, విదేశాల నుంచో నిధులు అప్పు చేసి, సకాలంలో తీర్చలేకపోవడం, విద్యుదుత్పత్తి కేంద్రం నుంచి తీగల ద్వారా విద్యుత్ రవాణాలో కొంత విద్యుచ్ఛక్తి నష్టపోవడం, వ్యవసాయదారుల పంపుసెట్లకు ఉచితంగా గాని, తక్కువ ధరకు విద్యుత్ సరఫరా చేయాల్సి రావడం, దొంగ కనెక్షన్లు - ఇలా సవాలక్ష సమస్యలుంటాయి. ఇన్ని సమస్యలనెదుర్కొంటూ నార్ల తాతారావు రాష్ట్రం విద్యుత్ విషయంలో మిగులు రాష్ట్రంగా ఎలా సాధించారో. విద్యుత్ సరఫరాలో మరో కీలక సమస్య సాయంత్రం నుంచి రాత్రి వరకు విద్యుత్ వాడకం అత్యధికంగా ఉంటుంది (పీక్‌లోడ్). ఆ లోడ్‌ను తీర్చగలగడమే విద్యుచ్ఛక్తి లభ్యతకు గీటురాయి. మామూలు డిమాండ్ గగనం అయిపోతుందంటే పీక్ డిమాండ్ సంగతి వేరే చెప్పాలా. ఉదాహరణకు ఈ కింది పట్టిక చూడండి

| కాలం | లోటు (మె.గా) | లక్ష్యం | సాధన | శాతం |
|---|---|---|---|---|
| 9వ ప్రణాళిక ఆఖరు వరకూ | 10293 | 30538 (1) | 16423 | 53.8 |
| 2002-03 | 9945 | 40245 (2) | 19119 | 47.5 |
| 2003-04 | 9508 | 41110 (3) | 21180 | 51.5 |
| 2004-05 | 10254 | 1-8వ ప్రణాళిక | | |
| 2005-06 | 11468 | 2-9వ ప్రణాళిక | | |
| 2006-07 | 13897 | 3-10వ ప్రణాళిక | | |

హనుమంతుడి తోకలా లోటు పెరిగిపోతూనే ఉంది. కారణం వర్షాలు పడలేదని, బొగ్గు సరఫరా అస్తవ్యస్తంగా ఉందనే కుంటిసాకులు చెపుతుంది. కాని ప్రభుత్వమే తరచుగా ఉదహరించే సెంటర్ ఫర్ మానిటరింగ్ ఇండియన్ ఎకానమీ ఏమంటుందంటే యాజమాన్య లోటు, సమన్వయ లోటు అసలు కారణాలంటుంది. ఇంతకన్నా ముఖ్యమైనది విధాన మార్పు. తొమ్మిది ప్రణాళికల తర్వాత కూడా పరిష్కరించలేక చేతులెత్తేసి, విద్యుదుత్పత్తిని ప్రైవేట్‌పరం చేస్తే, తమకు తలనొప్పి తగ్గుతుందని చంద్రబాబు నిర్ణయించుకోవడమే. చాలా నష్టం వస్తుంది కాబట్టి, రైతులకు ఎక్కువ సబ్సిడీ ఇవ్వాల్సి రావడం వల్లనే ఈ నష్టం వస్తుందనే భావాన్ని రైతుల్లో, ప్రజల్లో కలగజేయడం ఆయన ఉద్దేశం. కాని అసలు కారణమేమంటే ప్రభుత్వం ఏ సేవలందించినా, వాటి మూల్యం లబ్ధిదారుల నుంచి పూర్తిగా వసూలు చేయాలని చంద్రబాబు ప్రభుత్వానికి రుణం ఇచ్చిన ప్రపంచబ్యాంక్ విధించిన షరతే. ఇది రాజకీయ నిర్ణయం. ఈరోజు వరకూ దాని ఫలితాన్ని మనమంతా అనుభవిస్తున్నాం. 20 కోట్ల ప్రజలు తమ తిండి గింజల కోసం దిగుమతుల మీద ఆధారపడకుండా స్వయం పోషకాన్ని సాధించి పెట్టిన రైతాంగానికి సబ్సిడీ ఇవ్వడానికి ఎందుకు గిజగిజలాడుతుంది ప్రభుత్వం? ప్రపంచబ్యాంక్‌ను ఏ దేశాలైతే పాలిస్తున్నాయో, ఆ దేశాల్లోని రైతాంగానికి సబ్సిడీలు ఇవ్వడం లేదా? అంత ధనవంతమైన దేశాల్లో సబ్సిడీలు ఇస్తుండగా మన పేద దేశంలో పేదలకు సబ్సిడీ ఇవ్వకూడదా? 'ప్రైవేట్ రంగమైతేనేమీ, ప్రభుత్వ రంగమైతేనేమీ మాకు కావాల్సింది విద్యుచ్ఛక్తి అని వాదించేవారు ప్రైవేట్ రంగానికి లాభాలు ముఖ్యం కాబట్టి అంతకంత యూనిట్ రేటు పెంచుతారు. భరిస్తారా?

నేడు ప్రభుత్వరంగం తీవ్ర విమర్శలకు గురవుతుంది. ఈ రంగంలో సంస్థలు సరిగా పనిచేయడం లేదు. కారణం ఈ సంస్థల మీద పెత్తనం కేంద్ర ప్రభుత్వ సెక్రటేరియట్‌లో ఉండే అధికార గణంలో విఫలమవు తున్నాయని సహకార సంస్థలను, పంచాయతీలను మూసేద్దామా? టీచర్లు సరిగ్గా పాఠాలు చెప్పడం లేదని పాఠశాలలు మూసేద్దామా? చట్టసభల్లో అసాంఘిక శక్తులు, హత్యా నేరస్తులు, మానభంగ కేసులున్న వారున్నారని చట్టసభలను మూసేద్దామా? ప్రభుత్వరంగ పరిశ్రమల్లో టెక్నాలజీ కీలక పాత్ర వహిస్తుంది. అలాంటి స్థానాల్లో ఐఎఎస్ అధికారులను నియమిస్తే ఆ పరిశ్రమలను మూసేయాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. వాస్తవానికి ప్రభుత్వరంగంలో పరిశ్రమలు ఏర్పాటులో సోషలిజమూ లేదు, చట్టుబండలూ లేవు. ఇనుము, ఉక్కు, విద్యుత్ లాంటి భారీగా పెట్టుబడులు పెట్టాల్సిన పరిశ్రమల్లో పెట్టుబడులు పెట్టే తాహతు ప్రైవేట్ రంగానికి లేదు. ఆ ఉత్పత్తులు లేనిదే పరిశ్రమలు స్థాపించలేరు. కాగా ప్రైవేట్ రంగం అవసరాలు తీర్చడానికే ప్రభుత్వ రంగం ఏర్పాటైంది. వారికి ప్రభుత్వరంగం ముడిసరుకులను చవగ్గా అందించింది. దిగుమతుల మీద పరిమితులు విధించింది. ప్రభుత్వరంగ పరిశ్రమల ఏర్పాటు ద్వారా పెట్టుబడిదారీ విధానానికి పునాదులు వేసింది. అలా పెరిగిన ప్రైవేట్ రంగం ఏరుదాటి తెప్ప తగలేసినట్లు, ప్రభుత్వ రంగం మీద విమర్శనాస్త్రాలు సంధిస్తోంది. దీనినే విశ్వాస ఘాతుకమంటారు.

తిరిగి విద్యుత్ రంగానికొస్తే బొగ్గు ముఖ్యావసరం. బొగ్గు కొరత ఏర్పడడానికి కారణం కోల్ ఇండియా, సింగరేణి బొగ్గు గనులు కావాల్సినంత బొగ్గు సరఫరా చేయలేకపోవడం కాదు. కోల్ ఇండియా వద్ద బొగ్గు గుట్టలు గుట్టలుగా పడి ఉన్నాయి. ఆ బొగ్గును కావాల్సిన వారు వచ్చి తీసుకొని వెళ్లవచ్చునని యాజమాన్యం అంటుంటే, లేదు, మీరే బొగ్గును మా కర్మాగారాల వద్ద డెలివరి చేయాలంటున్నారు. ఇది రైల్వే సమస్య. కాగా కోల్ ఇండియాను ఎందుకు విమర్శిస్తారు? ప్రైవేట్ సంస్థలకిచ్చినా బొగ్గు గనులు కొన్ని సందర్భాల్లో తవ్వకమే ప్రారంభం కాలేదు, లేదా పై పొరతవ్వి వదిలేస్తున్నారు, రియల్ ఎస్టేట్‌గా మలుచుకుంటున్నారు. సౌర విద్యుత్, పవన విద్యుత్ ప్రత్యామ్నాయ వనరులు కావచ్చు. ఇవి కొత్త ప్రత్యామ్నాయాలేమీ కావు. చాలా సంవత్సరాలుగా వాటి గురించిన ప్రచారం జరుగుతూనే ఉంది. కాని ఉత్పత్తి వ్యయం, యూనిట్ ఖరీదు హెచ్చుకావడంతో ఆ ప్రత్యామ్నాయాలు విస్తృతంగా వాడుకలోకి రావడం లేదు. ఈ రెండు ప్రత్యామ్నాయాలలో విశేషమేమిటంటే గాలికి, సూర్య రశ్మికి ఖరీదుల్లేవు. పుష్కలంగా లభిస్తాయి. ఉదాహరణకు, సూర్యుని నుంచి వచ్చే శక్తి రోజుకు 18 వేల మెగావాట్లు భూమి మీదకు ప్రసారమవుతుంది. ఒక అంచనా ప్రకారం ఒక గంట శక్తితో సమస్త భూమండలానికి ఒక ఏడాదికి కావాల్సిన ఇంధనావసరాలు తీరతాయి. పవన విద్యుత్‌కు కావాల్సిన టర్బయిన్లను తయారు చేసే ప్రపంచ సంస్థల్లో మూడో స్థానంలో ఉన్న సుజ్లాన్ కంపెనీ అధినేత ప్రకారం వచ్చే దశాబ్ద కాలంలో, బొగ్గు ఆధారిత విద్యుత్ సంస్థల్లో విద్యుదుత్పత్తి ఖరీదు ఎంత ఉందో, పవన విద్యుత్ ఖరీదు అంతే కాబోతుందని అంటున్నారు. (ఇప్పుడు పవన విద్యుత్ ఖరీదు ఎక్కువ).

విద్యుత్‌ను పొదుపుగా వాడడం గురించి దశాబ్దాలుగా చెప్పుకొంటూ వస్తున్నాం. ప్రతీ పరిశ్రమ కనీస అవసరం ఎంతో అంచనా వేసి, ఆ మేరకే ఆ పరిశ్రమకు విద్యుత్ సరఫరా చేసే పథకాన్ని తయారు చేస్తున్నారు. ట్రాన్స్‌మిషన్‌లో నష్టాన్ని 15 శాతానికి తగ్గిస్తారట. రవాణా రంగంలో సామర్థ్యాన్ని పెంచుతారట. లక్ష్యాలు బాగానే ఉన్నాయి. అయితే ఇవన్నీ 2020 నాటికి సాధ్యం చేస్తారట. ఈ చర్యలన్నీ కొత్తవి కావు. ఇదివరకటి నుంచి పునరుద్ఘాటిస్తున్నవే. మళ్లీ ఓసారి మమ అంటున్నారు. మన పరిపాలనా వ్యవస్థ ఎలా పనిచేస్తున్నదో అందరికీ తెలిసిన విషయమే. ప్రణాళికలు బాగానే కనిపిస్తాయి. ఆచరణే అసలు సమస్య.

ప్రభుత్వ అశక్తతను గమనించిన ప్రైవేట్ రంగం ఆఘమేఘాల మీద ఈ రంగంలోకి దూసుకువస్తోంది. ప్రభుత్వ నియమ నిబంధనల ప్రకారం 30 శాతం విద్యుత్‌ను ప్రైవేట్ సంస్థలు ప్రభుత్వానికి కేటాయించి మిగతా 70 శాతం విద్యుచ్ఛక్తిని తమ చిత్తం వచ్చిన ధరకు అమ్మి లాభాలు పోగేసుకోవచ్చు. అది వ్యాపారస్తుల లక్షణం. 1943లో బెంగాల్ కరువులో తిండిగింజలు బ్లాక్‌లో అమ్మడం వల్ల ప్రజలు కొనుక్కోలేక లక్షలాది మంది చనిపోలేదా? టాటా పవర్ కంపెనీ ఈ సంవత్సరంలో 750 మిలియన్ మెగావాట్ల విద్యుదుత్పత్తి చేస్తోంది. జివిస్‌డబ్ల్యూ సంస్థ 2007లో యూనిట్‌ను రు. 4.15కు అమ్మి 2010లో ఆరు రూపాయలకు పెంచింది. 800 మిలియన్ డాలర్ల పెట్టుబడితో నడుస్తున్న సంవత్సరంలో

650 మెగావాట్ల విద్యుదుత్పత్తి చేయనుంది. అదే సంస్థ హర్యానాలో రు.6000 కోట్ల పెట్టుబడితో 1200 మెగావాట్ల విద్యుదుత్పత్తి చేయనుంది. సీమెన్స్ అనే జర్మనీ సంస్థ గాలి మరల ద్వారా వచ్చే మూడేళ్లలో రు.1660 కోట్ల పెట్టుబడితో విద్యుదుత్పత్తి చేయనుంది. సోలార్ పవర్ విద్యుత్ కేంద్రాల నిర్మాణానికి రష్యా ఆసక్తి చూపింది. మన రాష్ట్రంలోనే కృష్ణపట్నం వద్ద సింగపూర్ సెంబ్ కార్ప్ సంస్థ రు. 6869 కోట్ల పెట్టుబడితో 1320 మెగావాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికి ఒప్పందం మీద సంతకాలు జరిగాయి. విద్యుదుత్పత్తిలోనే కాదు, విద్యుత్ ప్రసారా వ్యవస్థలో కూడా ప్రైవేట్ రంగాన్ని ఆహ్వానించడానికి కేంద్రం పావులు కదుపుతోంది. థర్మల్ విద్యుదుత్పత్తికి కావాల్సిన బొగ్గు కూడా విదేశాల నుంచి దిగుమతి చేసుకోవాల్సి వస్తూంది. కొన్ని ప్రైవేట్ సంస్థలు విదేశాల్లో గనులనే కొనేశారు. ఈ రంగంలో నూటికి నూరు శాతం విదేశీ పెట్టుబడులను ఆహ్వానిస్తూ ప్రభుత్వం ప్రకటించింది.

పై వివరణ మనకు తెలియచేసేదేమిటి? విద్యుదుత్పత్తి రంగంలో కేంద్రం చేతులెత్తేసింది. విద్యుదుత్పత్తి కేంద్రం నెలకొల్పడానికి, నిధుల కోసం, అందుకు కావాల్సిన బొగ్గు కోసం, ఉత్పత్తి చేసిన విద్యుత్‌ను ప్రసారం కోసం ప్రైవేట్‌రంగం మీద, విదేశీ సంస్థల మీద ఆధారపడాల్సిన పరిస్థితి ఏర్పడింది. దీనినే మర్చంట్ పవర్ విధానమంటారు. ప్రణాళిక లక్ష్యాలు కాగితాలకే పరిమితమయ్యాయి. ప్రభుత్వ, ప్రైవేట్ రంగాలు కలిసి కూడా పదవ ప్రణాళిక లక్ష్యాన్ని 78000 మెగావాట్ల లక్ష్యాన్ని సాధించే ప్రశ్నేలేదు. ప్రభుత్వానికి చేతకానపుడు ప్రైవేట్ రంగం ప్రవేశిస్తే తప్పేమిటి? విద్యుదుత్పత్తి వెనుకపట్టు పడితే, దేశాభివృద్ధే దెబ్బతింటుంది. కాగా ఎవరు ఉత్పత్తి చేస్తేనేమి, మనకు విద్యుచ్ఛక్తి కావాలి. అందుచేత ప్రైవేట్ రంగాన్ని ఆడిపోసుకోనక్కర్లేదు అని వాదించే వారు చాలా మంది ఉన్నారు. కాని పైనే చెప్పుకున్నట్లు, ప్రైవేట్ రంగం లక్ష్యం లాభాలు, మరిన్ని లాభాలు కాబట్టి. విద్యుత్‌కు పెరుగుతున్న డిమాండ్‌ను ప్రభుత్వ రంగం తీర్చలేకపోవడంతో ఏర్పడిన కొరతను అవకాశంగా తీసుకొని విద్యుత్ యూనిట్ ధరను పెంచుతారు. అలా పెంచిన రేట్లను పారిశ్రామిక వేత్తలు వారి ఉత్పత్తుల ధరలను పెంచి కొనుగోలుదార్ల మీదకు బదలాయిస్తారు. రైతాంగానికి అలాంటి వెసులుబాటు లేదు. ఖర్చు పెరుగుతుంది. ఆ బరువును దించుకోనూ లేరు, ప్రజల మీదకు బదలాయించనూ లేరు. ఈ పెరుగుదలను మధ్యతరగతి మోయాల్సి వస్తుంది. భరించగలరా? ధరలు పెరిగితే ద్రవ్యోల్బణం పెరుగుతుంది. ప్రభుత్వం సబ్సిడీ ఇవ్వవచ్చు. కాని ఆ సబ్సిడీ చెల్లించడానికి ప్రభుత్వం దొడ్లో డబ్బుల చెట్లు కాయవు. మనం అంతా చెల్లించిన పన్నుల ద్వారా వసూలైన సొమ్ము నుంచే ఖర్చు చేయాలి. లేకపోతే అప్పు చేయాలి. చెప్పొచ్చేదేమంటే మనం వాడే విద్యుత్‌కు ఎక్కువ ఛార్జీలు చెల్లించాల్సి వస్తుంది. ప్రైవేటీకరణతో ఆ ఛార్జీలు మరింత పెరుగుతాయి. అంతేకాదు, 11వ ప్రణాళిక మధ్యంతర సమీక్షలో విద్యుదుత్పత్తి లక్ష్యాన్ని 78 వేల మెగావాట్ల నుంచి 62,374 మెగావాట్లకు కుదించారు. అది కూడా అసాధ్యమని గత ప్రణాళికల చరిత్ర చెబుతోంది. అంటే యూనిట్ ధర పెరగడమే కాదు, ఆ యూనిట్ కూడా లభ్యమయ్యే గ్యారంటీ లేదు. ఈ లెక్కన '2012 నాటికి అందరికీ విద్యుచ్ఛక్తి' అనే ప్రధాని హామీ ఒట్టి డబ్బామోతే.

ఇక మన రాష్ట్రానికి వస్తే కేంద్రం అనే తానులో ఆంధ్రప్రదేశ్ ఒక ముక్క అయినప్పుడు, రాష్ట్రంలో విధానం, అమలు మరోలా ఎలా ఉంటుంది? 11వ ప్రణాళికలో కేంద్రం 78 వేల మెగావాట్ల ఉత్పత్తి చేస్తానని ఎలా కలలు కంటుందో, రాష్ట్ర ముఖ్యమంత్రి కూడా ఆంధ్రప్రదేశ్‌ను ఒక పవర్‌హబ్‌గా తీర్చిదిద్దుతామని మనలను నమ్మ మంటున్నారు. గత దశాబ్దకాలంపైగా ముఖ్యమంత్రులు మారారు గాని, విద్యుత్‌రంగం తలరాత మారలేదు. ఉచిత విద్యుత్ అనే పాట పాతదై పోయింది. తొమ్మిది గంటలు సరఫరా మాట అలా ఉంచి రైతాంగానికి ఏడు గంటల సరఫరా కూడా గ్యారంటీ లేదు. హైదరాబాద్‌లో అధికారికంగా కోతలేదు గానీ రోజుకు అయిదారు సార్లు బ్లాకవుట్. అధికారులను భూపాలపల్లి ప్రాజెక్టు గురించి అడిగితే అది రెడీ అయిందన్నారు. ముఖ్యమంత్రి గుచ్చి గుచ్చి అడిగితే నెల రోజుల్లో విద్యుదుత్పత్తి ప్రారంభిస్తుందన్నారు. నీటిపారుదల ప్రాజెక్టుల గురించి కూడా అధికారుల జవాబులిలాగే ఉంటాయి. ప్రాజెక్టు నిర్మాణం పూర్తి అయిపోయిందని నీటిపారుదల శాఖ అధికారులంటారు. ఇన్ని వేల హెక్టార్లకు నీరందుతుందంటారు. కాని వ్యవసాయ శాఖనడిగితే, ప్రాజెక్టుల నిర్మాణం పూర్తి అయినంత మాత్రాన నీరు పొలాలకు చేరదు కదా అంటారు. అలాగే విద్యుత్ శాఖ కూడా స్థాపిత శక్తి ఎంత ఉందో, అంతా అందుబాటులోకి వచ్చినట్లు చాటింపు చేస్తుంది. కాని ప్రాజెక్టు నిర్మాణం పూర్తికావడం లేదు. విద్యుచ్ఛక్తి ప్రసారం, పంపిణీ వేరు. ఎపిజెన్‌కో ప్రస్తుత స్థాపిత శక్తి 8089 మెగావాట్లను 12వ ప్రణాళిక ఆఖరు నాటికి రెట్టింపు చేస్తానంటోంది. నిర్మాణంలో ఉన్న పది ప్రాజెక్టులు 2013 నాటికి పూర్తి అవుతాయని ప్రభుత్వం ప్రకటించింది. గ్యాస్ ఆధారిత జేగురుపాడు, గౌతమీ ప్రైవేట్‌రంగంలో పనిచేస్తున్నాయి. కాని గ్యాస్ సరఫరా ప్రస్తుత అనిశ్చిత పరిస్థితుల్లో ఏమవుతుందో చెప్పలేం. ముఖ్యమంత్రి ఇటీవల తరచుగా విద్యుదుత్పత్తి గురించి చేస్తున్న ప్రకటనలు ఒకో ప్రకటనలో ఒకోరకంగా ఉంటున్నాయి. ఇన్ని ప్రాజెక్టులు, ఇన్ని వేల మెగావాట్ల విద్యుదుత్పత్తి చేస్తుంటే, చేయబోతుంటే యాజమాన్య పద్ధతులను సరిగా అవలంబిస్తే, లక్షిత తేదీలను నిర్మాణంలో ఉన్న ప్రాజెక్టులను పూర్తి చేయగలిగితే, అదే పదివేలు. ఇది ప్రస్తుత పరిస్థితి. కాని వచ్చే అయిదేళ్లలో కొత్తగా ప్రకటించిన 2010-15 పారిశ్రామిక విధాన ప్రకటన చూస్తే డజన్ల కొలది పరిశ్రమలు రాబోతున్నాయి. వాటి విద్యుత్ అవసరాల మాటేమిటి? పరిశ్రమలకు కావాల్సిన మౌలిక సౌకర్యాలలో విద్యుత్ సరఫరాదే ప్రథమ స్థానం. కొత్త పాలసీతోపాటు వచ్చే అయిదేళ్లలో విద్యుదుత్పత్తి గురించిన విధాన ప్రకటన, టైం టేబుల్ ప్రకటన రాబోయే పారిశ్రామికవేత్తలకు భరోసా కలుగుతుంది. ప్రభుత్వ యంత్రాంగంలో బాధ్యతల పంపిణీయేగాని, జవాబుదారీతనం లేదు. లక్ష్యాలను సాధించలేకపోవడానికి యాజమాన్య లోపమే ముఖ్య కారణమని పలు నివేదికలు, అధ్యయనాలు తేల్చి చెప్పాయి. మనకు మరో తాతారావు రావాలి, కావాలి.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

# పవర్ యాత్రా - బుద్ధ యాత్రా

***చరిత్రలో ప్రజలను మేల్కొల్పడానికి చేసిన పాదయాత్రలనూ, ఇప్పడు అధికారం కోసం చేస్తున్న పాదయాత్రల తీరునూ వివరిస్తున్నారు* డా. పులుగుజ్జు సురేష్**

పాదయాత్రల శకం నడుస్తున్నది. పోటాపోటీగా జరుగుతున్న యాత్రలు ప్రజల్ని ఆకర్షించి తమ పార్టీలవైపు మళ్లించుకోవడానికి రాజకీయపార్టీల అధినాయకత్వ గణాలు సకల ప్రయత్నాలు చేస్తున్నారు. పాదయాత్రలు పార్టీలను పవర్ కుర్చీ మీద కూర్చోబెట్టే సాధనంగా భావించడం వలన పాదయాత్రలకు ప్రాధాన్యత పెరిగింది. పేర్లు వేరయినా యాత్రల లక్ష్యం ముఖ్యమంత్రి సీటేనని ప్రజలకు స్పష్టంగా అర్థమవుతున్నది. వస్తున్నా మీకోసం అంటూ చంద్రబాబు పాదయాత్ర చేపట్టిన రోజు రాజకీయాలకు సంబంధం లేకుండా, నా పాదయాత్ర సాగుతుంది. రాష్ట్రంలో కాంగ్రెస్ పాలనలో చీకటి అలముకుంది. ఆ చీకటి పారదోలడానికి ప్రజల్ని చైతన్యం చేయడానికి, ప్రజలు పడుతున్న బాధలు అర్థం చేసుకోవడానికే ఈ యాత్ర చేపట్టిన, రాజకీయాలకు ముడిపెట్టొద్దని, రాజకీయం చేయొద్దని మాజీ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు తెలిపితే, నేను రాజశేఖరరెడ్డి పాదాన్ని, జగనన్న వదిలిన బాణాన్ని, కాంగ్రెస్ పార్టీ వైఫల్యాలను ఎండగట్టడం, అవినీతి ప్రభుత్వాన్ని దించకుండా అవిశ్వాస తీర్మానం ఎందుకు పెట్టడంలేదో ప్రజలకు తెలియ చెప్పడమే తన యాత్ర ప్రధాన ఉద్దేశమని షర్మిలారెడ్డి ప్రస్తావించారు. ఇడుపులపాయ ఎస్టేట్‌ను భూతల స్వర్గంగా చిత్రీకరిస్తూ, జగన్‌రెడ్డి దారిద్ర్య విమోచకుడుగా, పుట్టిన కారణ జన్ముడుగా ప్రచారం చేస్తున్నారు.

రాష్ట్రమంతటా రాజకీయ నాయకుల ప్రచారహోరులో కొట్టుకు పోతున్నది. ఎనిమిది కోట్ల ప్రజలను రాజకీయ పార్టీలకు శ్రోతలుగా మార్చుకున్నారు. ఓదార్పు యాత్ర పేరుతో వచ్చిన జగన్మోహన్‌రెడ్డి రెడ్డియిజాన్ని చాటి చెప్పారు. మంది మార్బలంతో గ్రామాలు తిరిగి 3300 రాజశేఖరరెడ్డి విగ్రహాలు ప్రతిష్టించారు. రాబోవు రెండు దశాబ్దాలకు మేమే పాలకులుగా నిలుస్తామనే సంకేతాలు ప్రజల మస్తిష్కంలో చొప్పించారు. కాబట్టే తను ఏర్పాటు చేసుకున్న వై.ఎస్.ఆర్. కాంగ్రెస్ పార్టీ (యువజన శ్రామిక రైతు కాంగ్రెస్ పార్టీ) కోటరీలో సింహభాగం తన సామాజిక వర్గంవారే ప్రతినిధులుగా ఉన్నారు. 2009లో రాజశేఖరరెడ్డి ప్రజాప్రస్థానం పాదయాత్ర చేసినపుడు రెండు అంశాలను ప్రధానంగా పరిశీలించినట్టుగా ఉన్నారు. ప్రజల బలహీనతలు లేదా ప్రజలు ఆకర్షించే పథకాలు ఉచిత విద్యుత్తు, రెండు రూపాయల బియ్యం ప్రవేశపెట్టి ఆ నష్టం పూడ్చడానికి మద్యం ఏరులా పారించి రాష్ట్రాన్ని మద్యాంధ్రప్రదేశ్‌గా మార్చారు. అసంఖ్యాక పేదల ఇంటి దీపాలు ఆర్పి వేయగలిగారు. ఆరోగ్యశ్రీ పేరుతో 1000 కోట్ల రూపాయలు కార్పొరేట్ ఆస్పత్రుల కిచ్చి, ప్రైవేటు వైద్యం ప్రోత్సహించి, ప్రభుత్వం వైద్య బాధ్యత నుండి తప్పించుకున్నది. ఫీజు రీయంబర్స్‌మెంట్ పేరుతో కమ్మ, రెడ్డి కళాశాలలను నిలబెడుతూనే తమ సామాజిక వర్గం వారే ఇంజనీరింగ్, ఆపై చదువులు చదవడానికి ప్రోత్సహించారు. ఏ పథకంలోనైనా వీసమెత్తు పేదలు మచ్చుకైనా కొందరు లబ్ది పొందిన మాటను విస్మరించలేం. కానీ అత్యధిక భాగం అగ్రకుల ధనవంతులకే ఆయన ఆలోచనలు తోడ్పడ్డాయి. వారు ప్రవేశపెట్టిన పథకాలు దీర్ఘకాలిక రాష్ట్ర మౌలికాభివృద్ధిని వ్యతిరేక దిశలో నడిపించిన సత్యంకు ముసుగు కప్పారు. రెండవ అంశం వనరులపై దృష్టిపెట్టారు. నెల్లూరు జిల్లా తడ నుంచి శ్రీకాకుళం జిల్లా ఇచ్ఛాపురం వరకు గల కోస్టల్ కారిడార్‌ను తమ అనుచరులకు అప్పగించి వేలాది కోట్లు తన కుమారుడు జగన్మోహన్‌రెడ్డి ఖాతాలో జమా చేశారు. రాష్ట్ర ప్రజలకు చెందాల్సిన జాతి సంపదను తనవారికి దోచిపెట్టినా ఆయన దేవుడిలా ప్రజల హృదయాల్లో నిలబెట్టి మరోసారి అధికారం దక్కించుకోవడానికి ఆ సామాజిక వర్గం కృషి చేస్తోంది. రాజశేఖరరెడ్డి తన సతీమణి విజయారెడ్డి, అల్లుడు అనిల్, కూతురు షర్మిలారెడ్డి, కొడుకు జగన్మోహన్ రెడ్డి, కోడలు భారతిరెడ్డిలు క్రైస్తవులుగా చర్చికి పోతారు. కాబట్టి రాష్ట్రంలోని దళిత క్రైస్తవులలో అధిక సంఖ్యాకులను తమ ఓటర్లుగా మార్చుకున్నారు. కానీ వారు అగ్రకుల క్రైస్తవులని దళిత క్రైస్తవులు గుర్తెరగకున్నారు. రాజశేఖరరెడ్డి ముఖ్యమంత్రి సీటును అధిరోహించగా పదవులు, భూములు, పరిశ్రమలు, ఉద్యోగాల్లో పదోన్నతులు అన్ని తమ సామాజిక వర్గం వారి ప్రయోజనాలనే కాపాడారు. క్రైస్తవంలో పాలకులు, పూజారులు అగ్రకులంవారు. ప్రతినిధులు దళితులు. చర్చిలు రెడ్డి చర్చి, కమ్మచర్చి, మాదిగ చర్చి, మాల చర్చిలు స్పష్టంగా వేరువేరుగా ఉన్నాయి. ఈ లోకం మనది కాదు ఆకాశం కింద భూమి మీద ఏమి చేసినా వ్యర్థమేనని దళిత క్రైస్తవులను ఆర్థికంగా ఎదగకుండా చేస్తూ మరోవైపు ఖమ్మం జిల్లాలో 1.50 లక్షల ఎకరాల భూమిని రాజశేఖరరెడ్డి అల్లుడు అనిల్‌కి కట్టబెట్టారు. కనీసం 20 లక్షల కోట్ల రూపాయల విలువైన ఖనిజ సంపద అక్కడ నిక్షిప్తమై ఉన్నది. మతం ముసుగులో సాగుతున్న వివక్ష. ప్రపంచ క్రైస్తవులందరూ ఆర్థికంగా ముందంజలో ఉంటే భారతీయ దళిత క్రైస్తవులు దారిద్ర్యంలో మగ్గిపోవడానికి కారణమయింది. ఏసుక్రీస్తు పాదయాత్ర చేసినపుడు కుంటివారిని, గుడ్డివారిని, కుష్ఠురోగులను స్వస్థత పరుస్తూ సేవచేశాడు. ఏ గుప్త బానిసల విముక్తి మోసే పాదయాత్ర దోహద పడింది. బైబిల్ చేతపట్టుకొని నడుస్తున్న విజయారెడ్డి, షర్మిలారెడ్డిల పాదయాత్రలు మంది మార్బలం వెంటబెట్టుకొని రాజకీయ ప్రసంగాలు చేస్తూ తన అన్న జగన్మోహన్‌రెడ్డిని 2014లో ముఖ్యమంత్రిని చేయడమే ప్రధాన ఎజెండా అయింది.

పాదయాత్రలంటే పవర్ కోసమేనన్న సంకేతాలు ఇస్తున్నట్లు కనబడుతున్నది. అధికార దాహం ఏదైనా చేపిస్తుందని చరిత్ర రుజువు చేసింది. భారతదేశ చరిత్రలో మగధరాజయిన బింబిసారుడి కుమారుడు అజాత శత్రువు తన తండ్రికి అన్న పానీయాలు అందకుండా చేసి, కఠినంగా శిక్షించి జైల్లో పెడుతాడు. రాజ్యపాలన కోసం తన తండ్రిని చిత్రహింసలకు గురిచేస్తాడు. రాజ్యం కోసం తన అక్కనైనా, అన్ననైనా, ఎవరినైనా చంపడానికి వెనుకాడకపోవడం రాజనీతియని కౌటిల్యుడు అభివర్ణిస్తాడు. అజాత శత్రువు, కౌటిల్యుడుల మూల సూత్రాలను పుణికిపుచ్చుకున్న జగన్మోహన్‌రెడ్డి రాష్ట్ర ముఖ్యమంత్రి పీఠం ఎక్కేదాకా రాష్ట్రం శాంతిగా ఉండే పరిస్థితి కనబడడం లేదు. ఏదో ఒకటి చేస్తున్నట్టు నిత్యం వార్తల్లో కనబడడమే నాయకుడి లక్షణమని తెలంగాణ అంశం భుజానికెత్తుకున్న కె.సి.ఆర్. (కల్వకుంట్ల చంద్రశేఖర్ రావు) తెలంగాణ సాధన పేరుతో రాజీనామాలు చేయడం, శాసనసభ సీట్లు పెంచుకొని తనబలం పెంచుకోవడానికి ప్రయత్నం చేస్తున్నాడు. కె.సి.ఆర్. రాజకీయ బలం పెంచుకుంటుంటే తెలంగాణలో విద్యార్థులు, దళితులు, పేద వర్గాలు బలవుతున్నారు. వారి పోరాటం సమరశీల యుద్ధాన్ని తలపిస్తున్నది. రాజన్న రాజ్యం తెస్తామని ఆకర్ష్ పథకం ప్రవేశపెట్టిన జగన్‌రెడ్డి తన తండ్రి అనుచరులు, తన సామాజిక వర్గం వారిపై బాణం ఎక్కుపెట్టారు. ఆయన కూడా రాష్ట్ర వ్యాప్తంగా తనబలం విస్తరించడానికి చేయని ప్రయత్నం లేదు. వీరిద్దరూ ఎన్నికల చుట్టూ రాజకీయం తిప్పుతున్నారు. అధికారంలో ముఖ్యమంత్రి సీటుపై కూర్చున్న కిరణ్‌కుమార్‌రెడ్డి ఇందిరమ్మ బాట పేరుతో జిల్లాల పర్యటన చేస్తున్నాడు. కనీసం తన సీటును 2014 వరకైనా కాపాడుకుందామనే తపన ఆయనది. మేం పుట్టింది ప్రజల కోసమేనంటూ కమ్యూనిస్టు పార్టీలు తమ ఉనికి కోసం చేసే పోరాట రూపాల వల్ల ప్రజలకు ఒనగూరు తున్నదేమీ లేదు. రాజకీయ పార్టీల అధినేతల పర్యటన ప్రాంతంలో మద్యం విక్రయాలు మూడింతలు పెరుగుతున్నాయి. ఉబ్బిచ్చి, ఆశలు చూపి, వాహనాలలో ప్రజల్ని తరలిస్తున్నారు. ఒకరిపై మరొకరు విరుచుకు పడుతున్నారు. ప్రజలకు మేలు చేస్తామని దానధర్మాల రూపంలో ప్రసంగాలు సాగుతున్నాయి. చంద్రబాబు చెప్పులు కుడితే, షర్మిలారెడ్డి వరిగడ్డి పట్టుకుంటుంది. కిరణ్‌రెడ్డి గొర్రెనెత్తుకుంటున్నాడు. ప్రజలపైన వల్లమాలిన ప్రేమ చూపిస్తున్నారు. దేని కోసం ఒకసారి చరిత్ర పుటలను తిరిగేస్తే పాదయాత్రల నిజస్వరూపం, నాటి లక్ష్యం నేటి ప్రభువుల తాపత్రయం ఏమిటో అర్థంచేసుకోవచ్చు. ఈ భరతఖండంలో పాదయాత్ర లకు ఆద్యుడు గౌతమ బుద్ధుడు. ప్రపంచమంతా వర్గ రూపంలో బానిస సమాజం ఏర్పడితే, భారతదేశంలో వర్ణ సూత్రాల ఆధారంగా బానిస వ్యవస్థ పురుడు పోసుకున్నది. కాబట్టి ఈ దేశంలో దారిద్ర్య నిర్మూలన, అంటరానితనం రూపుమాపడం సంక్లిష్టమైనది. దాన ధర్మాలు అవసరం లేదు. అసమానతల మూలాలను నాశనం చేసేదాక సమతా, మమతల రాజ్యం ఏర్పడిందని, కారణమైన వైదిక ధర్మాలు, పురాణాలు, ఇతిహాసా లను ఎండగడుతూ తన పాదయాత్రను సాగించిండు బుద్ధుడు. తన కూతురు సంఘమిత్ర కుమారుడు రాహులను సమతా రాజ్య స్థాపనకు దేశాంతరాలకు పంపిన త్యాగధనుడు బుద్ధుడు. క్రీ.పూ. 540 సంవత్సరం నుండి ఆయన పర్యటనలు విశ్వ వ్యాపితం చేసిన ఒక గొప్ప మానవతా వాది బుద్ధుడు. బుద్ధుడి ఆశయ సాధనే లక్ష్యం చేసుకున్న అశోక చక్రవర్తి రాజ్యం వదిలి తన సామ్రాజ్యమంతటా బుద్ధ దమ్మంను ప్రచారం చేశాడు. అశోకుడు చెట్లు నాటించెనన్న అభిప్రాయాన్ని కలిగించారుగానీ ఆయన చేసిన, నిలబెట్టిన తాత్విక పునాదిని చీకటిలోకి నెట్టబడింది. చెట్లు నాటించిన అశోకుడు తప్ప బుద్ధుడు చెప్పిన అహింసా, శాంతి, సమతల కోసం కృషిచేసిన ఉన్నత వ్యక్తిగా ప్రజలకు పరిచయం కాలేదు. చరిత్ర వక్రీకరించబడింది. బుద్ధుడిని కూడా అవతారాలలో ఒకడిగా పూజింపజేసే విధంగా హిందూయిజం ప్రయత్నాలు చేస్తోంది. బుద్ధుడి బోధనలు చిరస్థాయిగా నిలబడాలని ఆశించిన అశోకుడు దేశవ్యాప్తంగా 84000 స్థూపాలను ప్రతిష్టించారు. బుద్ధుడి ధమ్మంను స్థూపాలపై చెక్కించిన ఆదర్శవంతుడు అశోకుడు. జీవహింస నేరమని చట్టం చేసి ప్రజల్లోకి తీసుకెళ్లాడు అశోకుడు. ప్రచారం అత్యధిక భాగం పాదయాత్రతోనే సాగింది. క్రీ.శ 1450వ సంవత్సరంలో సంత్ రవిదాస్ భక్తి ఉద్యమం చేశాడు. ఉత్తర భారతదేశమంతటా పర్యటించాడు. జన్మ జాతులను ఎంచుకోలేదు. కులం లేదు ప్రాంతం , రవిదాసు ప్రియ ప్రభువు పుత్తులే అందరూ, లేదు కుల వ్యత్యాసం; 'గుణంలేని బ్రాహ్మణుడి కన్నా, గుణవంతుడైన చండాలుడు మిన్న' అని సంత్ రవిదాసు ఊరూరా, గడప గడప ప్రచారం చేశాడు. ఉత్తర భారతదేశమంతటా పాదయాత్ర చేస్తున్న రవిదాసుకి రాజులు, మహరాణులు శిష్యులుగా మారిపోయారు. సంత్ రవిదాసు చెప్పులు కుట్టుకుంటూ గుడిసెల్లో జీవిస్తున్న తమ గురువుకు రాజసౌధంలో విలాసవంతమైన జీవితం అందించుటకు పూనుకుంటాడు. సంత్ రవిదాస్ సున్నితంగానే తిరస్కరిస్తాడు. ఆయన ఉద్యమం గుడిసె నుండే కొనసాగిస్తాడు. కాబట్టి సమాజంలో మౌలిక మార్పు జరగాలంటే నాయకత్వం శ్రమజీవుల నుండి పుట్టుకు రావాలన్న కార్ల్ మార్క్స్ మాటలు సంత్ రవిదాస్, డా. బాబాసాహెబ్ అంబేద్కర్, కాన్సీరాంల వంటి త్యాగధనుల్లో కనబడుతుంది. మంత్రి పదవులను సైతం లెక్కచేయకుండా తమ జాతి, దేశ ప్రయోజనాల పక్షాన వ్యాజ్యమాడిన భారతరత్న, ప్రపంచమేధావి డా. బాబా సాహెబ్ అంబేద్కర్ కనిపిస్తాడు. 1927వ సంవత్సరంలో వేలాది మందిని వెంటపెట్టుకొని మంచి నీళ్లకోసం మహద్ చెరువును ముట్టడించాడు. నీటి కోసం చేసిన పాదయాత్ర బ్రిటిషువారి కళ్లు తెరిపించుటకు దోహదపడింది. భూమి కొందరి ఆస్తిగా నిలబడ్డ స్థితిలో మార్పు తీసుకురావాలనుకున్న వినోబా భావే భూదానోద్యమం చేపట్టారు. సుమారు 11 లక్షల ఎకరాల భూమి భూస్వాముల నుండి తీసుకున్న వినోబా భావే లక్షలాది మంది భూమి లేని నిరుపేదలకు పంచి ఇచ్చారు. నేటి నాయకులు భూదానం మరిచారు. భూదాహంతో రియల్ ఎస్టేట్ వ్యాపారంలో అడ్డొచ్చిన వారిని హత్య చేయడానికి కూడా వెనుకాడడం లేదు. ప్రాజెక్టులు, పరిశ్రమలు, సెజ్‌ల పేరుతో పేదలను, దళితులను, వెనుకబడిన వారిని భూమికి దూరం చేస్తున్నారు. నగరాలలో సుందరీకరణ వంటి ప్రత్యేక ప్యాకేజీలతో సామాన్య ప్రజల్ని వారి నివాసాలను తొలగిస్తున్నారు. లక్షలాది పేర్లతో కైవసం చేసుకోవడమో జరుగుతున్నది. దళితులకిచ్చిన డి. నమూనా పట్టా భూములు కూడా రికార్డులు తారుమారు చేసి రియల్ ఎస్టేట్ దందా నడపబడుతున్నది. ప్రభుత్వం నియమ నిబంధనలు పాటించగలిగితే కొంతయిన పేదలకు న్యాయం జరుగుతుందన్న ఆశ

మిగులుతుంది. అమెరికాలో తమ ఓటు హక్కును వినియోగించుకోడానికి మార్టిన్ లూథర్‌కింగ్ మెమోరియల్ హాల్‌కు వెళ్లిన అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా ఎన్నికల సిబ్బంది గుర్తింపు కార్డును చూపించాలని కోరినపుడు అధ్యక్షుడి హోదాలో ఆయన గుర్తింపు కార్డును చూపిన తరువాతనే ఓటు వినియోగించుకొనుటకు అనుమతినిచ్చారు. ఇదే అక్టోబర్ మాసంలో హైదరాబాద్ నగరంలో ప్రపంచ జీవ వైవిధ్య సదస్సు అక్టోబర్ 6-19 తేదీలలో జరిగింది. జీవి వైవిధ్య సదస్సుకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి వెళ్లారు. అక్కడ ఉన్న ఐక్యరాజ్యసమితి నుంచి వచ్చిన ఉన్నత భద్రత సిబ్బంది గేటు పాసు లేనిదే వారిని అనుమతించలేదు. పాసు ఉన్న వారికే లోపలికి అనుమతించాలనేది సదస్సు నిబంధన. ముఖ్యమంత్రి ఉల్లంఘించడం ఎంత నిర్లక్ష్యం, ఎంత పరాభవం. మనం రూపొందించుకున్న నియమాలు ప్రజలకుగానీ పాలకులకు కాదు అన్నట్టు వ్యవహరించడం, నియమ నిబంధనలు ఉల్లంఘించడం, రాజకీయాలకు ముడిపెట్టడం వల్ల అనేక సమస్యలు తలెత్తుతున్నాయి.

నేడు జరుగుతున్న యాత్రలు ప్రజల్ని రెచ్చగొడుతున్నాయి. ప్రజలు పేదరికంలో మగ్గుతున్నారని, అందరికీ కార్పొరేట్ వైద్యం అందించాలని, ఉన్నత విద్యనందించాలని, మంచి ఉద్యోగ అవకాశాలు కల్పించాలని ఇది రాజశేఖరరెడ్డి కలలుగన్నట్టు షర్మిలారెడ్డిగారు పదేపదే మైకు బద్దలు కొడుతున్నారు. అదే విధంగా ఆంధ్రోళ్లు తెలంగాణను దోచుకుంటున్నారని, పదవుల్లో, అధికారాల్లో మాకు రావలసిన వాటా రావట్లేదని కె.సి.ఆర్. తమ అనుచరులు ఊకదంపుడు ఉపన్యాసాలు ఇస్తున్నారు. షర్మిలారెడ్డి ఇడుపులపాయ ప్రాజెక్టును గానీ, వారికున్న కళాశాలలు, కంపెనీలు, పరిశ్రమలు, భూమి, మెట్రో నగరాల్లో వందల ఎకరాల్లో ఉన్న నివాసాలు కోట్లాది మంది దళితులు, గిరిజనులు, వెనుకబడిన వర్గాల పిల్లలకు, తల్లులకు, కాళ్లకు చెప్పులు లేక ఎర్రని ఎండల్లో ప్రతిరోజు కనీసం 20 కిలో మీటర్లు తగ్గకుండా ప్రతిరోజు పాదయాత్ర చేస్తున్నారు. అంతర్జాతీయ బ్రాండ్ల బూట్లు ధరించి, వేలాది రూపాయాల ఖరీదు చేసే వస్త్రాలు, తల్లి బిడ్డ ఒకే కలర్ కాంబినేషన్ దుస్తులు ధరించి రాజకీయ ఉనికి కోసం వీరు నడుస్తున్నది 8-10 కిలో మీటర్లు. దళిత స్త్రీలు, కట్టెల మోపుకు 10 కిలో మీటర్లు, వ్యవసాయ కూలీకి 10 కిలో మీటర్లు, ఇంట్లో పనులు, వంట, ఎన్ని పనులు చేస్తున్నారో అనుభవిస్తేనే తెలుస్తుంది. ఇది వేరు శెనగ అదును నలుగురు ప్రయాణించే ఆటోలో 30-36 మంది దళిత స్త్రీలు 40-50 కిలో మీటర్లు రోజూ ప్రయాణం చేస్తున్నారు పొట్టకూటి కోసం. ప్రజా సమస్యలు తెలుసుకోవడానికి యాత్రలు చేయవలసిన అవసరం లేదు. చిత్తశుద్ధి ఉంటే మీ ఆస్తులను, అక్రమంగా దోచుకున్న జాతి సంపదను ప్రజాపరం చేయగలిగితే పెను మార్పు సిద్ధిస్తుంది. చరిత్రను తిరగ రాయవచ్చు. ప్రణాళికా సంఘం దగ్గర పరిశోధనలు చేస్తున్న విశ్వ విద్యాలయాలు, ప్రపంచ వ్యాప్తంగా సేవలందిస్తున్న స్వచ్ఛంద సంస్థల దగ్గర అనేక నివేదికలు ఇప్పటికే ఉన్నాయి. క్షణాల్లో మీకందిస్తారు. అధ్యయనం చేసి, బహిరంగంగా ప్రజాభిప్రాయ సేకరణ చేయగలిగితే ధనం, సమయం వృథా కాదు. అంబేద్కర్ బాటలో ప్రయాణం చేయగలితే రాజ్యాధికారాన్ని అందుకోలేని ప్రజలు నశిస్తారని, ఆ రాజ్యాధికారాన్ని ప్రజలకందించ తలచే అభిప్రాయం ఉందా? రాష్ట్రంలో ఉండేవన్ని అగ్రకుల రాజకీయపార్టీలే. ఏ ఒక్క పార్టీ గానీ, అధినేత గానీ సిద్ధంగాలేరు అన్నది సుస్పష్టం.

గతంలో జరిగిన పాద యాత్రలు సమాజంలోని అసమానతలు అంటరానితం, అవమానాలు, రూపుమాపుటకు చేసిన ప్రయత్నాలు. పాదయాత్రలు, సైకిల్ యాత్రలు వంటివి సమాజ దిశ, దశను మార్చుటకు వారి జీవితాలను సైతం త్యాగం చేశారు. బుద్ధుడి నుంచి కాన్సీరాం దాకా జరిగిన ప్రయత్నాలు నిస్వార్థంతో కూడుకున్నవి. అటువంటి మహనీయులు ప్రవేశపెట్టిన విధానాలలో, పద్ధతులు మెథడాలజీని చేపట్టాలంటే ఎంతో కొంత నిబద్ధత కావాలి. త్యాగగుణం ఉండాలి. స్వార్థ చింతనను విడనాడాలి. సమాజహితమే లక్ష్యంగా జీవితాలు అంకితం చేస్తే తప్ప మౌలిక మార్పులు జరగవు. బ్యాంకు అకౌంట్లు, నిధులు లేకుండా, స్వంత ఆస్తులు కూడ బెట్టుకోకుండా వారి జీవితాలను సమాజానికి అంకితం చేసిన త్యాగధనులు ప్రవేశ పెట్టిన పవిత్రమైన పాదయాత్ర పద్ధతిని అపహాస్యం చేయడం ఏమాత్రమూ మంచిది కాదు. ఇప్పటికే రాష్ట్ర ప్రజలు అనేక సమస్యలతో మగ్గుతున్నారు. వారిని భ్రమల్లో ఎంతకాలం ఉంచుతారు? ఇప్పటికైనా వాస్తవంలోకి వచ్చి రాష్ట్రాభివృద్ధికి తగిన విధానాలు రూపొందించు కోకపోతే సమీప భవిష్యత్తులో తీవ్రపరిణామాలు ఎదుర్కోవలసివస్తుందని గుర్తుచేస్తూ అధికారమే పరమావధిగా కాకుండా ప్రజాక్షేమమే కర్తవ్యంగా భావించగలిగిన పార్టీలు, నాయకులు పుట్టుక వస్తారని కాంక్షిస్తూ...

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

**రాబోయే సంచికలలో...**

- **కనిపించే యథార్థాలు - డా. ఎం. శ్రీకాంత్‌రెడ్డి**
- **ఓపెన్ కాస్టుల వల్ల ఎవరికి లాభం? - కొండపాక శ్రీలత**
- **ప్రజలపై రాజ్యహింస - కిరణ్**
- **ఎర్రచందనం దోపిడీ - కూలీల హత్య - ఎం.కె. కుమార్**

# ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా

## భారత విప్లవోద్యమ ప్రయోగాల చరిత్ర

*దండకారణ్యంలో జనతన సర్కార్ నాయకత్వంలో జరుగుతున్న ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా చరిత్రను వివరిస్తున్నారు* **ఎన్. వేణుగోపాల్**

### ప్రవేశిక

ఆర్.ఎస్.రావుగారు నక్సల్బరీ ప్రజ్వలన నాటినుంచి తాను మరణించే దాకా నాలుగు దశాబ్దాలకు పైగా నక్సల్బరీ పంథా విప్లవోద్యమాన్ని నిర్ద్వంద్వంగా సమర్థించారు, ప్రచారం చేశారు, దానికి అవసరమైన సైద్ధాంతిక భూమికను అభివృద్ధి చేయడానికి ప్రయత్నించారు. దండకారణ్యంలో విప్లవోద్యమం గెరిల్లా జోన్ ను ఉన్నతీకరించడంలో భాగంగా బీజప్రాయమైన రాజ్యాధికార నిర్మాణాలను ప్రారంభించి, ప్రత్యామ్నాయ ఆర్థిక వ్యవస్థ నిర్మాణానికి ప్రయత్నాలు ప్రారంభించినప్పటి నుంచీ ఆయన అందులో చాల ఆసక్తి కనబరిచారు. భారత విప్లవోద్యమపు కీలకమైన, విశిష్టమైన, గుణాత్మకమైన ముందడుగులలో ఒకటిగా ఆయన ఈ ప్రయోగాలను చూశారు. ఈ ప్రయోగాలను విశ్లేషించాలని, సిద్ధాంతీకరించాలని, విస్తరణకూ పునర్నిర్మాణానికీ అవకాశం ఇచ్చే నమూనాలను తయారు చేయాలని ఆయన అభిప్రాయ పడ్డారు. ఆ అభిప్రాయాలను రచనలలోను, ఉపన్యాసాలలోను, విప్లవోద్యమ నాయకులతో చర్చలలోను చాలసార్లు వ్యక్తీకరించారు. ఒక ఉదాహరణ చెప్పాలంటే చర్చ (బులెటిన్-6, అక్టోబర్ 31, 2004) లో అచ్చయిన ఇంటర్వ్యూలో 'కోకాకోలా వద్దంటే – మజ్జిగ ప్యాకెట్లు ఇచ్చేవాళ్లు కూడా వాళ్లే అయ్యారనుకో, లాభం ఏముంది? మనం ఏం ఉత్పత్తి చేయగలం, ఏం పండించగలం అనే దృష్టి ఉండాలి. ప్రపంచ బ్యాంక్ నమూనాను వ్యతిరేకించడం కాదు, నిజంగా చేయవలసిందే మంటే మన సొంత నమూనా గురించి మాట్లాడాలి. ... దండకారణ్యం వెళ్లండి. అక్కడ స్వావలంబనకు సంబంధించిన గొప్ప ప్రయోగాలు చేస్తున్నారు .... అక్కడొక నమూనా తయారవుతోంది' అన్నారు.

బహుశా ఆ క్రమంలోనే, దండకారణ్య అభివృద్ధి ప్రయోగాల నమూనాపై ఒక పుస్తక రచనకు ప్రయత్నాలు జరుగుతున్నప్పుడు, ఆయన ఒక ప్రాతిపదిక పత్రాన్ని రాశారు. మార్క్సిస్టు సిద్ధాంత అన్వయంలోను, భారత విప్లవాచరణను సూత్రీకరించడంలోను ఆ పత్రం చాల విలువైన సూచనలు, నిర్ధారణలు చేసింది. ఆ పత్రంలోను, చర్చలలోను ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలలో ప్రధానమైనవి:

- దండకారణ్య ఉద్యమ ప్రయోగాలను ఒక నూతన అభివృద్ధి నమూనాగా చూడాలి.
- దండకారణ్య ఆదివాసుల కొత్త జీవనోపాధికి వ్యవసాయం అనే ప్రత్యామ్నాయ మార్గాన్ని సూచించడం నూతన ప్రజాస్వామిక కార్యక్రమానికి బీజాలు వేయడమే. కమ్యూనిస్టు చరిత్రలో ఆచరణ ద్వారా అభివృద్ధిని రూపుదిద్దిన సందర్భం ఇది.
- కొత్తగా ప్రవేశపెట్టిన భూఆధారిత ఉత్పత్తి/ఆస్తి సంబంధాలతో పాటు ఉత్పత్తి శక్తులు అభివృద్ధి చెందుతూ కొత్త భూఆధారిత ఆర్థిక రూపాన్ని నిర్మించడం ప్రారంభించాయి. అందువల్ల సంస్కృతి కూడ మారుతూ, పరివర్తన చెందుతూ ఉండవలసి వచ్చింది. కొత్తగా రూపొందుతున్న సామాజిక నిర్మితికి మూల స్తంభాలయిన ఈ మూడూ – ఉత్పత్తి సంబంధాలు, ఉత్పత్తి శక్తులు, సంస్కృతి – మొత్తంగా సామాజిక పరివర్తనకూ, అభివృద్ధికీ పునాదిగా నిలిచాయి.
- దండకారణ్య ఆచరణ నమూనా సారాంశంలో అభివృద్ధి నమూనా. అది ఒక అర్ధభూస్వామ్య అర్ధవలస రాజకీయ చట్రం లోపల ఆదివాసి వ్యవస్థను భూఆధారిత ఆర్థిక వ్యవస్థగా పరివర్తన చెందించే నూతన ప్రజాస్వామిక మార్గమేమిటో చూపుతున్నది.
- కొత్త ఉత్పత్తి సంబంధాలు, కొత్త ఉత్పత్తి శక్తులు, కొత్త సంస్కృతి అనే మూడు క్షేత్రాలలో ఒకదానికీ మరొకదానికీ మధ్య, ఒక్కొక్క క్షేత్రం లోపల కూడ అనేక వైరుధ్యాలు తలెత్తుతాయి. ఆ వైరుధ్యాల పరిష్కారంలో సమన్వయంతో కూడిన సిద్ధాంత – ఆచరణ ఐక్యతను సాధించే నూతన ప్రజాస్వామిక విప్లవ మార్గాన్ని దండకారణ్య ఉద్యమం సాధించవలసి ఉంది.
- సమస్యను నిర్బంధానికి పరిమితం చేయకుండా భూమి సమస్యగా చూడాలి.
- ఉత్పత్తి సంబంధాలలో, ఉత్పత్తి శక్తులలో, సంస్కృతిలో వస్తున్న మార్పులను అధ్యయనం చేయాలి.
- మార్పుకు చోదకశక్తిగా భూమిలేని నిరుపేద వ్యవసాయ కూలీలు, చిన్నరైతులు ఉండాలి.
- ఆవిర్భవిస్తున్న నూతన ప్రత్యామ్నాయ రాజ్యాధికారం ఏ వర్గం చేతిలో ఉందో చూడాలి.
- నిజమైన ప్రజాపంథాను అభివృద్ధి చేయాలి.

ఆయన సూచనలలో కొన్ని అమలయ్యాయి, కొన్ని అమలయ్యే క్రమంలో ఉన్నాయి. ఈ నేపథ్యంలో ఆర్ ఎస్ రావు సంస్మరణ సదస్సులో ఆయన ప్రధానంగా దృష్టి పెట్టిన ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా చరిత్రను వివరించడం సముచితంగా ఉంటుంది.

### ప్రత్యామ్నాయపు అభివృద్ధి నమూనా విస్తృతి

స్పష్టమైన, నిర్దిష్టమైన లక్ష్యాలతో నక్సల్బరీ మార్గంలో ప్రారంభమైన భారత విప్లవోద్యమం అట్టడుగున పీడిత ప్రజారాశులలో నానాటికీ

విస్తరిస్తున్నది. నాలుగు దశాబ్దాల కింద ఒక గ్రామంలో ప్రారంభమైన ఈ విప్లవమార్గం ఇవాళ కనీసం పదహారు రాష్ట్రాలకు, 270 జిల్లాలకు వ్యాపించి 'దేశ అంతర్గత భద్రతకు పెను ప్రమాదం'గా మారిందని పాలకవర్గాలే అంటున్నాయి. అయితే పాలకవర్గ ప్రచారం విప్లవోద్యమాన్ని సమస్యగా, ప్రమాదంగా, హింసాకాండగా, తీవ్రవాదంగా, ఉగ్రవాదంగా, నిర్మూలించవలసిన బెడదగా మాత్రమే చూస్తున్నది, చూపుతున్నది. ప్రచార సాధనాలకు కూడ ప్రధానంగా ఈ భావజాలమే ఉంటుంది గనుక విప్లవోద్యమం గురించి అటువంటి వార్తలు, వ్యాఖ్యలే ఎక్కువగా వస్తుంటాయి. మామూలుగానే ప్రధానస్రవంతి ప్రచార మాధ్యమాలకు క్రమాలను చూపడం కన్న ఘటనలను చూపడం మీద ఎక్కువ శ్రద్ధ ఉంటుంది. అందువల్ల మందుపాతర, ఎన్ కౌంటర్, దాడి, హత్య, సభ, విధాన ప్రకటన, అధికారులను బందీలుగా పట్టుకోవడం, రాజ్య నిర్బంధకాండ వంటి ఘటనలు కనబడినంతగా సంవత్సరాలకొద్దీ, దశాబ్దాలకొద్దీ మెల్లమెల్లగా లోలోపల జరిగిన పరిణామం కనబడదు. దానితో ఉద్యమంలో వందలాది మంది, వేలాది మంది నాలుగు దశాబ్దాలపాటు జయాపజయాలతో, ప్రయోగాలతో, సవరణలతో సాగించిన ప్రజాసంఘటిత కృషి కనబడకుండా పోయి, ఏదో ఒక ఘటనే ప్రధానమవుతుంది. అంటే ఉద్యమం ప్రజలతో మమేకమైన ఒక క్రమానుగత రాజకీయార్థిక అభివృద్ధిగా, సామాజిక పరివర్తనగా కాక ఒకదానితో మరొకదానికి సంబంధం లేని ఘటనల వరుసగా కనబడుతుంది.

మామూలుగా ప్రచార సాధనాల ద్వారానే సమాచారాన్నీ, జ్ఞానాన్నీ, దృక్పథాన్నీ అందుకునే మధ్యతరగతికి, బుద్ధిజీవులకు విప్లవోద్యమం గురించి ఉన్న అవగాహనలలో ఈ పాలకవర్గ ప్రచారం గణనీయమైన పాత్ర వహిస్తున్నది. అందువల్ల ఈ ప్రచార సాధనాల ప్రభావంలో ఉండేవారికి ఉద్యమం గురించిన వాస్తవికమైన, సరైన అవగాహన అందడం లేదు. సహజంగానే అపోహలు, అపార్థాలు, దురభిప్రాయాలు, ఒక ఘటనను మితిమీరి మెచ్చుకోవడం, మరొక ఘటన పట్ల అంతే తీవ్రంగా వ్యతిరేకత కనబరచడం జరుగుతున్నాయి. అందుకు భిన్నంగా అశేష పీడిత ప్రజానీకం విప్లవోద్యమాన్ని తమ సమస్యలకు పరిష్కారంగా చూస్తూ అంతకంతకూ ఎక్కువగా దానివైపు ఆకర్షితులవుతున్నారు. దానిలో పాలు పంచుకుంటున్నారు. దాని శ్రేణులుగా, నాయకులుగా మారుతున్నారు.

విప్లవోద్యమం గురించి పాలకవర్గాలూ ప్రధానస్రవంతి ప్రచార సాధనాలూ ఏమి చెప్పినప్పటికీ, న్యాయాన్యాయాల చర్చను, సామాజిక పరివర్తనా చర్చను హింసాహింసల చర్చగా కుదించినప్పటికీ ఉద్యమంలో ప్రజల భాగస్వామ్యం నానాటికీ విస్తరించడానికి కారణం విప్లవోద్యమం ప్రజల ముందర ఒక ఆచరణ సాధ్యమైన ప్రత్యామ్నాయాన్ని చూపుతుండడమే. ఆ ప్రత్యామ్నాయం ఇవాళ్టికి బీజరూపంలోనే ఉండవచ్చు, ఇంకా ప్రయోగదశలోనే ఉండవచ్చు. ఒడిదుడుకులకు లోనవుతూ ఉండవచ్చు, కాని అది కనీసం పద్దెనిమిది సంవత్సరాలుగా స్థిరంగా ఆచరణలో ఉన్నది. నిలదొక్కుకుంటున్నది, ఎప్పటికప్పుడు సవరణలతో, అభివృద్ధితో నవనవోన్మేషమవుతున్నది. నిత్య నిర్బంధాన్నీ, హంతక దాడులనూ ఎదుర్కొంటూ, ఓడిస్తూ ముందుకు సాగుతున్నది, గత ఏడెనిమిది సంవత్సరాలుగా, సాల్వా జుడుం హంతక దాడుల నాటినుంచీ ఈ దమనకాండ గురించి సమాచారం, వ్యాఖ్యలు విశ్లేషణలు ఎక్కువగానే వస్తున్నాయి గాని, ఉద్యమం నిర్మిస్తున్న ప్రజా ప్రత్యామ్నాయం గురించి బైటి సమాజంలో జరగవలసినంత సమాచార వ్యాప్తి, చర్చ జరగడం లేదు.

ఈ ప్రజాప్రత్యామ్నాయంలో మొట్టమొదట గుర్తించవలసిన అంశం దాని విస్తృతి. అది ప్రజాసమస్యల పరిష్కారం, ఆదివాసి జీవితాల మెరుగుదల, వనరుల దోపిడీని అరికట్టడం, ప్రతిఘటన, సైనిక చర్యలు, సాంస్కృతిక ప్రదర్శనలు, ప్రజా భాగస్వామ్యం వంటి వాటిలో ఏ ఒక్కదానికో పరిమితమైనది కాదు. ఇవన్నీ కలగలిసినది, వీటన్నిటికన్న మించినది. మొత్తంగా చెప్పాలంటే ఈ ప్రజా ప్రత్యామ్నాయం ఆర్థిక జీవనంలో, సాంఘిక జీవనంలో, సంస్కృతిలో, పాలనలో విస్తరించింది. మార్క్సిస్టు పరిభాషలో చెప్పాలంటే ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలు, ఉపరితలం ఏకకాలంలో పెనుమార్పులకు గురవుతున్నాయి. అందువల్ల ఈ పరిణామం భారత పీడిత ప్రజా పోరాటాల చరిత్రలోనే ఒక గుణాత్మకమైన అభివృద్ధి ఆలోచనకూ ఆచరణకూ సంబంధించినది.

ఈ ప్రజా ప్రత్యామ్నాయంలో ప్రధానాంగాలైన ఆర్థిక జీవనానికి, పాలనకూ – అంటే ప్రత్యామ్నాయ అభివృద్ధి కార్యక్రమాలనూ, గ్రామరాజ్య కమిటీ, జనతన సర్కార్ వంటి నిర్మాణాలు రూపొందిన, రూపొందుతున్న తీరునూ చర్చించడానికి మాత్రమే ఈ పత్రం పరిమితమవుతుంది. సాంఘిక జీవనానికీ, సంస్కృతికీ సంబంధించి ఎన్నో విలువైన ప్రయోగాలు, ప్రయత్నాలు జరుగుతున్నప్పటికీ, ఎన్నో గణనీయమైన విజయాలు సాధించినప్పటికీ స్థల, సమయాభావాల వల్ల ఆ అంశాలను ఈ పత్ర పరిధిలోకి తేవడం లేదు.

### ప్రజా ప్రత్యామ్నాయం – భారత విప్లవోద్యమ ఆలోచనలు

ప్రజా ప్రత్యామ్నాయ రూపకల్పనలో పారిస్ కమ్యూన్ (1871) నాటి నుంచి కంపూచియా విప్లవం (1975–79) దాకా ప్రపంచవ్యాప్తంగా గత నూట యాభై సంవత్సరాలుగా మార్క్సిస్టు విప్లవోద్యమాలు విజయానంతరం సాధించిన అనుభవాలెన్నో ఉన్నాయి. అలాగే విజయానికి ముందే, విప్లవోద్యమాల క్రమంలోనే ప్రజా ప్రత్యామ్నాయ అభివృద్ధి మార్గానికి సంబంధించి చేసిన ఆలోచనలూ ఎన్నో ఉన్నాయి. సమసమాజ నిర్మాణంలో ఎన్నెన్నో గెలుపు ఓటమి ప్రయోగాలతో ఆ చరిత్ర రూపొందింది. ముఖ్యంగా ఇరవయో శతాబ్ది ప్రత్యామ్నాయ నిర్మాణ ప్రయత్నాలు అనేక అంతర్గత, బాహ్య కారణాల వల్ల ఓటమి పాలయ్యాయి. మొత్తంగా ఆశయమే అపనమ్మకానికీ, అపోహలకూ, దుర్వ్యాఖ్యానాలకూ గురయింది. అందువల్ల ఆ ఓటమి నుంచి పాఠాలు నేర్చుకుంటూ కొత్త ప్రత్యామ్నాయ రూపకల్పన సాగించవలసి ఉంది. అలాగే చార్లెస్ ఫోరియర్, రాబర్ట్ ఓవెన్ ల వంటి మార్క్స్ కన్న ముందరి ఆలోచనాపరుల నుంచి ప్రస్తుత లాటిన్ అమెరికన్ బొలివారియన్ విప్లవకారుల దాకా ప్రత్యామ్నాయ సమాజ నిర్మాణం గురించి మార్క్సిస్టేతర ఆలోచనలూ ఎన్నో ఉన్నాయి. ఆ సుదీర్ఘ నేపథ్యాన్నంతా గమనంలోకి తీసుకుంటే ప్రత్యామ్నాయ రూపకల్పన ఎంత సంక్లిష్టమైన ప్రయోగమో అర్థమవుతుంది.

భారత కమ్యూనిస్టు ఉద్యమం 1920లలో ప్రారంభమై ఇరవై ఐదు సంవత్సరాలు గడిచేవరకూ ఈ దేశంలో అనుసరించ వలసిన విప్లవ మార్గమేమిటో స్పష్టతే ఏర్పడలేదు గనుక, విప్లవానంతరం సోవియట్ యూనియన్ లో అమలవుతుండిన అభివృద్ధి నమూనానే స్థూలంగా

ఊహల్లో ఉండింది. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాట కాలంలో 'చైనా మార్గమే మన మార్గం' వంటి ఆలోచనలు, నూతన ప్రజాస్వామ్య అవగాహన పరిచయం, గ్రామ రాజ్య కమిటీల వంటి అట్టడుగుస్థాయి స్థానిక ప్రజారాజ్యాధికార నిర్మాణాల ఏర్పాటు జరిగినప్పటికీ ఆ ఆలోచన, ఆచరణ అంతకన్న ముందుకు వెళ్లే అవకాశం లేకపోయింది. నక్సల్బరీ ప్రజ్వలన తర్వాత ఏర్పడిన భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టు) ప్రత్యామ్నాయ రాజకీయాచరణను ప్రతిపాదించినంతగా ప్రత్యామ్నాయ ప్రజా రాజకీయాధికార, ఆర్థిక, సాంస్కృతిక నిర్మాణాలను ప్రతిపాదించినట్టు కనిపించదు. ఆ పార్టీ కాంగ్రెస్ 1970లో ఆమోదించిన కార్యక్రమంలో విప్లవానంతర ప్రజా ప్రత్యామ్నాయ వ్యవస్థ గురించి స్థూలమైన, దీర్ఘకాలికమైన ఆలోచలు ఉన్నాయి గాని విప్లవోద్యమ క్రమంలో, ప్రజల చొరవతో, భాగస్వామ్యంతో ఆచరణలోకి తేదగిన ప్రత్యామ్నాయ నమూనాల గురించి మధ్యంతర, తక్షణ ప్రతిపాదనలు లేవు. ఆ ఉద్యమం కొద్దిసమయంలోనే వెనుకంజకు గురికాకపోయి ఉంటే ఆ ఆలోచనలు వెలువడి ఉండగలిగేవేమో చెప్పలేం.

భారత కమ్యూనిస్టు పార్టీ (మా-లె) తెలంగాణా రీజినల్ కమిటీ 1972 జూన్ 21న చేసిన తీర్మానాన్ని ఆ కాలపు ఆలోచనలకు ఒక ఉదాహరణగా చెప్పవచ్చు. దానిలో ఫారెస్ట్ దళ కార్యక్రమాలుగా చెప్పిన నాలుగు అంశాలు: 1. వర్గశత్రు నిర్మూలన ద్వారా రెడ్‌టెర్రర్ సృష్టించడం, 2. వ్యవసాయ విప్లవ కార్యక్రమాన్ని ప్రచారం చేయడం, 3. రెవల్యూషనరీ కౌన్సిల్స్, గ్రామ రక్షణ దళాలు ఏర్పరచడం, 4. ప్రజల్ని సంఘటితం చేసి, వారిలో నుండి మిలిటెంట్స్ తో ఎర్రసైన్యాన్నీ, పార్టీనీ నిర్మించడం. (రెక్టిఫికేషన్ కేంపెయిన్, సంపుటం 5, పే. 5) ఇవన్నీ చాల అవసర మైనవీ, కీలకమైనవీ అయినప్పటికీ ఇందులో బీజప్రాయమైన స్థానిక ప్రజా అధికారం గురించి గాని, అభివృద్ధి నమూనా గురించి గాని ఆలోచనలు లేవని కూడ గుర్తించాలి. ఇందులో మూడో కర్తవ్యంలో మొదటి సగం ప్రజాధికార నిర్మాణాల గురించి సూచన కావచ్చుగాని అందులో కూడ ఉండవలసినంత స్పష్టత లేదనిపిస్తుంది.

నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాల అపజయం తర్వాత సాగిన పునరాలోచనలలో భాగంగా 'గతాన్ని సమీక్షించుకుని సాయుధపోరాట పథంలో విజయవంతంగా పురోగమిద్దాం' అనే డాక్యుమెంటు తయారయింది. 1974లో ముసాయిదా తయారయి, 1977లో వెలువడి, ఆత్మవిమర్శ రిపోర్టు అనే పేరుతో ప్రఖ్యాతమైన ఈ డాక్యుమెంటు గతం గురించి విలువైన గుణపాఠాలను, భవిష్యత్తు మార్గదర్శక సూత్రాలను ప్రతిపాదించింది. 'విముక్తి ప్రాంతాలనేర్పరచడం లోని ఆచరణాత్మక అంశాన్ని పరిశీలించేటప్పుడు గ్రామీణ ప్రాంతాన్ని మనం స్థూలంగా రెండు భాగాలుగా విడదీయవచ్చు. ఒకటి వ్యావసాయికంగా అభివృద్ధి చెందిన ప్రాంతం. వేరొకటి వ్యావసాయకంగా వెనుకబడిన ప్రాంతం. ఈ రెండవ తరహా ప్రాంతంలో భూస్వామ్య విధానం బలంగా ఉంటుంది; రవాణా సౌకర్యాలు, రాజ్యాంగ యంత్రం సాపేక్షికంగా బలహీనంగా ఉంటాయి. కాని రివిజనిస్టు కాలంలో, సాయుధ పోరాటాన్ని గురించిన అవగాహన లోపం వలన, ఈ వెనుకబడిన ప్రాంతంలో కూడా కమ్యూనిస్టు పార్టీ బలహీనంగా ఉంది. నక్సల్బరీ పోరాటం తర్వాతనే భారతదేశమంతటా ఇటువంటి ప్రాంతాల ప్రాధాన్యతను గుర్తించడం ఒక ముఖ్యాంశంగా ముందుకు వచ్చింది. అటువంటి ప్రాంతాలలో భౌగోళిక పరిస్థితి కూడ అనుకూలంగా ఉంటే అక్కడ విముక్తి ప్రాంతాలు ఏర్పరచడం సులభతర మవుతుంది. కనుక మన పార్టీ బలంగా ఉన్న రాష్ట్రాలన్నిటిలోను అటువంటి ప్రాంతాలను ఎంచుకుని నిర్దిష్టమైన పథకంతో విప్లవ కర్తవ్యాలను పరిపూర్తి చేయడానికి అవసరమైన కేడర్లతో పనిచేయాలి. సాయుధపోరాటం తీవ్రతరమవుతున్న కొద్దీ విముక్తి ప్రాంతాల నిర్మాణానికి అవసరమైన సైనిక నైపుణ్యం మనం సంపాదించ గలుగుతాం. మనం యుద్ధాన్ని యుద్ధం చేయడం ద్వారా మాత్రమే నేర్చుకోగలం. వేరే మార్గం లేదు' (కొండపల్లి సీతారామయ్య ఏరిన రచనలు - మొదటి సంపుటి, పే. 100-101) అని ఈ డాక్యుమెంటు విముక్తి ప్రాంతాల స్థాపన గురించి స్పష్టతను ఇచ్చింది. అయినప్పటికీ ఆ విముక్తి ప్రాంతాలలో ఎటువంటి అభివృద్ధి, పాలన నమూనాలను అమలు చేయాలనే విషయంలో తగినంత స్పష్టత ఉందని చెప్పలేం.

కరీంనగర్ ఆదిలాబాద్ రైతాంగ పోరాటాలతో నక్సల్బరీ పంథా ప్రజాపంథాగా విస్తరించిన తర్వాత ప్రజా ప్రత్యామ్నాయ అభివృద్ధి, పాలన ఆలోచనలు మరింతగా వికసించాయి. మూడు నాలుగు సంవత్సరాల ప్రజా ఉద్యమ ఆచరణ క్రమంలో ఈ రైతాంగ ఉద్యమాన్ని పరిరక్షించుకోవాలన్నా, విస్తరించాలన్నా, నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని విజయవంతం చేయడానికి అవసరమైన సైనిక పాటవాన్ని పెంచుకోవాలన్నా అనువైన ప్రాంతాలలో గెరిల్లాజోన్లు ఏర్పాటు చేయవలసి ఉంటుందనే అవగాహనకు విప్లవోద్యమం 1980 నాటికి చేరింది.

## గెరిల్లా జోన్ పర్‌స్పెక్టివ్ 1980

ఆ అవగాహనలో భాగంగానే అప్పటి భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్ట్ లెనినిస్ట్) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటీ 'గెరిల్లా జోన్ పర్‌స్పెక్టివ్' గా సుప్రసిద్ధమైన 'కరీంనగర్ ఆదిలాబాద్ రైతాంగ ఉద్యమాన్ని నూతన స్థాయికి తీసికొని పోవడానికి సన్నద్ధం కండి' అనే లేఖను తన శ్రేణులకు పంపించింది. ఇవాళ దేశానికి మాత్రమే కాక, ప్రపంచానికే ప్రత్యామ్నాయ ప్రజా ఆచరణకు ఆశాసూచికగా ఉన్న దండకారణ్య విప్లవోద్యమానికి తొలి బీజం అది. ఈ లేఖకు కొనసాగింపుగా దాదాపు నలభై మంది విప్లవకారులు ఏడు దళాలుగా ఏర్పడి గోదావరి దాటి దండకారణ్యంలోకి ప్రవేశించారు. ఈ దళాల తక్షణ కర్తవ్యాలు 'సర్వే చేయడం, ప్రజలలో రాజకీయ చైతన్యం పెంచడం, వర్గపోరాటాన్ని కొనసాగించడం, గిరిజన సంఘాలను స్థాపించడం, స్థానికులతో దళాలను నిర్మించడం, స్థానికంగా పార్టీని నిర్మించడం' కాగా, దీర్ఘకాలిక లక్ష్యం దండకారణ్యాన్ని గెరిల్లా జోన్‌గా మార్చడం. అయితే 'నిజమైన అర్థంలో ఈ ప్రాంతం గెరిల్లా జోన్‌గా రూపొందడానికి చాలా కాలం పడుతుంది. ఆ పిమ్మట విముక్తి ప్రాంతం కావడానికి ముందు గెరిల్లా జోన్ స్థాయిలోనే చాలా దీర్ఘకాలం పోరాడవలసి రావచ్చు' అని ఆ లేఖ చాల స్పష్టంగానే గుర్తించింది.

'...మన ఉద్యమాన్నీ, పార్టీ నిర్మాణాన్నీ రక్షించుకుంటూ శత్రువుపై దెబ్బతీయడం, పోరాటాన్ని మరింత ఉన్నతస్థాయికి అంటే రైతాంగ పోరాటాన్ని భూస్వాములతో పోరాడటంతో పాటు ప్రభుత్వ బలగాలతో కూడా పోరాడే స్థాయికి అభివృద్ధి చేయడం - అదే ఈ ప్రాంతాన్ని గెరిల్లా జోన్ చేయడానికి సంబంధించిన ప్రాథమిక దశ. ఆ లక్ష్యంలో భాగంగానే అడవిలోకి దళాలను పంపుతున్నాం. ఆ లక్ష్యాన్ని సాధించడంలో మనం కృతకృత్యులం కాగలిగితే దాని ప్రయోజనం

ఆమేరకు పరిమితమై ఉండదు. శత్రువు దాడులు దుర్బలంగా ఉన్న ఆ సువిశాల అడవి ప్రాంతాన్ని విముక్తి ప్రాంతం చేసుకునే పరమావధికి అది ఉపకరణం కావచ్చు. అవుతుంది కూడ. అదే ఈ కార్యక్రమానికి అంతటికీ సంబంధించి పరమ లక్ష్యంగా ఉండాలి' (రెక్టిఫికేషన్ కేంపెయిన్ – 5, పే. 22–50) అని ఆ లేఖ సూచించింది.

అప్పటికి దండకారణ్యానికి ఉన్న కీలక ప్రతిపత్తి గురించి స్థూలంగా అవగాహన ఉంది. అక్కడ మొదట గెరిల్లా జోన్ నూ, క్రమంగా విముక్తి ప్రాంతాన్నీ ఏర్పాటు చేయవచ్చుననే అవగాహన ఉంది. కాని ఆ ప్రాంతాలలో ప్రత్యామ్నాయ రాజకీయార్థిక, పాలనా వ్యవస్థలను ఏర్పాటు చేయడం గురించి పూర్తి అవగాహన ఉందని ఈ లేఖలో గాని, ఆ కాలపు ఇతర డాక్యుమెంట్లలో గాని కనిపించదు. కొండపల్లి సీతారామయ్య జైలునుంచి రాష్ట్ర కార్యదర్శికి 1982 అక్టోబర్ లో రాసిన సుదీర్ఘ లేఖ చాల వివరంగా దండకారణ్యంలోని దళాలకు, ఆదివాసులకు సంబంధించిన విషయాలు చర్చించింది. ఆ లేఖలో గ్రామ కమిటీ, రెవల్యూషనరీ కమిటీల గురించి కూడ చర్చ ఉంది.

దండకారణ్య ఆదివాసి కిసాన్ మజ్దూర్ సంఘటన్ (డిఎకెఎంఎస్) నాయకత్వంలో 1988 నాటి నుంచే రైతు సహకార సంఘాలు ఏర్పాటు చేయడం మొదలయింది. 1990 జూలై నాటికి బస్తర్ డివిజన్‌లో కుంట ఏరియాలో 60, బాసగూడెం ఏరియాలో 80, మద్దేడ్ ఏరియాలో 40 – మొత్తం 180 సహకార సంఘాలు నిర్మాణమయ్యాయని 1991 మార్చ్ ఎర్రజండా సంచికలో వచ్చిన సహకార సంఘాల సమీక్ష చెపుతున్నది. ఇటువంటి అనేక ప్రయత్నాలతో, ప్రయోగాలతో, సమీక్షలతో, సవరణలతో ప్రజా ప్రత్యామ్నాయ నిర్మాణాల అవగాహన క్రమంగా అభివృద్ధి చెందుతూ వచ్చి 1994 నాటి గ్రామ కమిటీల ఏర్పాటు సర్క్యులర్ లో మరింత స్పష్టమయింది.

గ్రామ కమిటీల ఏర్పాటు 1994 దాదాపు పద్నాలుగు సంవత్సరాలు ఉత్తర తెలంగాణలో, దండకారణ్యంలో అట్టడుగు స్థాయి నుంచి ప్రజలను సంఘటితం చేస్తూ, ప్రజాసంఘాలను, సహకార సంఘాలను నిర్మిస్తూ, ఉద్యమాన్ని విస్తరించిన అనుభవంతో భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్ట్ లెనినిస్ట్) (పీపుల్స్ వార్) కేంద్ర ఆర్గనైజింగ్ కమిటీ 1994 జూలైలో 'గ్రామ కమిటీలు' అనే సర్క్యులర్ ను తన శ్రేణులకు పంపింది. అప్పటికి చాల ముందు నుంచే ఉత్తర తెలంగాణలో గ్రామ కమిటీలు ఏర్పరచాలనే ఆలోచన ఉందనీ, కాని అది కార్యరూపం దాల్చలేదనీ ఈ సర్క్యులర్ చెప్పింది. ఒక గ్రామంలో గ్రామ కమిటీ ఏర్పరచడానికి భూస్వామ్య వ్యతిరేక పోరాటాల ద్వారా ప్రజా శిబిరం సంఘటితపడి, ప్రజావ్యతిరేక శిబిరం బలహీనపడి ఉండాలని, ప్రజలు సంఘ నాయకత్వం కింద సమీకరించబడి ఉండాలని, గ్రామంలో పార్టీ నిర్మాణం ఉండాలని ఈ సర్క్యులర్ సూచించింది. (పీపుల్స్ వార్, సంచిక 9, మే–ఆగస్ట్ 1994)

గ్రామకమిటీ నిర్మాణ ప్రక్రియ, విధివిధానాలతో పాటు, గ్రామకమిటీ కర్తవ్యాలుగా ఈ సర్క్యులర్ నిర్దేశించిన పన్నెండు పనులు అన్ని రంగాలలో ప్రజా ప్రత్యామ్నాయానికి, బీజ రూప అభివృద్ధి నమూనాకు తొలి ఉదాహరణలు. వాటిలో కొన్ని:

- భూస్వాముల భూములను, ప్రభుత్వ భూములను స్వాధీనం చేసుకుని ప్రజలకు పంపిణీ చేసి, వాటిని ఒక్కో కుటుంబం గాని, సమష్టిగా గాని సాగు చేసుకోనివ్వాలి. వ్యవసాయ సహకార సంఘాలు ఏర్పాటు చేయాలి.
- భూస్వాముల, కంట్రాక్టర్ల, ఫారెస్ట్, రెవెన్యూ, తదితర ప్రభుత్వ అధికారుల దోపిడీ పీడనలను ఎదిరించాలి. కూలిరేట్ల, జీతాల పెరుగుదల కోసం, ఇతర సౌకర్యాల కల్పన కోసం పోరాడాలి. వెట్టి చాకిరీని, లంచాలను, దండుగలను, అధిక వడ్డీ రేట్లను, అన్ని రకాల సామాజిక పీడనలను రద్దు చేయాలి.
- పాలకవర్గ న్యాయవ్యవస్థను తోసివేస్తూ ప్రజల మధ్య అన్ని సమస్యలను, వివాదాలను ప్రజాస్వామిక పద్ధతుల ద్వారా ప్రజా కోర్టులలో పరిష్కరించుకోవాలి.
- గ్రామ రక్షణ దళాలను ఏర్పాటు చేయడం ద్వారా స్థానిక శత్రువుల, పోలీసు ఇన్ఫార్మర్ల, గూండాల దాడులను తిప్పికొట్టాలి.
- ప్రజల విద్యా (వయోజన, పాఠశాల, గ్రంథాలయ), ఆరోగ్య (వైద్యం, పరిశుభ్రత, పర్యావరణం) అవసరాలను తీర్చడానికి అన్ని చర్యలు చేపట్టాలి. ప్రజల సాంస్కృతిక అభివృద్ధి ప్రయత్నాలు చేయాలి. ప్రభుత్వ విద్యా, వైద్య సిబ్బందితో మర్యాదగా వ్యవహరించాలి. ప్రభుత్వ పాఠశాలలు, ఆస్పత్రులు సక్రమంగా నడిచేలా చూడాలి.
- రహదారులు, విద్యుచ్ఛక్తి, నీటిపారుదల, తాగునీరు, కమ్యూనికేషన్ సౌకర్యాలు, గ్రామాభివృద్ధి పథకాల అమలు చేపట్టాలి. ఈ అభివృద్ధి కార్యక్రమాలకు అవసరమైన ఆర్థిక వనరులను స్థానిక దోపిడీ వర్గాల మీద లెవీలు విధించడం ద్వారా, ప్రజల స్వచ్ఛంద శ్రమను, సహకారాన్ని వినియోగించడం ద్వారా సంపాదించాలి.
- విద్యా, వైద్య, రవాణా, సాగునీరు, తాగునీరు సౌకర్యాల కోసం ప్రభుత్వంతో పోరాడాలి. మద్దతు ధరలు, కరువు నివారణ చర్యలు, ఎరువులు, పురుగుల మందుల సరఫరా, విద్యుత్ చార్జీల, బస్సు ఛార్జీల, ఇంటి పన్నుల తగ్గింపు, నిత్యావసర వస్తువుల ధరలు వంటి సమస్యలపై ప్రభుత్వంతో పోరాడాలి.
- స్త్రీలకు సమాన హక్కుల కోసం, స్త్రీల మీద అత్యాచారాలకు వ్యతిరేకంగా, అగ్రవర్ణాల అత్యాచారాలకు, కుల వివక్షకు వ్యతిరేకంగా, మత దురహంకారానికి, ప్రత్యేకించి హిందూ మతోన్మాదానికి వ్యతిరేకంగా పోరాడాలి.
- ఈ దశలో 'దున్నేవారికే భూమి', 'అన్ని అధికారాలూ గ్రామ కమిటీలకే' అనేవి ప్రధాన నినాదాలుగా ఉంటాయి.

ఈ కర్తవ్యాలలో కొన్ని ప్రస్తుత ప్రభుత్వ అధికారాన్ని అంగీకరిస్తూ, ఆ ప్రభుత్వం మీద సాగించే పోరాటాలు కాగా, మరికొన్ని ఆ ప్రభుత్వాధికారాన్ని సవాలు చేస్తూ రూపొందించవలసిన నూతన ప్రజా రాజకీయాధికార చిహ్నాలు, మరికొన్ని దీర్ఘకాలిక లక్ష్యాలు కలగలిసి ఉన్నాయి.

ఈ అవగాహనలే 1995 ఫిబ్రవరి నుంచి అక్టోబర్ దాకా జరిగిన 20 జిల్లా కమిటీల, 7 రాష్ట్ర కమిటీల సమావేశాలలోను, నవంబర్ లో జరిగిన అఖిల భారత ప్రత్యేక సమావేశం లోను మరింత చర్చించబడి, కర్తవ్యాలుగా నిర్ధారణ అయ్యాయి. ఆయా ప్రాంతాలను బట్టి గ్రామస్థాయి నుంచి ప్రజా రాజకీయాధికారాన్ని స్థాపిద్దాం, ఉత్తర తెలంగాణను బలమైన గెరిల్లాజోన్‌గా నిర్మిద్దాం, గెరిల్లా జోన్ల నిర్మాణ సన్నాహాలు చేద్దాం, గెరిల్లా జోన్లను ఉన్నత స్థాయికి అభివృద్ధి చేద్దాం, అధికారాలన్నీ గ్రామ కమిటీలకే, ప్రజా ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి చేస్తూ సంక్షేమ కర్యక్రమాలు చేపడదాం వంటి కర్తవ్యాలు నిర్ణయించారు. (పీపుల్స్ వార్, సంచిక 13, జనవరి – జూన్ 1996)

ఈ అవగాహన కూడ ఆచరణలో అమలవుతూ, అంతర్గత సమీక్షలు, చర్చలు, సవరణలు జరుగుతూ బలోపేతమవుతూ వచ్చింది. ఆ క్రమంలోనే ఐదు సంవత్సరాల గ్రామ కమిటీల అనుభవాల తర్వాత 1999 మేలో కేంద్ర కమిటీ 'గెరిల్లా జోన్స్ - మన పర్ స్పెక్టివ్' అనే కొత్త డాక్యుమెంటును ప్రకటించింది.

## గెరిల్లాజోన్ పర్‌స్పెక్టివ్ 1999

'మనదేశపు ముఖ్యమైన నిర్దిష్ట లక్షణాలలో ఒకటైన శక్తివంతమైన కేంద్రీకృత ప్రభుత్వ యంత్రాంగం ఉండటాన్ని దృష్టిలో ఉంచుకున్నప్పుడు చైనాలో లాగా స్థిరమైన విముక్తి ప్రాంతాలను ఏర్పరచడం కష్టంతో కూడుకున్నది' అని గుర్తించిన ఈ డాక్యుమెంటు, 'ఒక నిర్దిష్ట ప్రాంతంలో ప్రజల ప్రజాస్వామిక రాజకీయాధికారం (విప్లవ స్థావరం) నెలకొల్పి, వ్యవసాయిక విప్లవ కర్తవ్యాలను ఆచరణలో అమలుపరచడం ద్వారా దేశంలోని ఇతర ప్రాంతాల ప్రజలను ఎంతో ఉత్సాహపర్చడమే గాక వారిలో విశ్వాసాన్ని పెంపొందింపజేసి ఎక్కడికక్కడ పోరాట ప్రాంతాలను సృష్టిస్తుంది' అని ఒకే అంశంలోని ప్రతికూల, అనుకూల అంశాలను గమనంలోకి తీసుకుంది.

ఈ పర్‌స్పెక్టివ్ చాల వివరాలతో కూడుకుని ఉంది గాని దానిలోని రాజకీయ, నిర్మాణ, సాంకేతిక పరమైన విషయాలు ప్రస్తుతానికి పక్కనపెట్టి, ఆర్థికాభివృద్ధి, పాలనా నిర్దేశాలను చూడడం ఆసక్తికరంగా ఉంటుంది.

ఈ గెరిల్లా జోన్ దశలో అనుసరించే నిర్దిష్ట నినాదాలుగా ఆరు నినాదాలను ఈ పర్ స్పెక్టివ్ సూత్రీకరించింది: 1. భూస్వాముల, ప్రభుత్వ ఆధిపత్యాన్ని కూలదోసి ప్రజల అధికారాన్ని నెలకొల్పడం. 2. భూస్వాముల, ఫ్యూడల్ సంస్థల భూమిని స్వాధీనం చేసుకుని భూమిలేని నిరుపేద రైతాంగానికి పంచిపెట్టడం. 3. భూస్వాములకు, వడ్డీ వ్యాపారులకు చెల్లించవలసిన అన్ని బాకీలు, వడ్డీలు నిలిపివేయడం. 4. ప్రభుత్వానికి పన్నులు, లెవీలు చెల్లించకుండా ఉండడం. 5. అడవిపై ఆదివాసి రైతాంగ అధికారాన్ని నెలకొల్పడం. 6. సాయుధ ప్రజా మిలీషియాను నిర్మించడం.

'చరిత్ర నిర్మాతలు ప్రజలే. సమాజ సంపదకంతటికీ సృష్టికర్తలు కష్టజీవులైన మెజారిటీ ప్రజలే. కాని రాజకీయాధికారం, ఉత్పత్తి సాధనాలను కలిగిన కొంతమంది దోపిడీదారులు ప్రజలు సృష్టిస్తున్న సంపదనంతా వారి స్వంతం చేసుకుంటున్నారు. దీనిని మార్చాలి. కష్టపడేవారికే ఉత్పత్తి సాధనాలు చెందాలి. ఈ అవగాహనతో ప్రస్తుతమున్న ఉత్పత్తి సంబంధాలను మార్చాలి. దోపిడీ వర్గాల అధికారానికి గ్రామం సాంఘిక పునాదిగా ఉంది కాబట్టి గ్రామస్థాయి నుండి ఉత్పత్తి సంబంధాలను, ఉత్పత్తి పంపకాలను మార్చడానికి గ్రామంలోని ప్రజలు తమ భవిష్యత్తును తామే ప్రజాస్వామ్య బద్ధంగా నిర్ణయించుకోవాలి. దీనిని సాధించడానికి, ప్రాథమికస్థాయిలో ప్రజల అధికారాన్ని నిర్వహించడానికి గ్రామరాజ్య కమిటీలను నిర్మాణం చేయాలి .... ఈ నిర్మాణం పార్టీ నాయకత్వంలో వ్యవసాయక విప్లవ కార్యక్రమాన్ని కొనసాగిస్తూ, అన్నిరకాల భూస్వామ్య దోపిడీ పీడనలను రద్దు చేయడానికి పోరాడేదిగా ఉంటుంది. ఇది స్థానికంగా పీడిత ప్రజలు సాధించుకున్న విజయాలను కాపాడేదిగా ఉంటుంది. ఇది అర్ధభూస్వామ్య - అర్ధవలస వ్యవస్థ యొక్క ఆర్థిక, రాజకీయ, సాంఘిక అంగాలన్నింటి ఆధిపత్యాన్ని దెబ్బకొడుతూ, ఆ స్థానంలో పీడిత ప్రజా రాజకీయాధికార సంస్థగా ఉంటుంది' అని ఈ పర్‌స్పెక్టివ్ రాసింది.

'అర్ధవలస-అర్ధభూస్వామ్య దోపిడీని కొనసాగిస్తూ సామ్రాజ్యవాదుల, దళారీ బూర్జువా భూస్వామ్య వర్గ ప్రయోజనాలను నెరవేర్చే ఆర్థిక విధానాన్ని నిర్మూలించడం మన లక్ష్యం. కాబట్టి గెరిల్లా యుద్ధం అభివృద్ధి చేయడానికి అనుగుణంగా మన నూతన ఆర్థిక విధానాన్ని పెంపొందించు కోవాలి. విప్లవ యుద్ధాన్ని అభివృద్ధి చేసే కేంద్ర కర్తవ్యంతో ఈ ఆర్థిక అభివృద్ధి విధానాలను అనుసంధానించాలి. విప్లవ యుద్ధానికి లోబడి ఉండాలి. అలాగే గెరిల్లా జోన్లు అస్థిరంగా ఉండి శత్రువు దాడులకు గురయ్యే ప్రమాదం దృష్ట్యా అభివృద్ధి కార్యక్రమాలు దీర్ఘకాలిక ప్రణాళికలు వేయకుండా సత్వరం పూర్తి చేయగలిగే కార్యక్రమాలను చేపట్టాలి. ఈ ఆర్థిక విధానం ద్వారా ప్రజల జీవనస్థాయిని మెరుగుపరిచి తద్వారా విప్లవ యుద్ధంలో వారు చురుకుగా పాల్గొనేలా ప్రోత్సాహపరచడం, గెరిల్లా బలగాలకు (ప్రజాసైన్యానికి) ఆహారమూ, ఇతర సరఫరాలూ గ్యారంటీ చేసే పరిస్థితులను సమకూర్చడం, ప్రజలను ఆర్థిక రంగంలో సమైక్యపరచడం ద్వారా ప్రజాస్వామిక ప్రజా రాజకీయాధికారాన్ని (గ్రామ రాజ్య కమిటీలను) మరింత సంఘటిత పరచడం మన లక్ష్యాలుగా ఉంటాయి. విద్య, ఆరోగ్యం, పారిశుధ్యం, పంపిణీ వ్యవస్థ లాంటి ప్రజా సంక్షేమ కార్యక్రమాలను కూడ అభివృద్ధి చేయాలి' అని ఈ పర్‌స్పెక్టివ్ రాసింది.

ఆర్థిక మెరుగుదల కోసం చేపట్టవలసిన చర్యలలో భూస్వాముల భూముల్ని ఆక్రమించుకుని వ్యవసాయకూలీ, పేదరైతాంగానికి పంచి పెట్టడం, భూమిని మరింత విస్తృతంగా వినియోగంలోకి తీసుకురావడం, పంటల దిగుబడిని పెంచడం, ఆహారపదార్థాలను పండించడానికి ప్రాధాన్యతనీయడం, ఎక్కువరకాల పంటలు పండించడం, ప్రత్యేకించి కూరగాయలను పండించడానికి ప్రాధాన్యత నివ్వడం, నీటి వసతిని పెంచడం, భూమిని సారవంతం చేసే పద్ధతులను అభివృద్ధి చేయడం, ప్రజల జీవనస్థాయిని పెంచే విధంగా ప్రజల వ్యవసాయ, అటవీ ఉత్పత్తుల అమ్మకాలను, ప్రజలకు కావలసిన నిత్యావసర సరుకుల కొనుగోళ్లను సమన్వయం చేస్తూ మార్కెట్‌ను నియంత్రించడం, తక్కువ వడ్డీరేట్లతో అప్పులిచ్చుకోవడాన్ని అనుమ తించడం, తాకట్టు వ్యాపారాన్ని పూర్తిగా రద్దు చేయడం, ఫైనాన్స్, చిట్‌ఫండ్ కంపెనీల మోసాలకు, బహుమతుల ప్రలోభాలకు, అధిక వడ్డీలు వగైరాలకు వ్యతిరేకంగా పోరాడడం, కుటీర, చిన్న పరిశ్రమలు నెలకొల్పడానికి ప్రోత్సహించడం, దూరప్రాంతాల నుంచి లోతట్టు అడవి ప్రాంతాలలోకి వేటకు రావడాన్ని అరికట్టడం, సంప్రదాయ వేట పేరుతో స్థానిక ప్రజలు వేటపై ఎక్కువ సమయాన్ని వెచ్చించడాన్ని నిరుత్సాహ పరచడం, ఆ సమయాన్ని ఉత్పత్తి కార్యక్రమాల్లో పాల్గొనేలా ప్రోత్సహించడం, సహకారోద్యమాన్ని బలంగా పెంపొందించడం, ఆదివాసి రైతాంగంలో ఉన్న వెనుకబాటుతనాన్ని క్రమక్రమంగా తొలగిస్తూ సమాజ జీవనానికి సంబంధించిన విశాల దృక్పథాన్ని పెంపొందించడం, వ్యవసాయ పనిముట్లను, విత్తనాల ధాన్యాన్ని సప్లై చేస్తూ, సహకార సంఘాల ద్వారా సమష్టిగా వాడుకునేటట్లు చేయడం వంటి అనేక కర్తవ్యాలను ఈ పర్ స్పెక్టివ్ నిర్దేశించింది.

ఈ మౌలిక అవగాహన ఆ తర్వాత కొనసాగిన ఆచరణ క్రమంలో సవరణలకూ, మెరుగుదలకూ, విస్తరణకూ దారితీసింది. ఈ అవగాహన 2000లో జరిగిన పీపుల్స్ వార్ పార్టీ కాంగ్రెస్ లోను, 2004లో జరిగిన

పీపుల్స్ వార్, ఎంసిసి ఐక్యతా ప్రయత్నాలలోను, 2007లో జరిగిన ఐక్యతా కాంగ్రెస్ లోను మరింత మెరుగులు దిద్దుకుంది. ఈ క్రమంలో భాగంగానే దండకారణ్య స్పెషల్ జోనల్ కమిటీ 2004 జూన్ 1 న విడుదల చేసిన జనతన సర్కార్ విధాన కార్యక్రమం ఈ అవగాహనను సమగ్రంగా ప్రకటించింది.

### జనతన సర్కార్ విధాన ప్రకటన

ప్రత్యామ్నాయ ప్రజానుకూల అభివృద్ధి గురించీ, ప్రజా పాలనా విధానాల గురించీ చాల వివరంగా చర్చించిన కీలకపత్రం 'జనతన సర్కార్ విధాన కార్యక్రమం'. రెండు భాగాలుగా ఉన్న ఈ కార్యక్రమంలో మొదటి భాగం జనతా ప్రజాస్వామిక ప్రభుత్వ మౌలిక విధానాలు – కర్తవ్యాలను, రెండో భాగం ప్రభుత్వ వ్యవస్థను చర్చించాయి.

'నూతనంగా ఏర్పడుతున్న జనతా ప్రజాస్వామిక రాజ్యవ్యవస్థగా, ప్రభుత్వాధికారంగా జనతన సర్కార్ ఉంటుంది. ఈ అధికారం దేశవ్యాపితంగా జనతా ప్రజాస్వామిక రిపబ్లిక్ ల సమాఖ్య ఏర్పాటుతోనే సంపూర్ణ స్వభావాన్నీ, రూపాన్నీ సంతరించుకుంటుంది' అని ఈ కార్యక్రమపు పరిచయం వర్తమానం లోని తక్షణ స్థితినీ, దీర్ఘకాలిక భవిష్యత్తు స్వభావాన్నీ ప్రకటించింది. 'భారతదేశంలో ఇప్పటివరకు ఏర్పడిన అన్ని రకాల రాజ్యవ్యవస్థల కంటే ఈ విప్లవ ప్రజా ప్రతినిధి సభలూ, వీటి విప్లవ ప్రజాకమిటీలూ అత్యుత్తమమైన నిజమైన ప్రజాస్వామిక వ్యవస్థలు' అని ఈ పరిచయం చెపుతుంది.

'భారత విప్లవ కేంద్ర కర్తవ్యం రాజకీయాధికారాన్ని గుంజుకోవడం. అర్ధవలస, అర్ధభూస్వామ్య రాజ్యాన్ని బద్దలుకొట్టి దాని రాజకీయాలనూ, ఆర్థిక వ్యవస్థనూ, సంస్కృతినీ ధ్వంసం చేసి నూతన ప్రజాస్వామిక రాజ్యాన్ని స్థాపించడం, దాని రాజకీయాలనూ, ఆర్థిక వ్యవస్థనూ, సంస్కృతినీ నెలకొల్పడం నూతన ప్రజాస్వామిక విప్లవం లక్ష్యం. ఈ లక్ష్యం సాధించడం ద్వారానే యావత్తు భారత సమాజం అభివృద్ధికి ద్వారాలు తెరుచుకుంటాయి. ప్రజల పేదరికం, వేదనా తొలగిపోతాయి.' అని ఈ కార్యక్రమం మౌలిక కర్తవ్యాలను నిర్వచించింది.

రెండో భాగంలో జనతన సర్కార్ ప్రభుత్వాల ఏర్పాటు, ప్రభుత్వ స్వరూపం, ప్రభుత్వ ఎన్నిక, ప్రభుత్వ పని విధానం, గ్రామ స్థాయి, ఏరియా స్థాయి జనతన సర్కార్ల మధ్య సంబంధాలు, రాజ్యాంగ సవరణ, ప్రభుత్వ కమిటీలు, ప్రభుత్వ శాఖలు వంటి అంశాలతో పాటు, ఆర్థిక, వ్యవసాయ, ప్రజారక్షణ, ప్రజాన్యాయ, ప్రజా విద్యా సాంస్కృతిక, ప్రజారోగ్య సామాజిక సంక్షేమ, అటవీ సంరక్షణ, ప్రజా సంబంధాల శాఖల కర్తవ్యాల గురించి వివరంగా చర్చించారు.

### ఎలా అమలయింది?

గెరిల్లా జోన్ల స్థాపన, అభివృద్ధి, విస్తరణలలో విప్లవోద్యమ అవగాహన మూడు దశాబ్దాల ప్రయోగాలు, విజయాలు, అపజయాలు, కొత్త విజయాల క్రమంలో వికసిస్తూ వచ్చిందని ఈ చారిత్రక వివరణ నిరూపిస్తుంది. ఈ గెరిల్లా జోన్లను, లేదా విప్లవ స్థావరాలను, గ్రామ రాజ్య కమిటీలను దండకారణ్యంలో, ఉత్తర తెలంగాణలో స్థాపించగలిగామని, వాటిని విస్తరించి దక్షిణ తెలంగాణ, దక్షిణ కోస్తా – రాయలసీమ, ఈస్ట్ రీజియన్, కోయల్ కైమూర్ లను కూడ గెరిల్లా జోన్లుగా మార్చాలని విప్లవోద్యమం 1999 నాటికి ఆశించింది. కాని ప్రస్తుత చలన యుద్ధ దశలో అనేక మార్పులు, చేర్పులు జరిగే అవకాశం ఉందని విప్లవోద్యమమే గుర్తించినట్టు మార్పులు, చేర్పులు జరిగాయి. దండకారణ్యం, బీహార్ జార్ఖండ్ లు తమ ప్రధాన గెరిల్లా జోన్లని, లాల్ గడ్, నారాయణపట్నాలలో ప్రజా రాజకీయాధికార సంస్థలు ఏర్పడుతున్నాయని 2010లో ఇచ్చిన ఒక ఇంటర్వ్యూలో మావోయిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి గణపతి చెప్పారు.

ఈ క్రమంలో ప్రజా ప్రత్యామ్నాయం అమలయి నిలదొక్కుకోగలిగిన ప్రాంతాలలో ప్రజలు సంఘటితంగా అనేక ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టారు. రోడ్లు వేసుకోవడం, బస్ స్టాండ్ల నిర్మాణం, దోబీ ఘాట్ లు నిర్మాణం, పాఠశాల గదుల నిర్మాణం, ఫర్నిచర్ సమకూర్చుకోవడం, ప్రైవేట్ టీచర్లను నియమించుకోవడం, తాగునీటి, సాగునీటి సమస్యలను స్వయంకృషితో పరిష్కరించుకోవడం, చెరువుల నిర్మాణం వంటి పనులు జరిగాయని నిజామాబాద్ జిల్లా కమిటీ 1996 మే లోనే సమీక్షించింది. సహకార సంఘాల ఏర్పాటులో అనుకూల ప్రతికూల అంశాలను, సమస్యలను, లోపాలను, పని విధానాన్ని సమీక్షించింది. భయంకరమైన నిర్బంధకాండ వల్ల ఉత్తర తెలంగాణలో ఈ ప్రత్యామ్నాయ నిర్మాణ ప్రయత్నాలు తాత్కాలిక వెనుకంజకు గురయినప్పటికీ దండకారణ్యంలో అనువైన భౌగోళిక పరిస్థితులవల్ల, విస్తృతమైన ప్రజా పునాది వల్ల, ప్రజా భాగస్వామ్యం వల్ల ఈ అభివృద్ధి నమూనా, గ్రామ రాజ్య కమిటీలు, జనతనా సర్కార్లు విస్తరించాయి. అవి క్రమక్రమంగా గ్రామ స్థాయి నుంచి ఏరియా స్థాయికీ, డివిజన్ స్థాయికీ, జోనల్ స్థాయికీ కూడ అభివృద్ధి చెందాయి. జనతనా సర్కార్లు నాలుగు దొంతరల వ్యవస్థలుగా, వ్యవసాయం, రక్షణ, న్యాయ, విద్యా, సంస్కృతి, ప్రచారం, వైద్యం, అటవీరక్షణ, ప్రజా సంబంధాలు, ఆర్థికం, వ్యాపారం, లఘుపరిశ్రమలు వంటి రంగాలను పర్యవేక్షించే తొమ్మిది శాఖలతో పాలన నెరపుతున్నాయి. అన్ని అధికారాలు జనతన సర్కార్లకే అనే నినాదంతో, పద్దెనిమిది సంవత్సరాలు నిండిన వయోజనులు ప్రతి మూడేళ్లకొకసారి జనతనా సర్కార్లను ఎన్నుకుంటారు. శాఖల నిర్వాహకుల పనితీరును, సర్కార్ నాయకుల వ్యవహారశైలిని ప్రతి ఆరు మాసాలకు ఒకసారి గ్రామ సభ సమీక్షిస్తుంది. విప్లవ ప్రజా కమిటీల సభ్యులను అవసరమైతే వెనక్కి పిలిచే అధికారం కూడ గ్రామ సభలకు ఉంటుంది.

ప్రాథమిక వైద్యం, ఆరోగ్యం, ప్రాథమిక విద్య, అడవుల సంరక్షణ, మహిళా భాగస్వామ్యం, నూతన ఉత్పత్తి పద్ధతులు, భూమి చదును కార్యక్రమాలు, ఆహార పంటలు, కూరగాయలు, పండ్లతోటలు, నూతన జీవన విధానం, రాజకీయ చైతన్యం, నూతన సంస్కృతి, విస్తారమైన ప్రజాసంఘాలలో ప్రజలు సంఘటితం కావడం, ప్రతినిధులను వెనుకకు పిలిచే హక్కుతో సహా గ్రామ ప్రజలందరూ పాల్గొని తమ కమిటీని ఎన్నుకునే గ్రామసభ, ఆ గ్రామసభకు జవాబుదారీగా గ్రామ అభివృద్ధిని నిర్వహించే గ్రామ రాజ్య కమిటీ లేదా విప్లవ ప్రజా కమిటీ ఏర్పాటు వంటి అనేక మార్పులు దండకారణ్య ప్రజాజీవితంలో జరిగాయి. 'దేశంలో మరెక్కడా లేని విధంగా దండకారణ్యంలో మావోయిస్టుల నాయకత్వంలో ప్రజల ప్రజాస్వామ్య రాజ్యాధికార సంస్థలు మొలకెత్తుతున్నాయి. పేద, భూమిలేని రైతులకు మూడులక్షల ఎకరాలకు పైగా సాగు భూములు లభించాయి. ఆ భూముల్లో మెరుగైన పంటలకు, అధిక ఉత్పత్తికి సామూహిక కృషి జరుగుతోంది. పిల్లలకు శ్రమను గౌరవించే శాస్త్రీయ విద్యావిధానాన్ని మాతృభాషలో బోధిస్తున్నారు. డాక్టర్లే

రోగుల వద్దకు వెళ్తున్నారు. ప్రజల సమక్షంలో ప్రజా తీర్పులు వెలువడుతున్నాయి. అన్ని రంగాలలో మహిళలకు సమాన అవకాశాలు, గౌరవం లభిస్తున్నాయి. ప్రజలే నిజమైన పర్యావరణ మిత్రులుగా అడవులను, వన్యజీవులను కాపాడుతున్నారు. ప్రకృతి సంపదలను దేశాభివృద్ధి కోసమే, ప్రజల సంక్షేమం కోసమే వినియోగించాలను కుంటున్నారు. అక్కడి ప్రజలు కూడు, గుడ్డ, నీడ, సమానత్వం, శాంతి, ప్రజాస్వామ్యం కోసం పోరాడుతున్నారు. దేశ అసమానాభివృద్ధిని మార్చడానికి అక్కడి ప్రజలు పోరాడ నడుం బిగించారు' అని పి. శంకర్ 2011 లో రాశారు.

ఈ మహత్తర ప్రయత్నం సులభంగా, సరళరేఖలా, అలవోకగా సాగలేదు. కేంద్ర ప్రభుత్వం, వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు విడివిడిగానూ ఉమ్మడిగానూ సాగించిన భయంకరమైన హింసకాండ, దమనకాండల మధ్యనే ఈ అభివృద్ధి నమూనా పుట్టి పెరిగి ఇవాళ్టికి నవయవ్వన దశకు చేరింది. దాదాపు వెయ్యి మంది నాయకులు, కార్యకర్తలు, ప్రజలు తమ ప్రాణాలు బలిపెట్టి ఈ విజయాల్ని సాధించారు. సల్వాజుడుం హంతక ముఠాల చేతుల్లో దాదాపు ఐదువేల మంది ఆదివాసులు ఈ ప్రత్యామ్నాయ నమూనాను సమర్థించినందుకు బలి అయిపోయారు. లక్షలాది మంది నిర్వాసితులయ్యారు. ఈ నిత్య నిర్బంధం మధ్యనే ఈ అభివృద్ధి నమూనా ఆలోచనలను నిరంతరం అమలు చేస్తూ, ఆచరణలో కనిపించిన లోపాలను సమీక్షించుకుంటూ, దిద్దుకుంటూ, మెరుగైన అవగాహనను మళ్లీ ఆచరణలో పరీక్షిస్తూ ఈ మార్గం సాగుతోంది. గత పద్దెనిమిది సంవత్సరాలలో అచ్చులో వెలువడిన సమీక్షలే డజనుకు పైగా ఉన్నాయంటే విప్లవోద్యమ నాయకత్వం ఎంత చిత్తశుద్ధితో, దీక్షతో, నిరంతర ఆలోచనాచరణలతో ఈ ప్రజా ప్రత్యామ్నాయాన్ని నిర్మిస్తున్నదో అర్థమవుతుంది.

'... మా పార్టీ నాయకత్వం కింద ఒక స్పష్టమైన వ్యూహంతో ప్రజానీకం సంఘటితపడుతూ, ప్రజాయుద్ధాన్ని తీవ్రతరం చేస్తూ, ప్రస్తుత దోపిడీ వర్గ పాలనకు ప్రత్యామ్నాయంగా నూతన రాజకీయాధికారాన్నీ, నూతన ఆర్థికాన్నీ, నూతన సంస్కృతినీ నెలకొల్పుతున్నారు' అనీ, 'మేం చెపుతున్న అభివృద్ధి ఐఎంఎఫ్, ప్రపంచబ్యాంకులు నిర్దేశించే 'అభివృద్ధి' కాదు, మాంటెక్ సింగ్ అహ్లువాలియాలు, రంగరాజన్‌లు, మన్మోహన్ సింగ్‌లు, చిదంబరాలు, జికె పిళ్లైలు రుద్దుతున్న 'అభివృద్ధి' కాదు. మేం ప్రతిపాదించే అభివృద్ధి విధానం ఉత్పత్తి సంబంధాలను మౌలికంగా మార్చి తద్వారా ఉత్పత్తి శక్తుల నిజమైన మౌలిక అభివృద్ధిని సాధించేది. అది ప్రజల సార్వభౌమత్వాన్ని విదేశీ కంపెనీలకు తాకట్టు పెట్టడాన్ని వ్యతిరేకించాలనీ, దేశ వనరులను సామ్రాజ్యవాదుల కోసం కాకుండా ప్రజల కోసమే ఉపయోగించాలనీ చెప్పే స్వతంత్రమైన, స్వావలంబన కలిగిన నిజమైన అభివృద్ధి విధానం' అని భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) ప్రధాన కార్యదర్శి గణపతి 2010లో ఇచ్చిన ఇంటర్వ్యూలో అన్నారు.

**భవిష్యత్తు**

ఈ అభివృద్ధి నమూనా ఇవాళ్టికి దేశంలో అతి చిన్న భాగంలో మాత్రమే అమలవుతోంది. దాని పరిమాణం రీత్యా చూసినప్పుడు అది చెప్పుకోదగ్గదిగా అనిపించదు. దేశపు మొత్తం ముప్పై లక్షల చ.కి.మీ. భూభాగంలో అది ఇంకా ఒక లక్ష చ.కి.మీ. లోపల మాత్రమే ఉంది, నూట ఇరవై కోట్ల జనాభాలో అది ఇంకా ఒక కోటి జనాభాను కూడ చేరలేదు. కనుక ఈ నమూనా పునరుత్పత్తి సాధ్యమయ్యే నమూనాయేనా, దానికి భవిష్యత్తు ఉందా అని శత్రువులు, విమర్శకులు ప్రశ్నిస్తున్నారు. ఈ పరిణామాలను ఆసక్తితో, సానుకూలంగా చూసేవారిలో కూడ కొందరిలో ఈ అనుమానాలు ఉన్నాయి. అలాగే ఇది వెనుకబడిన ప్రాంతం కావడం వల్ల సాధ్యమయింది గాని ఇతర ప్రాంతాలలో సాధ్యమవుతుందా అనీ, ఇది ఆదివాసి ప్రాంతం కావడం వల్ల, స్థిర వ్యవసాయ దశలోకి కూడ రాని సమాజం కావడం వల్ల సాధ్యమయింది గాని, బైటి సమాజంలో, పట్టణాలలో, ప్రపంచీకరణ తర్వాత మారిన సామాజిక విలువల నేపథ్యంలో సాధ్యమవుతుందా అనీ ప్రశ్నలు ఉన్నాయి. దాని విశిష్టతను అంగీకరించే వారిలో కూడ కొందరిలో ఇది రాజ్య అణచివేతను తట్టుకుని నిలబడగలుగుతుందా అని అనుమానాలు ఉన్నాయి.

నిజానికి గత మూడు దశాబ్దాల ఆచరణను, సైద్ధాంతిక అవగాహనల మెరుగుదలను, ఆయా ప్రాంతాల భౌతిక పరిస్థితులను, దేశమంతా పెంపొందుతున్న విప్లవానుకూల పరిస్థితులను, విప్లవోద్యమ నిర్మాణ కృషిలో నిమగ్నమైన స్వీయ మానసిక శక్తుల కఠోరదీక్షను, అంకితభావాన్ని పరిగణనలోకి తీసుకున్నప్పుడు ఈ ప్రశ్నలకు సులభంగా జవాబులు దొరుకుతాయి, అనుమానాలు నివృత్తి అవుతాయి. ఇటువంటి సామాజిక చారిత్రక పరిణామాలలో గ్రహించవలసినది పరిమాణం కాదనీ, గుణం అనీ తాత్విక స్పష్టత ఉంటే ఇవాళ విత్తనంగా ఉన్నది రేపు మహావృక్షం కావచ్చుననీ, ఇవాళ నీటి బొట్టుగా ఉన్నది రేపు మహోధృత ప్రవాహం కావచ్చుననీ అర్థమవుతుంది. ఈ ప్రయోగం అమలవుతున్న ప్రాంతం ఒక లక్ష చ,కి.మీ. లోపు మాత్రమే గనుక స్వల్పమైనదని అనిపించవచ్చు గాని మరొకవైపు నుంచి చూసినప్పుడు ప్రపంచంలోని 250 దేశాలలో కనీసం 140 దేశాల కన్న విస్తీర్ణంలో దండకారణ్యం పెద్దది. జనాభా రీత్యా దాదాపు 100 దేశాలు దానికన్న చిన్నవి.

దండకారణ్యం ప్రత్యేక స్థితి వల్లనే ఇది సాధ్యమయిందని, ఇతర చోట్ల సాధ్యం కాకపోవచ్చునని అనడం కూడ ఆ ప్రత్యేక స్థితిని అతిశయోక్తులతో చూడడమే. రాజ్య నిర్బంధం ఈ ఉద్యమాన్ని విస్తరించనిస్తుందా, నిర్మూలిస్తుందా అనేది కేవలం రాజ్యానికీ, ఉద్యమానికీ మాత్రమే సంబంధించిన విషయాలు కావు, రాజ్యాంగ యంత్రాన్ని ఇతరంగా చీకాకు పరచగలిగిన ప్రజాందోళనలు ఇతర ప్రాంతాలలో ఎంత విస్తరిస్తాయనే దానిమీద, విప్లవోద్యమానికి ఇతర ప్రాంతాల సంఘీభావం ఎంత ఉంటుందనే దాని మీద ఆ ఉద్యమ సుస్థిరత ఆధారపడుతుంది. అనేక ఒడిదుడుకులను, కష్టనష్టాలను ఎదుర్కొంటూనే ఆ ఉద్యమం దానికదిగా విస్తరిస్తోంది.

ఆ ఉద్యమ విశిష్టతలను అర్థం చేసుకోవడం, విశ్లేషించడం, ప్రచారం చేయడం, దానికి సంఘీభావాన్ని కూడగట్టడం బుద్ధిజీవుల బాధ్యత అని గుర్తించి, ఆ కృషిని నిరంతరం కొనసాగించిన ఆర్ ఎస్ రావు స్ఫూర్తిని మనలో ప్రతి ఒక్కరూ సంతరించుకున్నప్పుడు తప్పనిసరిగా ఆ ఉద్యమం మరింత బలోపేతమవుతుంది. ఇవాళ బీజరూపంలో ఉన్న ప్రయోగాలు విస్తృతమవుతాయి, సుస్థిరమవుతాయి.

**ఈ వ్యాస రచనలో ఉపయోగపడిన పుస్తకాలు:**


దండకారణ్య ఫారెస్టు కమిటీ, భారత కమ్యూనిస్టు పార్టీ (మా–లె) (పీపుల్స్ వార్) (1994) – దండకారణ్య విప్లవోద్యమం – ప్రభుత్వ అణచివేత, ప్రజల ప్రతిఘటన.

దండకారణ్య ఆదివాసి కిసాన్ మజ్దూర్ సంఘటన్ (1994) – మహారాష్ట్ర అడవుల్లో ప్రభుత్వ మారణకాండ.

రచయిత పేరు లేదు (1998?) 0 దండకారణ్యంలో నూతన విప్లవ రాజకీయాధికారంతో పాటు పెంపొందుతున్న విప్లవకర అభివృద్ధి – సహకార ఉద్యమాలు, ప్రచురణ లేదు

పి. శంకర్ (2002) – ఈ అడవి మాదే, ప్రాణహిత ప్రచురణలు, జింకిభద్ర.

భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) ( 2004) – పార్టీ కార్యక్రమం.

దండకారణ్య స్పెషల్ జోనల్ కమిటీ, భాకపా (మా–లె) (పీపుల్స్‌వార్) (2004) – జనతన సర్కార్ విధాన కార్యక్రమం

తూర్పు కనుమల ప్రచురణలు (2005) – విముక్తి ప్రాంత లక్ష్యంతో పురోగమిస్తున్న మన్యం పితూరీకి 25 వసంతాలు, తూర్పు కనుమల ప్రచురణలు, జింకిభద్ర.

ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం (2006) – రాజ్యమే తన ప్రజలపై యుద్ధం చేస్తే – చత్తీస్ ఘడ్ ఆదివాసీల మీద సాల్వాజుడుం హింస.

దిక్సూచి ప్రచురణలు ( 2006) – చత్తీస్ ఘడ్ ఆదివాసీ ప్రజలపై జరుగుతున్న మారణహోమమే 'సాల్వాజుడుం', దిక్సూచి ప్రచురణలు, జింకిభద్ర.

సాధన (2006) – సామ్రాజ్యవాద ప్రపంచీకరణలో భాగం ప్రజావికాసం పేరుతో ముమ్మరమవుతున్న ప్రభుత్వ బూటకపు సంస్కరణలు.

మానవహక్కుల వేదిక (2007) – ఆదివాసీ సమాజంలో అంతర్యుద్ధం,

దమయంతి బి డి (2009) – మండుతున్న గాయాలు – సల్వాజుడుం బాధిత మహిళల హృదయ స్పందనలు, విప్లవ రచయితల సంఘం.

సల్వాజుడుం పీడిత ఆదివాసీ ప్రజా సంఘీభావ కమిటీ (2009) – ఆదివాసీ సమాజంపై ప్రభుత్వ బహుముఖ యుద్ధం, దిక్సూచి ప్రచురణలు, జింకిభద్ర.

శబరి (కూర్పు) (2009) – దండకారణ్యంలో మహిళలపై రాజ్యహింస – ప్రతిఘటన, విప్లవ రచయితల సంఘం.

ఆదిరెడ్డి నల్లా (2009) – శ్యాం సంకలిత రచనలు, దిక్సూచి ప్రచురణలు, జింకిభద్ర.

రహమాన్, ఎం ఎం (2010) – చలో ఛత్తీస్ గఢ్ – దండకారణ్యంలో జర్నలిస్టు అనుభవాలు, లక్ష్మీ పబ్లికేషన్స్, చొప్పదండి.

ఆర్ ఎస్ రావు (2010) – కొత్తచూపు, వీక్షణం పబ్లికేషన్స్, హైదరాబాద్.

దమయంతి (2010) – గ్రీన్ హంట్ పేరుతో అమాయక ఆదివాసీలపై సాగుతోన్న వేట, విప్లవ రచయితల సంఘం,

శబరి (2010) – దండకారణ్య మహిళా ఉద్యమ చరిత్ర (1980–2009), విరసం ప్రచురణలు,

విరసం ప్రచురణలు (2010) – ముప్పై ఏళ్ల దండకారణ్య సాహితీ సాంస్కృతికోద్యమ చరిత్ర (1980–2010), విరసం ప్రచురణలు,

దండకారణ్య ఆదివాసీ కిసాన్ మజ్దూర్ సంఘ్, క్రాంతికారి ఆదివాసి మహిళా సంఘటన్, చేతనా నాట్య మంచ్ (2011) – చింతల్ నార్ ప్రాంతంలో ప్రభుత్వ బలగాల బీభత్సకాండ.

సాధన (2011) – గ్రీన్ హంట్ ఉత్పాతాలు, విప్లవ రచయితల సంఘం.

సింధూ కిరణ్ (2011) – దండకారణ్య ఉద్యమ ఆకాశంలో సగం, విప్లవ రచయితల సంఘం.

పి. శంకర్ (2011) – విముక్తి బాటలో విప్లవోద్యమం – 30 ఏండ్ల దండకారణ్యం

మైనా (2011) – ప్రజాయుద్ధంలో సగభాగమైన మహిళలు.

భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) (2011) – జాతీయ అంతర్జాతీయ పరిస్థితులు – మావోయిస్టు దృక్పథం, దిక్సూచి ప్రచురణలు, జింకిభద్ర.

ఉత్తర తెలంగాణ స్పెషల్ జోనల్ కమిటీ (2011) – సర్క్యులర్‌ల సంకలనం 1 (1995–2002).

సాధన (2011) – విముక్తి యుద్ధంలో వికసిస్తున్న ప్రజాసాహిత్యం – సంస్కృతి.

చైతె మడావి (2012) – మాడ్ ప్రాంతంపై ప్రభుత్వ సాయుధ బలగాల 'ఆపరేషన్ విజయ్', 'ఆపరేషన్ హాకా' లను ఖండించండి.

దమయంతి బిడి (2012) – విముక్తి బాటలో నారాయణపట్నా, విప్లవ రచయితల సంఘం.

పాణి (2012) – అంతర్యుద్ధంలో ఆదివాసులు – విప్లవ ప్రత్యామ్నాయం, విప్లవరచయితల సంఘం.

పాణి (2012) – చింతల్నార్ – బాసగూడా మారణహోమం – విప్లవ జనతన సర్కార్ నేపథ్యం, విప్లవ రచయితల సంఘం.

విప్లవ రచయితల సంఘం (2012) – దండకారణ్యంలో గ్రీన్ హంట్ – ప్రతిఘటన – మన కర్తవ్యం.

విప్లవ రచయితల సంఘం (2012) – ప్రజలపై యుద్ధం – ఆపరేషన్ గ్రీన్ హంట్ వ్యతిరేక వ్యాసాలు.

గూండాదర్ (2012) – రెండో దశకు చేరిన ఆపరేషన్ గ్రీన్ హంట్ – ప్రజలు, ప్రజాస్వామికవాదుల కర్తవ్యాలు, దిక్సూచి ప్రచురణలు, జింకిభద్ర.

'విభిన్న ఆంతరంగిక పోరాటాల ద్వారా పీపుల్స్ వార్ పార్టీ అభివృద్ధి క్రమం – రెక్టిఫికేషన్ కేంపెయిన్' ఐదో సంపుటం, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర కమిటీ సిద్ధాంతపత్రిక 'ఎర్రజెండా', ఉత్తర తెలంగాణ స్పెషల్ జోనల్ కమిటీ సిద్ధాంత పత్రిక 'గెరిల్లా సందేశం' వేరువేరు సంచికలు, దండకారణ్య విద్యావిధానంలో భాగంగా వెలువడిన అక్షరకిరణం, చరిత్ర, భౌతికశాస్త్రం, జీవశాస్త్రం, భూగోళశాస్త్రం పాఠ్యపుస్తకాలు.

All India People''s Resistance Forum (1993) -- Bastar: Pro-Imperialist Development Strategy Versus People''s Struggles, AIPRF, Nagpur.

Biplabi Yug (2000) -- New Peoples Power in Dandakaranya, Biplabi Yug Publications, Calcutta.

Communist Party of India (Marxist -- Leninist) (People''s War) (1995) -- All India Special Conference Bulletin.

CPI (Maoist) Chattisgarh State Committee (2006) -- Salwa Judum -- A ''New Front'' of ''Hidden War''.

Dandakaranya Adivasi Kisan Mazdoor Sanghatan (1994) -- Adivasi Peasant Movement of Maharashtra.

Dandakaranya Forest Committee, CPI (M-L) (People''s War) (1994) -- Dandakaranya Revolutionary Movement: Government''s Repression and People''s Resistance.

Human Rights Forum (2006) -- Death, Displacement and Deprivation -- The War in Dantewara: A Report.

Independent Citizens'' Initiative (2006) -- War in the Heart of India -- An Enquiry into the Ground Situation in Dantewara District, Chattisgarh.

Krantikari Adivasi Mahila Sanghatan (1993) -- Dandakaranya Women''s Movement, All India League for Revolutionary Culture, Hyderabad.

Myrdal, Jan (2012) -- Red Star over India -- As the Wretched of the Earth are Rising, Setu Prakashani, Kolkata.

Revolutionary Democratic Front (2012) -- The Bijapur Massacre -- A Compilation of Statements, Ground Reports, Essays and News, RDF, Hyderabad.

Roy, Arundhati (2011) -- Broken Republic, Penguin Books, New Delhi.

Sanhati (2011) - Sanhati Selelctions 2011, Kolkata.

Satnam (2010) -- Jangalnama -- Travels in A Maoist Guerilla Zone, Penguin Books, New Delhi.

Sundar, Nandini (2009) -- Subalterns and Sovereigns -- An Anthropological History of Bastar (1854-2006), Oxford University Press, New Delhi.

Vanaja C (2006) -- Parallel Government in Dandakaranya.

Different issues of People''s War, the organ of the CPI (M-L) (People''s War), Maoist Information Bulletin as well as a number of reports and special stories appeared in mainstream press.


(ఈ వ్యాసపు ప్రథమ రూపం 2012 నవంబర్ 11న హైదరాబాద్‌లో జరిగిన ఆర్ ఎస్ రావు స్మారక సదస్సులో సమర్పించడం జరిగింది.)

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

# బయో డీజిల్ - ఆహారానికి రోకలిపెట్టు

***బహుళజాతి కంపెనీల లాభాల కోసం, మానవ మనుగడకు అవసరమైన ఆహార పంటలను విధ్వంసం చేయడమే బయో డీజిల్ లక్ష్యమని అంటున్నారు* జి. రఘురాం**

తన అవసరాల కోసం, ఆర్థిక ఆధిపత్యం కోసం, యూజ్ అండ్ త్రో ఎకానమీ కోసం, నిష్ఫలమైన సంస్కృతి జీవన విధానాల కోసం అమెరికా, మరికొన్ని యూరప్ దేశాలు, వాటిలోని బహుళజాతి కంపెనీలు ప్రపంచాన్నంతా ఉండగా చుట్టి, ప్రకృతి వనరుల్ని దోచుకొని జీవ వైవిధ్యాన్ని నాశనం చేస్తున్నాయి. లాభాల కోసం జీవ వైవిధ్యాన్ని వెంటాడి, వేటాడడం మొదలుపెట్టింది బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ అయితే, దాన్ని తారాస్థాయికి తీసుకెళుతోంది అమెరికా బహుళజాతి కంపెనీలు. వీళ్లు మొదటగా కొన్ని భావావేశాలను, అభిప్రాయాలను, ఆలోచనలను ప్రపంచవ్యాప్తంగా వెదజల్లుతారు. వాటి మీద మధ్యతరగతి మేధావులు మీడియాలో, పత్రికల్లో, విశ్వవిద్యాలయాల్లో మేధో చర్చ మొదలు పెడతారు. ఇది పెద్ద సాంస్కృతిక వైవిధ్య ఉద్యమంలా కొనసాగుతోంది. చివరికి వీటన్నిటి ప్రయోజనాలూ ఒకటే. అప్పటికే అనేక శాస్త్రీయ పరిశోధనల్లో భాగంగా కనుగొన్న నూతన ఆవిష్కరణలనూ, ప్రయోగాలనూ వస్తుగతంగా మార్చి చివరికి వాటిని సరుకులుగా, వినియోగ వస్తువులుగా మార్చి ప్రపంచ వ్యాప్తంగా అమ్ముకోవడం, ప్రపంచాధిపత్యాన్ని సాధించడం. ఈ ప్రయోగాలకూ, నూతన ఆవిష్కరణలకూ మొదటగా గురయ్యేది ప్రకృతి జీవావరణం, జీవ వైవిధ్యం. ఆ తరువాత వీటిని లక్షల సంవత్సరాల నుండి కాపాడుతూ జీవనాన్ని సాగిస్తున్న పేద దేశాలలోని ప్రజలు, ఆదివాసులు, మూలవాసులు, వెనుకబడిన అనేక జాతులు, వర్గాలు, కూలీలు, స్త్రీలు.

వీరికి ప్రకృతితో, జీవావరణంతో ఉన్న పరస్పర ఆధారిత వ్యవస్థలను తెలుసుకొని ఏ వ్యవస్థా నాశనమవకుండా వేల సంవత్సరాల నుండి ఒక ఆచారంగా, సంప్రదాయంగా వస్తున్న ప్రకృతి వనరుల ఉపయోగాన్ని లాభాపేక్షతో కాకుండా ప్రజల, జనసమూహాల జీవనం కోసం, నిజమైన అభివృద్ధి కోసం, సమాజం సమగ్రమైన ఉనికి కోసం ప్రకృతి వనరుల్ని ఉపయోగించుకుంటూ రాబోయే తరాల కోసం మళ్లీ మళ్లీ ప్రకృతి వనరులు ఉపయోగపడేటట్లు అద్భుతమైన సంప్రదాయ ఉత్పత్తి విధానాన్ని ఆచరిస్తూ ఉంటారు.

అయితే తన ప్రసార సాధనాల ద్వారా వస్తు వ్యామోహాన్ని, లౌల్యత్వాన్ని పెంచి పోషించి ఇదే నాగరికత అభివృద్ధి అని భ్రమింప చేస్తూ, ప్రతి ఉద్వేగానికీ, ప్రతి ఆలోచనకూ, ప్రతి భావానికీ ఏదో ఒక నిష్ప్రయోజనమైన అసంబద్ధమైన సరుకుని, సాంకేతికంగా అమరుస్తూ ప్రపంచాన్నంతా తన ఉత్పత్తులతో ముంచెత్తే బహుళజాతి కంపెనీలకు ఈ సంప్రదాయ జీవ వైవిధ్య ప్రకృతి రక్షక ఉత్పత్తి విధానం పట్ల గొప్ప ఏహ్యాభావం ప్రదర్శిస్తూ ఉంటుంది. అందుకే ప్రపంచదేశాల సహజ వనరులను కొల్లగొట్టడానికి చరిత్రలో ఎన్నో ఎత్తుగడలేశారు. ప్రపంచ యుద్ధాలకు ముందు వలస పాలనలతో పేద దేశ ప్రజలు బానిసలుగా బతికితే, మరో పక్క ఆ దేశాలలోని సహజ వనరులను హద్దూ అదుపూ లేకుండా నాశనం చేశారు. దీని కారణంగా వచ్చిన రెండు ప్రపంచ యుద్ధాలతో మేల్కొని దీన్నే మరో రూపంలో కొనసాగించడానికి అమెరికా, బ్రిటన్ జి–7 దేశాలు, ఐక్యరాజ్య సమితి, ఇంటర్నేషల్ మానిటరీ ఫండ్ (ఐఎంఎఫ్), ప్రపంచ బ్యాంక్, డబ్ల్యుటిఒలను రంగంలోకి తెచ్చాయి. ఇవి ప్రపంచ దేశాలను అనేక ఆర్థిక దిగ్బంధనాల్లోకి దిగ్గొట్టి జీవ వైవిధ్యాన్ని నాశనం చేసే విపరీతమైన ప్రకృతి వనరుల నాశనానికీ, ఉత్పత్తి విధానానికీ దేశ ఆర్థిక, రాజకీయ, సామాజిక వ్యవస్థలను దారి మళ్లించి, దిగజార్చి ఆ దేశాల జీవ వైవిధ్యాన్ని వాళ్లంతట వాళ్లే నాశనం చేసుకునేటట్లుగా ఈ బహుళజాతి సంస్థలు వీలు కల్పిస్తాయి. ఈ కుట్రలో మధ్యవర్తిగా, పెద్ద మనిషిగా వ్యవహరించేది యుఎన్ఒ. పథకాన్నంతా అమలు జరిపేది ప్రపంచబ్యాంక్, ఐఎంఎఫ్. వీటి ఆధ్వర్యంలోనే బొలీవియా, ఇథియోపియా, ఆర్జెంటీనా, థాయిలాండ్, సౌత్ కొరియా, ఇండోనేషియా, ఫిలిప్పైన్స్, సొమాలియా, రువాండా, ఘనా, బ్రెజిల్ దేశాలలోని ఆర్థిక వ్యవస్థలు తలకిందులయ్యాయి.

అమెరికా ఆధ్వర్యంలోని ఐఎంఎఫ్, ప్రపంచ బ్యాంక్, యుఎన్ఒని మధ్యవర్తిగా పెట్టి అప్పులు వెదజల్లుతాయి. తరువాత మౌలిక సదుపాయాల (స్ట్రక్చరల్ అడ్జెస్ట్‌మెంట్స్) రూపకల్పన పేరిట ఆయా దేశాలలోని ప్రభుత్వాలు ప్రజలకిచ్చే రాయితీలను, సబ్సిడీలను ఎత్తివేస్తాయి. తద్వారా ఉత్పత్తి వ్యయాన్ని పెంచేస్తాయి. ఎగుమతులకు, దిగుమతులకు తలుపులు బార్లా తెరుస్తాయి. దీంతో దేశీయ ఉత్పత్తులు పోటీలో నెగ్గుకురాలేవు. పర్యవసానం విదేశీ అప్పులు, దాని వడ్డీలు, వీటిని తీర్చడానికి స్థానిక సంప్రదాయ ఉత్పత్తులు అధికంగా ఉత్పత్తి చేసి ఎగుమతి చేయడం, దానికోసం ప్రకృతి వనరుల్ని మరింతగా వాడుకోవడం, నాశనం చేయడం. అయినా డాలర్ల అప్పు తీరదు. మళ్లీ యుఎన్ఒ సలహా మేరకు భారీ పరిశ్రమల అభివృద్ధి. వీటిల్లోకే బహుళజాతి సంస్థల ప్రవేశం. మళ్లీ విదేశీ అప్పులు. ఈసారి గనుల తవ్వకం, అడవి నాశనమవడం. కలప, బొగ్గు వెలికి తీయడం, వ్యవసాయరంగాన్ని దేశ ప్రజల ఆకలి తీర్చడానికి కాకుండా ఎగుమతుల కోసం సమూలంగా మార్చేయాలి. పాడి పరిశ్రమలను, సముద్ర ఉత్పత్తులను పెంచాలి. తీర ప్రాంతాలలో మందుల కంపెనీలు, కెమికల్ ఫ్యాక్టరీలు పెట్టి నదుల్ని, సముద్రాల్ని కాలుష్యం చేయాలి. సెజ్ కారిడార్‌లని అనుమతించాలి. వీటన్నిటికీ అప్పనంగా రకరకాల రాయితీలనివ్వాలి, భూముల్నివ్వాలి, కరెంట్ ఇవ్వాలి, నీటినివ్వాలి. అందుకోసం థర్మల్ పవర్ స్టేషన్‌లు ప్రజల ప్రాణాల్ని హరించే అణు ధార్మిక పవర్ స్టేషన్‌లు, పెద్ద పెద్ద ఆనకట్టలు, వేలాది గ్రామాలు మునిగిపోవాలి, లక్షలాది ప్రజలు నిర్వాసితులవ్వాలి. లక్షల ఎకరాల అడవి మునిగిపోవాలి. జీవ వైవిధ్యం, వేల జాతుల మొక్కలు, జీవులు అంతరించిపోవాలి.

వీళ్లు ఈ దోపిడీని కొనసాగించడానికి ఒక్కొక్కసారి ఒక్కొక నిర్మాణాన్ని రంగంలోకి తెస్తారు. యుఎన్ఒ, ఐఎంఎఫ్, డబ్ల్యూటిఒ, ప్రపంచ బ్యాంక్ పాతబడిపోయాయి. ఇప్పుడు కొత్తగా 1992లో ఏర్పడ్డ జీవ వైవిధ్య సదస్సు రంగంలోకొచ్చింది.

ఈ సదస్సు ద్వారా వారికి కావాల్సిన దేశాలలో వారికి కావాల్సిన ఉత్పత్తుల్ని అక్కడి ప్రకృతిని కొల్లగొట్టి అక్కడి జీవ వైవిధ్యాన్ని నాశనం చేసి వాళ్ల స్వావలంబనని దెబ్బతీసి అన్నిటికీ బహుళజాతి కంపెనీలపైన ఆధారపడేటట్లుగా చేయడమే ఈ జీవ వైవిధ్య సదస్సుల ప్రధాన లక్ష్యం. అనేక బహుళజాతి కంపెనీల ఏజెంట్లు, మానసపుత్రులు వాళ్లచే పెంచి పోషింపబడ్డ మేధావులు ఈ సదస్సులో ప్రకృతి వేణుగానాన్ని ఆలాపిస్తారు. వాదోపవాదాలు చేస్తారు. గొప్పగా నటించేస్తారు. ప్రకృతి కోసం కన్నీరు కారుస్తారు. తామే నిజమైన జీవావరణ, పర్యావరణ రక్షకులుగా ఫోజులు కొడతారు. చివరికి అందరూ ఒకటై చెట్టాపట్టా చేతులు కలిపి ఏకాభిప్రాయానికొచ్చేస్తారు. మోసపోయేది ఎవరయ్యా అంటే పేద దేశాల ప్రజలు, వారి పర్యావరణం, ప్రకృతి, జీవ వైవిధ్యం. ఈ విషయం హైదరాబాద్ జీవ వైవిధ్య సదస్సులో స్పష్టంగా అర్థమైంది.

ముందుగా ప్రకటించిన, చర్చించుకోవాల్సిన పదిహేడు అంశాలను తూతూ మంత్రంగా చర్చిస్తూ నగోయిమా సదస్సులో అనుకున్న ప్రోటోకాల్స్ (నియమ నిబంధనలను)ను పక్కనపెట్టి బహుళజాతి కంపెనీలకు, ముఖ్యంగా మోన్‌శాంటో విత్తనాల కంపెనీకి అనుకూలంగా సజీవ జన్యుమార్పిడి జీవుల (లైవ్ జెనిటికల్లీ మాడిఫైడ్ ఆర్గానిజమ్స్) అంటే జన్యుమార్పిడి విత్తనాల అమ్మకం గురించి, అలాగే అమెరికా యూరప్ దేశాల అవసరం కోసం బయో డీజిల్ అంటే జీవ ఇంధనం గురించి చర్చలు వాదోపవాదాలు మొదలు పెట్టారు. ఈ రెండింటినీ ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా ముఖ్యంగా ఆసియా, ఆఫ్రికా దేశాలలో (ఎందుకంటే ఇక్కడున్న జీవ వైవిధ్యం అపారమైంది. దీన్నంతా దోచుకు పోవడమే ఈ సదస్సు లక్ష్యం) అమలు పరచాలి. ప్రపంచ జీవ వైవిధ్యాన్ని నాశనం చేయడంలో ఇవి ఎంత ప్రమాదకరమైనవో పేద దేశాల ప్రజల నోట్లోని కూడు ఎలా లాక్కుంటాయో బయో డీజిల్‌ను ఉదాహరణగా తీసుకొని తెలుసుకుందాం.

ప్రపంచంలో అత్యధికంగా కార్లను ఉపయోగించే దేశం అమెరికా. దీని జనాభా 35 కోట్లు. రిజిష్టరైన కార్ల సంఖ్య 26 కోట్లు. రిజిష్టర్ కాని కార్ల సంఖ్య మరో 80 లక్షలు. ఇతర వాహనాలన్నిటితో కలుపుకుంటే మొత్తం వాహనాల సంఖ్య సుమారు అటు ఇటుగా 29 కోట్లు. బ్రిటన్ జనాభా 6.5 కోట్లు. అక్కడి కార్ల సంఖ్య 3.5 కోట్లు. ఇంక జర్మనీ, జపాన్, కెనడా, ఇటలీ, ఫ్రాన్స్ లాంటి దేశాలతో కలుపుకుంటే మొత్తం ప్రపంచంలోని 80 కోట్ల కార్లలో 50 కోట్ల కార్లు ఇక్కడే ఉన్నాయి. అమెరికా సంవత్సరానికి 90 లక్షల కార్లని ఉత్పత్తి చేస్తుంది. ఇప్పుడు చైనా సంవత్సరానికి 110 లక్షల కార్లని ఉత్పత్తి చేస్తోంది. అమెరికాలో 80 శాతం మంది ఉద్యోగస్తులు పనిచేసే స్థలానికి కార్లమీదే వెళతారు. ప్రపంచ వ్యాప్తంగా ఉత్పత్తి అయ్యే పెట్రోల్‌లో అమెరికా వాడకం 21 శాతం. సంవత్సరానికి 700 కోట్ల బ్యారెళ్ల ముడి చమురును అమెరికా దిగుమతి చేసుకుంటోంది. ఈ క్రూడ్ ఆయిల్ కోసమే అరబ్ దేశాలతో క్రూరమైన రాజకీయాలు నడుపుతోంది. వాళ్ల నేతల్ని మారుస్తోంది. కుదరకపోతే యుద్ధాల పేరిట లక్షలాది ముస్లింలను చంపుతోంది. నాయకులను ఉరి వేస్తుంది. హత్య చేస్తుంది. చివరికి ఒక మతాన్ని ప్రపంచ తీవ్రవాదులుగా ముద్రవేసింది. అయినా దాని విలాసాల కోసం క్రూడ్ ఆయిల్ చాలడం లేదు. అందుకే ఇప్పుడు బయో డీజిల్ నినాదాన్ని రంగంలోకి తెచ్చింది.

## బయో డీజిల్

వృక్ష సంబంధమైన నూనెలలో, ఆహార పదార్థాలలో ఇథనాల్ ఉంటుంది. దీన్ని నేరుగా లేదా డీజిల్‌కి గాని, పెట్రోల్‌కి గాని కలిపి వాడవచ్చు. ఆ రకంగా వేన్నీళ్లకి చన్నీళ్లుగా ఈ ఇంధనం వాడకం మన అవసరాలన్నీ తీరుస్తుంది. దీన్ని మొక్కజొన్న, చెరుకు, తీపి బంగాళాదుంప స్వీట్ బిట్స్, తీపి జొన్నలు లాంటి ఆహార ధాన్యాల నుంచి, పంటల నుంచి తయారు చేస్తారు. అంతేకాక, 'జట్రోఫా కారకస్' అనే మొక్క విత్తనాల నుండి వచ్చే నూనెతో కూడా బయో డీజిల్ తయారు చేస్తారు.

అమెరికా ప్రస్తుతానికి బయో డీజిల్ కోసం మొక్కజొన్న విత్తనాల మీదే ఆధారపడుతోంది. దీనికోసం మొక్కజొన్న రకాల్ని ఎలా విధ్వంసం చేస్తోంది, దీనికయ్యే ఖర్చు, ఇది ఇచ్చే శక్తి ఎలా ఉంటుందీ పరిశీలిద్దాం.

బయో డీజిల్ కోసం ఎక్కువగా చెక్కర పదార్థాలుండే మొక్కజొన్న విత్తనాలను జన్యుపరంగా మార్పిడీ చేసి వాడుతున్నారు. సుమారు యాభైకి పైగా ఉన్న మొక్కజొన్న జాతులు దీనివల్ల అంతరిస్తున్నాయి. వీటన్నింటిలో మానవజాతికి అవసరమయ్యే ప్రోటీన్‌లు, విటమిన్‌లు, మినరల్స్ పుష్కలంగా ఉండే జాతులు ఇవి. మొక్కజొన్న పంటకి అత్యధికంగా నీరు కావాలి. ఎందుకంటే ఎక్కువ దిగుబడి కోసం మరే ఇతర పంటల కన్నా ఎక్కువ నత్రజని సంబంధిత ఎరువులను వాడాలి. దీనికనుగుణంగా ఎక్కువ పురుగు మందులను కూడా వాడాలి. పర్యవసానంగా ఇతర పంటలకన్నా 25 శాతం నీటిని ఎక్కువగా వాడాలి. వర్షం లేని రోజుల్లో వందల అడుగుల లోతు నుంచి నీటిని వాడాలి. ఈ శక్తి ఖర్చును ఉత్పత్తి ఖర్చులో చేర్చడం లేదు. ఎక్కువ పురుగు మందులను విమానాల నుంచి చల్లుతారు. ఈ శక్తి ఖర్చు అదనం. అలాగే పర్యావరణ నాశనం కూడా. మిగతా పంటలతో పోలిస్తే ఎక్కువ. పంటకి వాడిన తరువాత బైటికి వచ్చే నీటిని తరలించడం ఒక సమస్య. దీంట్లో అధికంగా పురుగు మందులు, ఎరువు ఉండి పోతున్నాయి. వీటి వల్ల భూమి కోతకు గురై నదుల్లో కలిసిపోతుంది. లక్షల ఎకరాలు కేవలం మొక్కజొన్న పైరుల పెరుగుదలవల్ల నేల సారం దెబ్బతినడమే కాక జీవ వైవిధ్యం కోల్పోతుంది.

పండిన కంకులను, విత్తనాలను బయో డీజిల్ ఫ్యాక్టరీలకి తరలించడంలో లక్షల గ్యాలన్‌ల డీజిల్ ఖర్చవుతోంది. ఈ విత్తనాలను పులియబెట్టడం, దానికోసం రకరకాల ఎంజైములు ద్రావణాలు కలపడం వీటన్నిటికీ అధికంగా నీరు ఉపయోగించడం, మళ్లీ ఆ నీరు పారబోస్తే దాంట్లో ఉండే రసాయనాలు భూమిలోకి వెళ్లి భూగర్భ జలాలను అడ్డుకోవడం, వీటిలో ఉన్న రసాయనాల వల్ల పర్యావరణం దెబ్బ తినడం. ఇవన్నీ జీవవైవిధ్యాన్ని నాశనం చేసే చర్యలే. పది కేజీల విత్తనాలను సుమారు యాభై లీటర్‌ల నీటితో పులియబెట్టాలి. తరువాత వీటికి కొన్ని ఎంజైములు కలిపి వంద లీటర్‌ల ద్రావణం నుంచి ఎనిమిది లీటర్‌ల ఇథనాల్‌ని రాబట్టాలి. దీనికోసం ఈ ద్రావణాన్ని దఫ దఫాలుగా కడిగి మరగబెట్టి, ఆవిరి చేసి, రసాయనాలు కలిపి, వీడగట్టి చివరికి ఇథనాల్ రాబడతారు. మొత్తం ఈ ప్రక్రియలో అనేక విష రసాయనాలు, కలుషిత నీరు, విష వాయువులు వెలువడతాయి. 95 శాతం స్వచ్ఛమైన ఇథనాల్‌ని రాబట్టడానికి ఒక లీటర్‌కి 12 నుంచి 15 లీటర్‌ల నీరు వాడతారు. అయినా ఈ ఇథనాల్ అంత ఉపయోగకారి కాదు. అందుకే 99.8 శాతం స్వచ్ఛమైన ఇథనాల్‌ని రాబట్టడానికి మళ్లీ అధికంగా నీరు కలపాలి.

మొక్కజొన్న సాగులో అయ్యే నీటి పారుదల క్రిమి సంహారక మందులు, ఎరువులు మొక్కజొన్న రవాణాకి అయ్యే ఇంధనం ఖర్చుని లేదా శక్తి ఖర్చుని లెక్కలోకి తీసుకుంటే 1.35 లీటర్‌ల ఇథనాల్ నుంచి

వచ్చే శక్తి ఒక లీటర్ పెట్రోల్ నుంచి వచ్చే శక్తితో సమానం. శక్తి ఉత్పత్తి ఎలా ఉండాలంటే ఇథనాల్ తయారీ కోసం మనం వినియోగించే శక్తి కన్నా మనకి దాని నుండి వెలువడే శక్తి ఎక్కువగా ఉన్నప్పుడు మాత్రమే ఆ ఇంధనం మనకి ఉపయోగపడుతుంది. దీంతో అక్కడి బహుళజాతి సంస్థలు అమెరికా ఫెడరల్ ప్రభుత్వంపై లక్షల ఎకరాల్లో మొక్కజొన్న పంటల్ని పండిస్తోంది. గత సంవత్సరం ఈ సబ్సిడీ విలువ 140 కోట్ల డాలర్లు.

ప్రస్తుతం అమెరికా 22 లక్షల హెక్టార్‌లలో మొక్కజొన్నను కేవలం బయో డీజిల్ కోసం పండిస్తోంది. 170 కోట్ల గాలన్‌ల ఇథనాల్‌ని రాబడుతోంది. ఇది 110 కోట్ల గ్యాలన్‌ల పెట్రోల్‌కి సమానం. ఇది మొత్తం అమెరికా ఉపయోగించే పెట్రోల్‌లో 1 శాతం మాత్రమే. బయో డీజిల్ ద్వారా 10 శాతం పెట్రోల్ అవసరాన్ని తీర్చుకోవాలని ప్రణాళిక సిద్ధం చేసుకుంటోంది. దానికోసం రెండు కోట్ల యాభై లక్షల నుంచి మూడు కోట్ల హెక్టార్‌ల మొక్కజొన్న పంట అవసరమవుతుంది. ఈ బయో డీజిల్ వ్యామోహాన్ని మెక్సికో ఇతర లాటిన్ అమెరికా దేశాలకు అమెరికా ఎగుమతి చేసింది. బ్రెజిల్ చెరకు పంట నుంచి, మొలాసిస్ నుంచి బయో డీజిల్ తయారు చేస్తోంది. నిజానికి చెరుకు పంట బయో డీజిల్ ఉత్పత్తికి ఉత్తమమైన పంట. అయినా కూడా దీన్నించి రాబట్టే శక్తి పెట్రోల్‌తో పోల్చుకుంటే ఎక్కువే. ఒక గ్యాలన్ ఇథనాల్‌ని బ్రెజిల్ ప్రభుత్వం 85 సెంట్లకి అమ్ముతోంది. దీని తయారీకి అయ్యే ఖర్చు 1.25 డాలర్లు. ఇది వాళ్ల దేశ ఆర్థిక వ్యవస్థను తీవ్రంగా దెబ్బతీస్తోంది. అమెరికాలో కూడా బయోడీజిల్ సబ్సిడీ తలకు మించిన భారమవుతోంది. రైతులందరూ మొక్కజొన్న పంటని బయో డీజిల్ కోసం తరలించడం వల్ల పశువులకు, ముఖ్యంగా దున్నలకు, పందులకు వేసే దాణా ఖరీదు పెరిగిపోతోంది. దీంతో మాంసం ధర గత సంవత్సరం వంద కోట్ల డాలర్ల మేరకు పెరిగిపోయింది. ఈ నేపథ్యంలోనే తన అవసరాలను దృష్టిలో పెట్టుకునే ప్రపంచవ్యాప్తంగా జీవ వైవిధ్య సదస్సుల ద్వారా జీవ ఇంధన ఉత్పత్తిని, వాడకాన్ని ప్రచారం చేస్తోంది. ఇప్పటికే యూరప్, లాటిన్ అమెరికా దేశాల్లో పెద్ద ఎత్తున లక్షల ఎకరాల్లో మొక్కజొన్న, చెరకు, జొన్న పంటల్ని సాగు చేస్తున్నారు. దీనివల్ల ప్రతి సంవత్సరం యూరప్‌లో మూడు అడుగుల మేరకి భూగర్భ జలాలు ఇంకిపోతున్నాయి. ఇప్పుడు ఈ బయోడీజిల్ నినాదాన్ని మన దేశం కూడా అనుసరిస్తోంది.

### బయో డీజిల్ – భారతదేశం

ప్రస్తుతానికి మన దేశం 'జట్రోఫా కారకస్' అనే మొక్క ద్వారా జీవ ఇంధనాన్ని రాబట్టుతోంది. ఈ మొక్కని మధ్య అమెరికా, దక్షిణ, తూర్పు ఆసియా, దక్షిణ అమెరికా, ఇండియా, అమెరికాలలో పండిస్తున్నారు. దీనికి 600 ఎంఎం పుష్పించడానికి 1000 నుంచి 1500 ఎంఎం విత్తనాలు రావడానికి వర్షపాతం లేదా నీరు అవసరమవుతుంది. వాతావరణంలో వేడి 20° సి నుండి 28° సి వరకు ఉండాలి. పెరిగితే దిగుబడి తగ్గిపోవడం లేదా ఆగిపోవడం జరుగుతుంది. సహజంగా ఎక్కువ దిగుబడి ఇచ్చే మొక్క కానీ, నీటిని, ఎరువుల్ని, పురుగు మందుల్ని వాడితే దిగుబడి పెరుగుతుంది. దీని విత్తనాల నుంచి వచ్చే నూనెను బయో డీజిల్‌గా వాడతారు.

ఈ చెట్టు ఐదు మీటర్‌ల వరకు పెరుగుతుంది. దీని జీవిత కాలం యాభై సంవత్సరాలు. మొక్క మొలచిన నాలుగు సంవత్సరాలకు పుష్పించడం మొదలెడుతుంది. ప్రతి చెట్టూ సుమారు 200 గ్రాముల నుంచి 2 కిలోల వరకు విత్తనాలనిస్తుంది.

దీని పెరుగుదలలో పర్యావరణానికి హాని చేసే కారకాలెన్నో ఉన్నాయి. ముఖ్యంగా దీనివల్ల వాతావరణంలో ఆమ్ల గాఢత పెరిగి పోతుంది. ఎక్కువ దిగుబడి కోసం నత్రజని సంబంధిత ఎరువులు, పురుగు మందులు వాడాలి. అంటే ముందు చెప్పినట్లు మొక్కజొన్న ఎలాంటి సాగు పద్ధతుల్ని అవలంబించాలో దీంట్లో కూడా అలాగే చేయాలి. అవే పర్యావరణ విధ్వంసకాలు అమలు చేయాలి. అదనంగా వాతావరణంలో ఆమ్ల గాఢత పెరిగిపోవడం ఒక బోనస్ పాయింట్.

జట్రోఫా నూనెను పాత డీజిల్ ఇంజన్‌లలో, కార్లలో, వ్యవసాయ పంపు సెట్లలో, జనరేటర్‌లలో, సెల్‌ఫోన్ టవర్లకి అంటే ఒకే వేగంతో తిరిగే ఇంజన్‌లలో నేరుగా వాడొచ్చు. కానీ దీని సాంద్రత ఎక్కువ. వెలువడే కాలుష్యం కూడా ఎక్కువే. అందుకే డీజిల్‌లో గానీ, పెట్రోల్‌లో గానీ కలిపి వాడతారు. ఇది కూడా మొక్కజొన్నలుగానే తయారు చేయడానికయ్యే శక్తి ఎక్కువ. దీన్నించి వచ్చే శక్తి ఎక్కువ. ఒక లీటర్ జట్రోఫా ఇంధనానికి 1.35 లీటర్‌ల పెట్రోల్ శక్తిని వాడాలి. దీని ధర ప్రస్తుతం 26 రూపాయల నుండి 30 దాకా ఉంది. కాని దీని ఉత్పత్తికయ్యే ఖర్చు 36 రూపాయల నుంచి 40 దాకా ఉంది. మిగతాదంతా ప్రభుత్వం ప్రజల నుంచి దోచుకొని ఇస్తున్న సబ్సిడీ. దీన్ని ఉపయోగించుకొని మన ప్రైవేట్ కంపెనీలు బయో డీజిల్‌ను విదేశాలకు ఎగుమతి చేసి లాభాలు గడిస్తున్నాయి.

ప్రస్తుతం భారతదేశం 25.2 మిలియన్ లీటర్‌ల డైల్యూటెడ్ ఇథనాల్, స్పిరిట్‌ని ఘనా, సౌత్ కొరియా, సౌదీ అరేబియా, సిరియా, కమెరూన్, టాంజానియా, లిబియా, ఇతర ఆఫ్రికా దేశాలకు ఎగుమతి చేసింది. ఈ ఎగుమతి విలువ 210 లక్షల డాలర్లు. ఇదంతా ప్రైవేట్ సంస్థల ద్వారానే జరిగింది. దేశంలో ఇప్పటికే 20 బయో డీజిల్ తయారు చేసే పెద్ద ప్లాంట్‌లు ఉన్నాయి. ఇవి పది నుంచి ఇరవై లక్షల మెట్రిక్ టన్నుల వరకు ఉత్పత్తి చేయగలవు. దీని తయారీలో వెలువడే కాలుష్యాలు, వాటి ప్రభావాల వల్ల మనుషులు అనారోగ్యానికి గురవుతారో ఒక సజీవ ఉదాహరణ ద్వారా తెలుసుకుందాం.

కరీంనగర్ పర్లపల్లి గ్రామంలో తిమ్మాపూర్ మండలంలో ఒక కాంగ్రెస్ నాయకుడు హరిత బయో ప్రాడక్ట్ ప్లాంట్ నెలకొల్పాడనే విషయం అందరికీ తెలిసిందే. దీంట్లో 1) రెక్టిఫయిడ్ స్పిరిట్, 2) ఫార్మా గ్రేడ్ ఆల్కహాల్, 3) ఎక్స్‌ట్రా మ్యాటల్ ఆల్కహాల్ స్పిరిట్ తయారు చేస్తున్నారు. వీటికోసం మొక్కజొన్న నూకల్ని పులియబెట్టి, మరగబెట్టి అనేక రకాల ఎంజైములు కలుపుతారు. వీటి నుండి ఇథనాల్ తయారు చేస్తారు. కంపెనీ నీటి కోసం వెయ్యి అడుగుల లోతు బోర్లు వేసింది. అందులో సరిపోయినంత నీరు రాకపోవడంతో చుట్టుపక్కల పొలాల్లో రైతులను మభ్యపెట్టి మళ్లీ బోర్లేసింది. అవీ ఎండిపోయాయి. పక్క ఊళ్ల నుండి ట్యాంకర్‌లతో నీళ్లు తెచ్చుకుంటోంది. ఫ్యాక్టరీ నుండి వెలువడే వ్యర్థ పదార్థాలను పొలాల్లో వదిలేస్తోంది. అవి భూమిలోకి ఇంకి భూగర్భ జలాలు కలుషిత మయ్యాయి. అక్కడి గడ్డి తిన్న పశువులు రోగాల బారినపడి మరణిస్తున్నాయి. ఫ్యాక్టరీ నుంచి వస్తున్న దుర్గంధపు గాలులు పీల్చి ప్రజలు తీవ్ర అనారోగ్యానికి గురవుతున్నారు. పది నెలలుగా ఆస్పత్రుల చుట్టూ తిరుగుతున్నారు. పది మంది స్త్రీలకు గర్భస్రావం జరిగింది. కళ్లు మండడం, చర్మం ఎండిపోవడం, దురదలు రావడం మామూలైంది. ఇదేంటని ప్రశ్నించిన ప్రజలపై యాజమాన్యం దాడి చేసి చివరికి పదిహేడు మందిని అరెస్టు చేసి జైలుకి పంపించింది.

ఈ ఇథనాల్ ఫ్యాక్టరీకి రోజుకు ఆరు లక్షల లీటర్‌ల నీరు అవసరం నాలుగు వేల టన్నుల మొక్కజొన్న అవసరం. ఈ ఇథనాల్ కాక పైన చెప్పిన రసాయనాల (బై ప్రాడక్ట్స్) కోసం పదిహేను లక్షల లీటర్‌ల నీరు అవసరం. ఫ్యాక్టరీ వాళ్లు ఎలాంటి అనుమతులూ లేకుండా స్థానిక

# ఎస్.సి., ఎస్.టి. సబ్ ప్లాన్ చట్టబద్ధత

**ఎస్.సి., ఎస్.టి. సబ్‌ప్లాన్ మాత్రమే దళితుల సమస్యలకు పరిష్కారం ఇవ్వదనీ, దేవదాయ, ధర్మాదాయ శాఖల కింద ఉన్న భూములను దళితులకు ఇచ్చి, వాటికి సౌకర్యాలు కల్పించాలనీ అంటున్నారు చిమ్మెె జాన్ బర్నబాస్**

ఆంధ్రప్రదేశ్‌లో అధికారంలో ఉన్న కిరణ్ కుమార్‌రెడ్డి ప్రభుత్వం, ఎస్.సి, ఎస్.టి. సబ్ ప్లాన్‌ను చట్ట బద్ధత చేయాలనే సంకల్పంతో నవంబర్ 30, డిసెంబర్ ఒకటి, రెండు తేదీలలో ప్రత్యేక శాసన సభా సమావేశాలు నిర్వహించారు. ఇక్కడ ఆలోచించాల్సిన విషయం ఏమంటే, ఎస్.సి. ఎస్.టి. సబ్ ప్లాన్ గత 30-35 సంవత్సరాలుగా ఎందుకు అమలు కావడం లేదు? ఈ దేశానికి స్వాతంత్ర్యం వచ్చి 65 సంవత్సరాలు గడిచినప్పటికినీ, ఈ దేశంలో 'సాంఘిక సమానత్వం' ఎందుకు సాధించలేదు? పైగా శాసన సభ-పార్లమెంట్ సభ్యుల మధ్యనే కుల వివక్షత పాటిస్తున్న ఈ దుష్ట వ్యవస్థలో మనం జీవిస్తూ, ఎస్.సి, ఎస్.టి. సబ్‌ప్లాన్ చట్టం కాబడినప్పటికినీ, దీనిని అమలు చేయడానికి ఉన్న రాజ్యాంగ యంత్రాంగం చిత్తశుద్ధిగా అమలు చేస్తుందా? అనే విషయాలన్నీ కూడా ఈ సందర్భంగా, మనమంతా ఆలోచించాల్సిన అవసరం ఉన్నది.

ఇప్పుడున్న కేంద్ర, రాష్ట్ర కాంగ్రెస్ ప్రభుత్వాలు, తమ ప్రభుత్వ గొప్పతనంగా చెప్పుకోవడానికి, ఈ చట్టం రూపకల్పన చేయబడిందనేది కాదనలేని సత్యం. ఇప్పటికే రాష్ట్రంలోనూ, కేంద్రంలోనూ, రోజు, రోజూ మిత్ర, భాగస్వామ్య పక్షాలతో విమర్శలకు గురై కాలం వెల్లదీస్తున్న ఈ కేంద్ర ప్రభుత్వం, ఎస్.సి, ఎస్.టిలకు సబ్ ప్లాన్ అనే మంత్రం చూపెట్టి, తమకు ఓటు బ్యాంక్‌గా ఎస్.సి, ఎస్.టిలను సుస్థిరం చేసుకోవాలనే తాపత్రయం తప్ప, ఎస్.సి, ఎస్.టిలను ఉద్ధరించాలనే ఉద్దేశం ఏమాత్రం కాదు. ఎందుకనగా, 1974-75లో ఏర్పడిన ఎస్.టి సబ్ ప్లాన్, 1979-80లలో ప్రవేశ పెట్టిన ఎస్.సి. సబ్ ప్లాన్ ప్రకారం ఏర్పాటు చేసిన సంక్షేమ వసతి గృహాల పరిస్థితి, అధ్వాన్నం. ఆయా గ్రామాలలో నేటికీ మంచి నీళ్లకు సైతం దళితవాడలలో లేక, వేరే కులంవారి బోకర్లపైన ఆధారపడే పరిస్థితి నేటికీ దాపురించడం, ఎస్.సి, ఎస్.టి. సబ్ ప్లాన్ అమలు తీరు తెన్నులకు నిదర్శనం కాబోలు.

రానున్న పంచాయితీరాజ్ (ఎం.పి.టి.సి, జెడ్.పి.టి.సి), మున్సిపాలిటీ, సహకార ఎన్నికలను దృష్టిలో ఉంచుకొని, కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వం, అత్యవసర శాసన సభా సమావేశాలను ఏర్పాటు చేసి, ఎస్.సి, ఎస్.టి. సబ్ ప్లాన్ చట్టబద్ధతకు ఉపక్రమించాడు.

ఈ చట్టం ప్రకారం గ్రామాలలో కుల వివక్షతకు గురవుతూ, ఇప్పటికినీ అభివృద్ధికి నోచుకోని గ్రామాలలోని దళితవాడలలో, విద్య, ఆరోగ్యం, గృహాలు కల్పించాలనే సదుద్దేశంతో నిధులు కేటాయించి, ఆయా దళిత, గిరిజన ప్రాంతాలను అభివృద్ధి చేయాలి. కేంద్ర, రాష్ట్ర బడ్జెట్‌లలో, ప్రణాళికా సంఘం సిఫారసుల మేరకు, ఎస్.సి.లకు 16.2 శాతం నిధులూ, ఎస్.టి.లకు 6.6 శాతం నిధులూ, ఆయా బడ్జెట్‌లలో కేటాయించాలి. ఆ ధనం కేవలం దళిత గిరిజన ప్రజల అభివృద్ధికి మాత్రమే ఖర్చు చేయాలి. కానీ ఇప్పటికీ ఉన్న సంక్షేమ వసతి గృహాల అధ్వానస్థితి, ఐటిడిఎ. లాంటి 'సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థ'ల పరిస్థితి, అవి తయారు చేస్తున్న అటవీ ఉత్పత్తుల కొనుగోలు కేంద్రాలు ఏవిధంగా అధికారుల వివక్షతకు గురవుతున్నాయో అందరికీ తెలిసిన విషయమే.

గతంలో ఎస్.సి, ఎస్.టి.ల నిధులు ఏవిధంగా వివిధ పథకాలకు తరలించారో హుస్సేన్ సాగర్ అభివృద్ధి పేరు, మీద అవుటర్ రింగ్ రోడ్ పనులకు ఏవిధంగా వినియోగించారో, మనందరికీ తెలిసిన విషయమే. నిధులు మళ్లించిన విషయంలో చంద్రబాబునాయుడు హయాంలోనూ, రాజశేఖరరెడ్డి హయాంలోనూ జరిగిందనేది వాస్తవం. తమ, తమ మేనిఫెస్టోలలో దళితులను నమ్మించి ఓట్లు పొందిన పార్టీలు, వారి అభివృద్ధి కొరకు కేటాయించిన నిధులను, వారికి కాకుండా వేరొక అభివృద్ధి పనులకు కేటాయించి, ఖర్చు చేయడం, దళితులను నిలువునా దగా చేయడం తప్ప మరొకటి కాదు.

పెరుగుతున్న దళితుల జనాభా ఆధారంగా కుటుంబాల ప్రకారం, వారికి ఉండడానికి ఇల్లు, రక్షిత మంచి నీటి సౌకర్యం, మరుగు దొడ్లు, విద్యాలయాలు నిర్మించాలి. ఇప్పటికే ఉన్న సంక్షేమ హాస్టళ్లను

---

మానేరు ప్రాజెక్ట్ నుండి నీటిని తోడుకుంటున్నారు. ఇప్పుడు ఇలాంటి పరిశ్రమనే వేద బయో ఫ్యూయల్ పేరిట ఉత్తరాంధ్ర విజయనగరం జిల్లా పూసపాటిరాగ మండలం నడింపల్లి ప్రాంతంలో పెట్టబోతున్నారు. రాబోయేకాలంలో దేశమంతటా ఇలాంటి ప్లాంట్లు ఏర్పాటవబోతున్నాయి.

మన దేశంలో కోట్లాది మంది సరైన ఆహారం లేక, పోషక విలువల్లేక అనారోగ్యం పాలవుతున్నారు. ప్రపంచంలో సుమారు మూడు వందల కోట్లమంది పోషక విలువల్లేని ఆహారం తిని అనారోగ్యం పాలవుతున్నారు. ప్రతిరోజూ ప్రపంచవ్యాప్తంగా తిండి గింజలు లేక ఆకలి చావులకు గురవుతున్న వారి సంఖ్య యాభై వేలు. తిండి గింజలు సరిగా లభించక ఏటా మిలియన్‌ల కొద్ది ప్రజలు ఆకలిచావులకు గురవుతుంటే ఆహార ధాన్యాల నుంచి వాహనాలకు ఇంధనాన్ని పిండుకునే పైశాచిక ఆనందాన్ని అమలు చేసే మరో రూపమే 'బయో డీజిల్'. ఇది మొదట్లో చెరుకు, జట్రోఫా, మొక్కజొన్నలతో మొదలై క్రమంగా బియ్యం, గోధుమలు మొదలైన పంటలకు కూడా పాకుతుంది. హైదరాబాద్‌లోని జీవ వైవిధ్య సదస్సు లక్ష్యం వెనుకబడ్డ దేశాల ప్రజల జీవితాల్ని ఛిద్రం చేసి వారి నోటి కాడి కూడుతో కార్లను నడిపే ప్రయత్నమే ఈ జీవ వైవిధ్య సదస్సు లక్ష్యం. ఈ కుట్ర వెనుక అమెరికా, దాని బహుళజాతి కంపెనీల ప్రయోజనాలు దాగి ఉన్నాయనే విషయం మనం ఎన్నటికీ మరువకూడదు.

*(రచయిత విశాఖ జిల్లా ఎపిసిఎల్‌సి సభ్యుడు)* వీ

కాపాడుకొని, వాటికి మౌలికంగా అన్ని వసతులు కల్పించి, అక్కడ చదువుకునే విద్యార్థిని, విద్యార్థినిలను తీర్చిదిద్దాలి. వారిని కేవలం యంత్రాలుగా మార్చకుండా, ఈ దేశ భావి భారత పౌరులుగా తీర్చిదిద్దే క్రమంలో, వారికి అన్ని విధాలుగా చారిత్రక, సాంఘిక, రాజకీయ పోరాటాల పట్ల అవగాహన పెంచాలి. ఈ దేశంలో సాంఘిక విప్లవం కోసం కృషి చేసిన మహాత్మ జ్యోతిరావు పూలే, డా. బి.ఆర్. అంబేద్కర్, రామస్వామి పెరియార్ లాంటి నాయకులను తయారు చేసుకోవాలి. ఎందుకనగా, ఇప్పుడు అభ్యసిస్తున్న విద్య, కేవలం ఈ ప్రభుత్వాలు మాకు అన్ని చేసి పెట్టుతాయి, మేము వాటిని ఉపయోగించుకుంటూ, ఆయా ప్రభుత్వాలకు భజన బృందాలుగా తయారయితే సరిపోతుందనే ఒక దివాళా కోరు రాజకీయ దృక్పథం కూడా నేడు ఈ పాలకులు, దళిత, గిరిజన విద్యార్థిని, విద్యార్థులపై రుద్దుతున్నారు. పిల్లలు కేవలం ఈ ప్రభుత్వాల విధి విధానాలను విమర్శించకుండా వీరికి లోబడి వీరి దుష్ట పరిపాలనను సమర్థిస్తూ, త్యాగశీలురు కాకుండా, పెద్ద పెద్ద చదువులు చదువుకున్నప్పటికినీ, కేవలం పాలక వర్గాలకు భజన బృందాలుగా తయారు చేయించాలనే ఒక మోసపూరిత కుట్ర కూడా ఈ పాలకుల మెదళ్లలో ఏనాటి నుంచో ఉంది. ఎలాగనగా ఈ పాలకులంతా సామ్రాజ్యవాదుల కనుసన్నలలో ప్రపంచ బ్యాంక్, ఐక్యరాజ్య సమితి, అమెరికా ప్రభుత్వాల ఆదేశాల మేరకు నడుస్తున్నారు కాబట్టి, ఈ దేశ భావి భారత పౌరులను కూడా అదే నమూనా, పద్ధతులలో తీర్చి దిద్దాలనే ప్రగాఢ ఆకాంక్ష, కోరిక ఈ పాలకులకు ఉన్నది. కాబట్టి దళిత విద్యావంతులూ, మేధావులూ ఈ కుట్రలను తిప్పి కొట్టవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఈ సామ్రాజ్యవాదుల విష సంస్కృతి, సామ్రాజ్యవాద పరిపాలనా పోకడలనూ, దళితవాడలలో ప్రచారం చేయాల్సిన అవసరం ఉంది. ఒక వైపు ఇక్కడ ఉన్న కుల వ్యవస్థతో పోరాడుతూ, సాంఘిక సమానత్వం సాధించే దిశగా పయనిస్తూ మరో వైపు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం చేయాల్సిన బాధ్యత దళిత విద్యావంతుల మీద ఎంతైనా ఉంది.

ఇప్పుడున్న దోపిడి వ్యవస్థ అనేక రకాలుగా బహుముఖంగా ఈ దేశంలోని సామాన్య ప్రజలపై ప్రభావితం చేస్తూ ఉంది. ఈ దోపిడి వ్యవస్థను అన్ని విధాలుగా అర్థం చేసుకొని దీనిపై తిరుగుబాటు చేయకుండా ఈ దేశంలో సాంఘిక ఆర్థిక సమానత్వం సాధించలేం. ఎందుకనగా తమ పరిపాలన కొరకు తాము ప్రమాణం చేసి పాలిస్తున్న రాజ్యాంగ సూత్రాలను, రాజ్యాంగ ప్రమాణాలనే పాటించని ఈ పాలకులను అన్ని విధాలుగా ఎదిరించకుండా మన ఉద్యమాన్ని మనం ముందుకు తీసుకొని పోలేం. ఎందుకనగా ఎన్నో పోరాటాలతో, త్యాగాలతో నేడు దళితులంతా ఆత్మ గౌరవంతో, ఆత్మ విశ్వాసంతో కొద్దో, గొప్పో జీవిస్తున్నారు.

ఆ చైతన్యాన్ని, ఆ విలువలను మనం కాపాడుకోవలసిన అవసరం ఉంది. లేనిచో చరిత్ర మనలను క్షమించదు.

దళిత కుటుంబాలకు ఒక ఎకరా పొలం పంచాలనే అంశం కూడా సబ్ ప్లాన్‌లో ఉంది. అయితే పొలం ఇచ్చినప్పటికినీ, దాని సేద్యం, విత్తనాలు, ఎరువులు, అన్నింటికీ మించి శ్రమ అన్నీ కలుపగా వచ్చే ఉత్పత్తి పెట్టుబడికి గిట్టే పరిస్థితి ఉండదు ఒక్కోసారి. కాబట్టి సబ్ ప్లాన్ ఒక్కటే 'జిందాల్ తిలిస్మాత్' లాగా దళితుల సమస్యలన్నింటికి పరిష్కారం చూపలేదు. ఎందుకనగా ఈ దేశంలో అసలైన నాణ్యమైన పంట భూములన్నీ దేవాదాయ, ధర్మాదాయ శాఖ ఆధీనంలోనూ, ప్రభుత్వ ఆధీనంలోనూ ఉన్నవి. వీటిని ముఖ్యంగా గ్రామీణ ప్రాంతంలోని వ్యవసాయ కూలీ ఆధారంగా జీవించే దళితులందరికీ పంచాలి. ఇది ఎంత కష్టమైన పనో మనకు తెలియనిది కాదు. దీనిని ఈ సబ్ ప్లాన్ పరిష్కరించగలదా? కొన్ని సంవత్సరాల నుంచి కేవలం రు. పది వేలు మాత్రమే ఎకరానికి కౌలు(గుత్త) చెల్లిస్తూ, ఎంతో మంది అగ్రకుల శక్తులు దేవాదాయ, ధర్మాదాయశాఖ పొలాలను అనుభవిస్తూ, ఎంతో ధనవంతులై, వారి పిల్లలు కూడా నేడు ధనవంతుల జాబితాలో చేరిపోయారు. నిజంగా ఈ రాష్ట్ర ప్రభుత్వానికి చిత్తశుద్ధి ఉంటే ఈ రాష్ట్రంలోని దేవాదాయ, ధర్మాదాయ భూములను నిరుపేదలైన దళితులకు పంచాలి. నిజంగా అసలైన పన్నులు, గుత్త చెల్లించే దళితులను వదిలిపెట్టి, ఈ రాష్ట్రంలోని అనేక దేవాలయాల పాలక మండళ్లు అగ్రకుల భూస్వాముల చేతుల్లో కీలుబొమ్మలై, అధికారులను తమ చెప్పు చేతల్లో పెట్టుకొని, దేవాదాయ, ధర్మాదాయ భూములను తామే అనుభవిస్తూ, తమ బంధువుల చేతుల్లోనే ఆ పొలాలన్నీ పెట్టుకొని కొంత ధనం మాత్రమే చెల్లిస్తూ అవినీతిని పెంచిపోషిస్తూ, దేవాలయాలనూ, వాటిలోని అర్చకులనూ, కూటికి లేని నిరుపేదలుగా మార్చారు. నిజంగా స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఈ రాష్ట్రంలోని రెడ్డి, కమ్మ కుల శక్తులన్నీ ఈ పథకం ద్వారా ధనవంతులైనవారే. కాబట్టి ఎస్.సి, ఎస్.టి. సబ్ ప్లాన్ ఒక్కటే గ్రామాలలోని దళితుల సమస్యలన్నింటికీ పరిష్కారం కాదు.

ఎస్.సి, ఎస్.టి. సబ్ ప్లాన్ చట్టానికి కాల పరిమితి పది సంవత్సరాలు మాత్రమే విధించడం, మరో దగా తప్ప ఏమి కాదు. నిజంగా గ్రామాలలోని అగ్రకులస్తులకూ, దళితులకూ మధ్య అంతరాన్ని తగ్గించి, సాంఘిక సమానత్వం సాధించేంత వరకూ ఈ సబ్‌ప్లాన్ రూప కల్పన చేయాలి. కానీ మన రాష్ట్రంలోని పాలకులు ఈ చట్టం అమలు కోసం, 'ప్రత్యేక నిఘా-దర్యాప్తు బృందం' ఏర్పాటుకు ఒప్పుకోవడం లేదు. దాని అవసరం లేదంటున్నారు. ఇది కూడా ఈ చట్టంలోని ఒక లోపమే. ఎందుకనగా, ఈ దేశంలోని గ్రామీణ ప్రాంతాలలో ఎంత బలమైన కుల వ్యవస్థ పునాదులున్నాయో మనకు తెలియనిది కాదు. కేవలం జిల్లా కలెక్టర్లు, జిల్లా పోలీసు సూపరింటెండెంట్‌లు ఎస్.సి, ఎస్.టి. సబ్ ప్లాన్‌ను సరిగా అమలు చేస్తారనుకోవడం మన భ్రమ తప్ప మరొకటి కాదు. ఎందుకనగా ఇప్పటికే అమలవుతున్న ఎస్.సి, ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టం 1989 అమలు తీరు తెన్నులను పరిశీలిస్తే, మనకు అవగతం అవుతుంది. ఏవిధంగా ఈ పాలకులు వారి తాబేదార్లు, పోలీసులపై ఒత్తిడి తీసుకొని వచ్చి కేసులను నీరు గార్చుతున్నారో మనం ఇప్పటికే అనుభవిస్తున్నాం. ఇదే మార్గంలో ఎస్.సి, ఎస్.టి. సబ్‌ప్లాన్ చట్టం బలహీనం కాకుండా దీనిని ప్రత్యేక యంత్రాంగం ద్వారానే అమలు చేయాలి. ఈ యంత్రాంగంలో కూడా దళిత జనాభివృద్ధి కాక్షించే వారినే ఉద్యోగులుగా నియమించాలి. ఇది అత్యవసరం. ఏది ఏమైనప్పటికినీ పాలకులకు చిత్తశుద్ధి ఉండాలి. అదే విధంగా దళిత విద్యావంతులు కూడా ఎల్లప్పుడూ అప్రమత్తతో ఉండి, ఆత్మ విశ్వాసంతో, మరింత పోరాట పటిమతో దీనిని పర్యవేక్షిస్తూ, ముందుకు సాగాలి.

కేవలం సంఖ్యా బలం ఒక్కటే ముఖ్యం కాదు. మీరు ఎల్లపుడూ అప్రమత్తులై, విద్యావంతులై ఆత్మ గౌరవంతో, ఆత్మవిశ్వాసంతో మీ సొంత కాళ్లపై మీరు నిలబడి, మీ ఉద్యమాన్ని మీరే నిర్మించుకోండి - డా.బి.ఆర్. అంబేద్కర్.

*(రచయిత న్యాయవాది,*
*ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

# ఎవరికోసం ఈ సంస్కరణల సంబురం?

***చిల్లర వర్తకరంగంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు తలుపులు తెరిచి దేశ ప్రజల ప్రయోజనాలను కాలరాస్తున్న భారతదేశ పాలకుల తీరును వివరిస్తున్నారు* ఆసరి రాజు**

మనం నాటిన మొక్క చెట్టుగా ఎదిగి కాయలు కాస్తేనే ప్రతిఫలం దక్కుతుంది. ఇందుకు మొక్క పెద్ద చెట్టుగా ఎదగాలి. ఆ చెట్టుకు కాయలు కాయాలి. దీనంతటికీ చాలా సమయమే పడుతుంది. కానీ తీరా ఎదిగాక ఆ చెట్టు కాయలు కాస్తుందా..? ఆ కాయలు మనకు లేదంటే మన భవిష్యత్ తరాలకే చెందుతాయా..? అనేవి చాలా ముఖ్య అంశాలు. కేంద్రం చేపట్టిన సంస్కరణల విషయంలోనూ ఈ తరహా ప్రశ్నలు, అనుమానాలు సామాన్యులను ఆలోచింపజేస్తున్నాయి. గతి తప్పిన ఆర్థిక వ్యవస్థను మళ్లీ గాడిలో పెట్టేందుకు దేశంలో యుపిఎ ప్రభుత్వం చేపట్టిన సంస్కరణ చర్యలు ఎవరికి ప్రయోజనం చేకూర్చుతాయనే అంశంపై భిన్న వాదనలున్నాయి. మన్మోహన్‌కు స్టాక్‌మార్కెట్లను ఉరకలెత్తించడం తప్ప సామాన్యులకు ఊరట కలిగించడం తెలియదనే వారూ ఉన్నారు. అయితే అంత్య ప్రయోజనాలు సామాన్యులకు అందేందుకేనని కాంగ్రెస్ గట్టిగా సమర్థించుకుంటున్నది. కానీ వ్యవస్థను పట్టి పీడిస్తున్న అవినీతి, కుంభకోణాలు, గ్రామీణ ప్రాంతాల్లో కనీస సదుపాయాల లేమి లాంటి కీలక అంశాల్లో ప్రభుత్వం ఇప్పటికీ చిత్తశుద్ధితో వ్యవహరించడం లేదని, వ్యవస్థను క్రమబద్ధీకరించాల్సిందిపోయి విదేశీ పెత్తందార్లకు కొమ్ము కాస్తుందని విమర్శలొస్తున్నాయి.

సంస్కరణల పేరుతో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల(ఎఫ్‌డిఐ)కు సెప్టెంబర్‌లో కేంద్ర ప్రభుత్వం తలుపులు బార్లా తెరిచింది. దేశంలో లక్షలాది మందికి ఉపాధి కల్పిస్తున్న వ్యవసాయ , చిల్లర వర్తక రంగాల స్థితిగతులను అత్యంత ప్రభావితం చేయనున్న 51 శాతం ఎఫ్‌డీఐల ప్రతిపాదనకు మార్గం సుగమం చేస్తూ ప్రపంచ ప్రఖ్యాత సూపర్ మార్కెట్ దిగ్గజాలైన వాల్‌మార్ట్, క్యారేఫోర్, మెట్రో లాంటి సంస్థలు భారత్‌లోకి ప్రవేశించేందుకు యుపిఎ సర్కారు పచ్చజెండా ఊపింది. అలాగే బీమా, పెన్షన్, పవర్ ట్రేడింగ్ రంగాల్లోకి సైతం ఎఫ్‌డిఐలకు అనుమతిచ్చింది. క్యాపిటల్ మార్కెట్లో పెట్టుబడుల ప్రవాహం పెంచే దిశగా రిటైల్ మదుపర్లు ఎక్కువ స్థాయిలో పాలుపంచుకునేందుకు వీలుగా నిబంధనలు సరళీకృతం చేసింది. కానీ ఆర్థిక వ్యవస్థకు 2008 పూర్వ స్థాయి వైభవాన్ని తెచ్చిపెట్టాలంటే కొన్ని కఠిన నిర్ణయాలు కూడా తప్పవని కేంద్రం అంటున్నది. ఆర్థిక వృద్ధి రేటు పెరిగేందుకు పూర్తి ప్రతిబంధకాలుగా మారిన ద్రవ్యలోటు, కరెంట్ ఖాతా లోటును కట్టడి చేయాలంటే సబ్సిడీల్లో కోత తప్పదని వాదిస్తున్నది. సంక్షేమ పథకాల పేరుతో వేల కోట్ల రూపాయలు వృథాగా ఖర్చు చేసి ద్రవ్యలోటు ఇబ్బడిముబ్బడిగా పెరిగేందుకు కారణమైన ప్రభుత్వం, ఇప్పుడు దిద్దుబాటు చర్యలు చేపట్టింది.

ఆర్థిక వ్యవస్థ మెరుగుపడేందుకు కేంద్రం తీసుకున్న నిర్ణయాలు అమలులో గాడి తప్పుతున్నాయి. ముఖ్యంగా చిల్లర వర్తకంలో ఎఫ్‌డీఐల విషయంలో రైతులకు, వినియోగదారులకు కలిగే ప్రయోజనం కంటే ఈ రంగం ద్వారా లబ్దిపొందే కుటుంబాలకు కలిగే హాని ఎక్కువగా ఉంటుందన్న అంచనాలు కూడా వెలువడుతున్నాయి. మల్టీ రిటైల్ రంగంలో మౌలిక వసతుల పెట్టుబడుల్లో పెట్టుబడులు పెట్టేందుకు మాత్రమే ఈ సంస్థలకు అనుమతులిచ్చినప్పటికీ కంపెనీలు పరోక్షంగా వ్యాపారాన్ని శాసిస్తాయనడంలో ఎటువంటి సందేహం లేదు. పైపై మెరుగుల్లాగ ముందు చూడ్డానికి బాగానే ఉన్నప్పటికీ దీర్ఘకాలంలో అసంఘటిత రంగ వ్యాపారం కనుమరుగయ్యే ప్రమాదం ఉంది. దీంతో లక్షలాది కుటుంబాలు రోడ్డున పడే అవకాశం ఉంది. రైతులకు ఏమేరకు గిట్టుబాటు లభిస్తుందనే విషయం ఆ సమయానికి వేసిన పంట, వాతావరణ సానుకూలత, వ్యయం లాంటి అంశాలపై ఆధారపడి ఉంటుంది. ఇక వినియోగదారుడి విషయానికొస్తే మొదట్లో కొంత మేర ధరలు తగ్గినప్పటికీ, దీర్ఘకాలంలో పట్టు లభించాక విదేశీ కంపెనీలు నిర్ణయించిన రేటుకే తీసుకోక తప్పదు. పెన్షన్, బీమా రంగాల్లో విదేశీ పెట్టుబడులతో కంపెనీలకు మూలధన నిధుల లభ్యత పెరగడం తప్ప కస్టమర్లకు పెద్దగా ప్రయోజనం చేకూరదు.

అంతర్జాతీయ మార్కెట్లో కొనసాగుతున్న సంక్షోభ పరిస్థితుల కారణంగా చాలావరకు కంపెనీలు అభివృద్ధి చెందుతున్న దేశాల్లో వ్యాపారావకాశాలపై దృష్టి సారించాయి. ముఖ్యంగా చైనా, భారత్ లాంటి దేశాలు అభివృద్ధి చెందిన దేశాలతో పోలిస్తే మెరుగైన పనితీరు కనబరుస్తుండడం కూడా ఇందుకు ఒక కారణం. అంతర్జాతీయ దిగ్గజ కంపెనీలు తమ మనుగడను కాపాడుకునేందుకు ఇండియన్ బిజినెస్ హైవే పైకి ఎక్కేందుకు గత కొన్నేళ్లుగా తీవ్రంగా ప్రయత్నిస్తున్నాయి. వీటన్నింటి కలలను సాకారం చేస్తూ కేంద్రం ఎఫ్‌డిఐల ప్రవేశానికి తలుపులు తెరిచింది. అమెరికా అధ్యక్షుడిగా ఒబామా ఎన్నికయ్యాక విదేశీ కంపెనీలు భారత్ బాట పట్టే అవకాశాలు మరింత ఎక్కువగా కన్పిస్తున్నాయి. అధ్యక్షుడిగా ఎన్నికైన సందర్భంగా ఒబామా మాట్లాడిన తీరుని బట్టి చూస్తే, మధ్యతరగతి కుటుంబాల ప్రయోజనాలకు పెద్దపీట వేయను న్నట్లుగా సంకేతమిచ్చారు. ఇదే గనక జరిగితే అక్కడి వ్యాపార సంస్థలకు అవకాశాలు సన్నగిల్లే ప్రమాదం లేకపోలేదు. దీంతో పెట్టుబడులను అభివృద్ధి చెందుతున్న దేశాలవైపు మళ్లించే ప్రయత్నాలు జరిగే అవకాశం ఉంది. వీటిల్లో భారత ఆర్థిక వ్యవస్థే ప్రధాన ఆకర్షణగా నిలువనుంది.

దేశానికి చెందిన వ్యక్తులకు, సంస్థలకు చెందిన రు.25 లక్షల కోట్ల నల్లధనం విదేశీ బ్యాంకుల్లో మూలుగుతున్నదని ఆదాయ శాఖ ఉన్నతాధికారి అన్నారని తాజా 'కేజ్రీ లీక్స్' కార్యక్రమంలో కేజ్రీవాల్ అన్నారు. అంటే ఈ మొత్తాన్ని ప్రభుత్వం జప్తు చేయాలి. వీటిపై

# గాడితప్పిన ప్రజాస్వామ్యం

*దేశ ప్రజలచే ఎన్నికయిన మన పాలకులు ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేస్తూ, ఎఫ్‌డిఐలను అనుమతిస్తున్న తీరును వివరిస్తున్నారు* **వి. చలపతిరావు**

గత కొన్నేళ్ల నుండి యు.పి.ఎ. ప్రభుత్వం నడిపే పాలనా విధానాన్ని బట్టి చూస్తే ఈ దేశంలో ప్రజాస్వామ్య వ్యవస్థ పూర్తిగా గాడి తప్పినట్లు కనబడుతున్నది. మొన్న పార్లమెంటులో ఎఫ్.డి.ఐ.లపై జరిగిన ఓటింగ్ విధానాన్ని పరిశీలిస్తే ఆదే రుజువు అవుతున్నది. వాల్‌మార్ట్‌లాంటి పెద్ద కంపెనీలు ఈ దేశ చిల్లర వ్యాపార రంగంలో ప్రవేశిస్తే ఈ దేశంలో ఉన్న కోట్లాది చిల్లర వర్తకులు నష్టపోతారని, ఈ దేశంలోని వ్యవసాయ, పారిశ్రామిక ఉత్పత్తుల గిరాకి తగ్గి, విదేశీ బ్రాండ్ ఉత్పత్తులకు గిరాకీ పెరుగుతుందని, తద్వారా దేశ ఆర్థిక పరిస్థితి మరింత దిగజారుతుందని టి.డి.పి, ఎస్.పి, బహుజన పార్టీలాంటి ఇతర రాజకీయ పార్టీలు పార్లమెంటులో వాదించాయి. ఈ పార్టీల ఎం.పి.లు తప్పకుండా ఎఫ్.డి.ఐ. బిల్లు, ప్రతిపక్ష కూటమి ఎన్.డి.ఎ. ప్రవేశపెట్టిన దానికి అనుకూలంగా ఓటు వేసి ఈ బిల్లు పార్లమెంటులో పాస్ అయ్యేటట్లు చూస్తారని ప్రజలు ఆశించారు. కానీ తీరా ఓటింగ్ సమయానికి ఒకాయన జలుబుకు టాబ్లెట్ వేసుకుంటానని బయటకు వెళ్లిపోతే ఇంకా ఇతర సదరు పార్టీల సభ్యులు చిల్లర కారణాలను అడ్డం పెట్టుకొని ఓటింగ్‌లో గైర్హాజరు అయినారు. దేశ భవిష్యత్తు గురించిన ఒక ముఖ్యమైన బిల్లు పార్లమెంటులో ఓటింగ్‌కు వస్తే కొందరు ఎం.పి.లు తమ బాధ్యతను విస్మరించి ఓటు వేయకుండ తప్పించుకొని బయటకు పోవడంలాంటి ట్రెండ్స్ చూస్తే, ఇలాంటి రాజకీయాలతో దేశంలోని పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థ కాపాడబడుతుందా? అని అనుమానం రాకమానదు.

గ్లోబలైజేషన్ పేర ఆర్థిక సంస్కరణల పేర, జి.డి.పి. వృద్ధిపేర, దేశంలోని వివిధ పార్టీల రాజకీయ నాయకులు ఏ విధంగా అప్రజాస్వామ్య పద్ధతులలో ఇటు పార్లమెంటులో, అటు పాలనలో వ్యవహరిస్తున్నారో, సదరు ఎఫ్.డి.ఐ.ల బిల్లుపై నడిచిన విధానం వల్ల, అవినీతి మార్గాలలో అన్ని పార్టీల ఎం.పి.లు ప్రతిపక్ష ఎన్.డి.ఎ. వర్గం ప్రవేశ పెట్టిన ఎఫ్.డి.ఐ. బిల్లుకు వ్యతిరేకంగా ఓట్లు వేసి పార్లమెంటులో రాజ్యసభలో ప్రభుత్వానికి మెజారిటీ లేకున్న ప్రభుత్వాన్ని గట్టెక్కించారు. ఫెమా వగైరా భారత చట్టాలను అతిక్రమించి, ఇదివరకే దేశీయ కంపెనీ భారతికి చెందిన హోల్డింగ్ కంపెనీ, సెడార్ సపోర్ట్ సర్వీసెస్‌లో సదరు వాల్‌మార్ట్ రు. 450 కోట్ల పెట్టుబడులు పెట్టినట్లు ఆరోపణలున్నవి. అటువంటి కంపెనీకి, పార్లమెంటులో ప్రతిపక్షాల బిల్లు వీగిపోవడంతో భారతీయ చిల్లర మల్టీ బ్రాండ్ మార్కెటులోకి ప్రవేశించడానికి ఎర్ర తివాచి పరిచినట్లయింది. మరొక వైపు అదే కంపెనీకి ఫెమా రెగ్యులేషన్స్ బ్రేక్ వేసినందుకు ఇ.డి. నోటీస్ జారీ చేసింది. చట్టాలను అతిక్రమించి, ఇటు రాజకీయ నాయకులు, అటు విదేశీ పెట్టుబడిదారులు కలసి ఇరువురు దొంగలు దొంగలు కలిసి ఊళ్లు పంచుకున్న చందంగా ఉంది. ఇలా చట్టాలను అతిక్రమించి దేశీయ చిల్లర వ్యాపార రంగంలో దొడ్డిదారిన ప్రవేశించిన వాల్‌మార్ట్‌లాంటి గుత్త పెట్టుబడిదారులతో కుమ్మక్కవడం, దేశంలోని కోట్లాది చిల్లర వర్తకులను వ్యవసాయదార్లను వంచించడం కాదా? దేశంలో ఇదివరకే ప్రవేశించి పెద్ద పెద్ద మాల్స్ పెట్టిన మెట్రోలాంటి కంపెనీల వల్ల ఇక్కడి వ్యవసాయ రంగం అభివృద్ధి అయినదా? ఒకవేళ అయితే ప్రభుత్వం సోదాహరణంగా వివరించి చెప్పాలి. ముఖ్యంగా మన ప్రధాని ఈ గుత్త విదేశి కంపెనీలకు వకాల్తా పుచ్చుకొని మాట్లాడుతున్నాడు. చిల్లర వ్యాపార రంగంలో వీళ్లు ప్రవేశిస్తేనే ప్రస్తుత జి.డి.పి.వృద్ధి జరుగుతుందని వాదిస్తున్నారు. దేశంలో ఆర్థికవేత్తలు ఈ విషయాన్ని క్షుణ్ణంగా పరిశీలించి చెప్పాలి. ఇలాంటి సంఘపరమైన బాధ్యత వారిపై ఉంది.

ఇప్పటికీ దేశంలో 65 శాతం ప్రజల ముఖ్య వృత్తి, ఆధారం వ్యవసాయం అన్నది తెలిసిందే. అటువంటప్పుడు ప్రభుత్వ ముఖ్య కర్తవ్యం ఏమిటి? వ్యవసాయం అడుగువట్టును పెంచాలి. వ్యవసాయాభివృద్ధికి కావలిసిన మౌలిక అవసరాల సరఫరా ఉచిత ధరలకు రైతులకు లభ్యమయ్యే విధంగా పెంచాలి. ప్రస్తుతం వ్యవసాయదార్లకు కావలసిన రసాయన ఎరువులు, పురుగు మందులు, మేలు రకమైన విత్తనాలు వగైరా సమయానికి అందడం లేదు. తీరా నానా బాధలు పడి పండించిన పంటకు గిట్టుబాటు ధర ఈ ప్రభుత్వం దృష్టిసారించాల్సిందిపోయి కంటితుడుపు చర్యలు చేపట్టడమేంటని కూడా సామాన్యులకు అన్పిస్తున్నది. అంతర్జాతీయ బ్యాంకింగ్ రంగంలో ప్రముఖమైన ఎచ్ఎస్‌బిసి, యుబిఎస్ లాంటి సంస్థలు స్వప్రయోజనాల కోసం మన దేశంలో ఎలాంటి అవినీతి అకృత్యాలకు పాల్పడుతున్నాయో కేజ్రీవాల్ మచ్చుకు కొన్ని రుజువులు చూపిస్తుంటే, దేశీయ సంస్థలే ఎంతోకొంత మేలన్న భావన కలుగకమానదు. మరి ఎఫ్‌డిఐల రూపంలో పెట్టుబడులు పెట్టిన సంస్థలు కూడా లాభాపేక్షతో ఇంకెంత మేరకు కక్కుర్తి పడతాయోనన్న భయ పడకతప్పదు. స్విట్జర్లాండ్‌లోని జెనీవాలోని ఎచ్ఎస్‌బిసి బ్యాంకు శాఖలో డబ్బు దాచుకున్న 700 మంది ఖాతాదారుల పేర్లు బయటికొస్తే అందులో కేవలం 150 మందిపైనే ఐటీ శాఖ దాడులు చేసింది. అంబానీ సోదరులు, డాబర్, స్పైస్‌జెట్, బిర్లా గ్రూపు సంస్థ కార్పొరేట్ పెద్దలకు దాడులకు మినహాయింపునివ్వడం చూస్తుంటే ప్రభుత్వం చిత్తశుద్ధిని శంకించాల్సి వస్తుంది. పేదోడి కంటే పారిశ్రామిక వేత్తలపైనే ప్రభుత్వానికి ప్రేమెక్కువని అనుకోవాల్సిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

*(రచయిత పాత్రికేయులు)* వీ

ఇప్పించడం లేదు. అది కూడ వ్యవసాయధికారులు భరించలేనంతగా ధరలు పెంచి, అది కూడ సమయానికి అందించడం లేదు. ఇటీవల ఎందరో రైతులు తెలంగాణ జిల్లాలలో ముఖ్యంగా పత్తి రైతులు తమకు గిట్టుబాటు ధర లభించడం లేదని అప్పుల బాధకు తట్టుకోలేక ఆత్మహత్యలు చేసుకున్న సంగతి తెలిసిందే. ఇంత జరుగుతున్న ప్రభుత్వ సంస్థ కాటన్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా మార్కెటులో ప్రవేశించి రైతులకు గిట్టుబాటు ధరకు పత్తి ఖరీదుచేయడం లేదు. ఎరువుల, విత్తనాల, పురుగు మందుల ధరలు బాగా పెరిగినందు వల్ల ఇప్పుడు పత్తి క్వింటాలుకు కనీసం రు. 5000 పలికితేనే రైతుకు గిట్టుబాటు అవుతుందని పలువురు రైతులు, రైతు సంఘాలు చెప్పుతున్నారు. కొన్ని గ్రామాలలో బ్రోకర్లు, వ్యాపారులు పత్తికి రు. 3200 నుండి రు. 3500 ధర కన్నా ఎక్కువ పెట్టడం లేదు. కాటన్ కార్పొరేషన్ మాత్రం తమాషాగా చూస్తున్నది. ప్రభుత్వ పరిధిలో ఉన్న వ్యవసాయదార్ల అసలు సమస్యను పట్టించుకోక, విదేశీ గుత్త పెట్టుబడిదారులు భారతీయ చిల్లర వర్తకంలో ప్రవేశిస్తే, వ్యవసాయదార్లు బాగుపడుతారని పార్లమెంటులో వాదించడం ఎంత వరకు సబబు? ఇదేమి ఆర్థిక విధానం, ఇదేమి రాజకీయ విధానం అర్థం కావడం లేదు. సోనియాగాంధీ నాయకత్వాన నడిచే యు.పి.ఎ. ప్రభుత్వం చెప్పే 'ఆమ్ ఆద్మి' సంక్షేమ రాజ్యం ఇదేనా? ఇది ఎలాంటి ప్రజాస్వామ్యం?

ఇక రాష్ట్ర పాలన విషయానికొస్తే, చంద్రబాబు హయాంలో తెలంగాణలోని నిజాం నాటి ఆసియా ఖండంలోనే పేరు గాంచిన నిజాం షుగర్ ఫ్యాక్టరీలాంటి ఎన్నో ప్రభుత్వ రంగ పరిశ్రమలను దివాలా తీయించి తర్వాత వాటి భూములను ఆస్తులను తన అనుయాయులకు అమ్మినారు. రాజశేఖరరెడ్డి హయాంలో వేలాది ఎకరాల ప్రభుత్వ భూములు, బీదలకిచ్చిన అసైన్డ్ భూములు వగైరా బడా వ్యాపారులకు అడ్డగోలుగా సెజ్‌లకని, పరిశ్రమలకని చట్టాలకు, విధానాలకు వ్యతిరేకంగా అలాట్ చేయడం జరిగింది. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఆదేశాల ప్రకారం సి.బి.ఐ. సదరు చట్ట వ్యతిరేకంగా భూముల పంపకం విషయంలో విచారణ జరిపిస్తున్న సంగతి తెలిసిందే. ఈ విచారణ ఫలితంగా మంత్రులు ఐ.పి.ఎస్. ఆఫీసర్లు, అక్రమ వ్యాపారులు జైళ్ల పాలైన సంగతి తెలిసిందే. ఇంక కొంత మంది మంత్రులకు సుప్రీంకోర్టు నుండి నోటీసులు వచ్చిన సంగతి తెలిసిందే. కాంగ్రెసు హైకమాండ్, ముఖ్యమంత్రి ఈ మంత్రుల విచారణను తప్పించాలని మల్లగుల్లాలు పడుతున్న సంగతి తెలిసిందే. ఇదే రాజశేఖరరెడ్డి నాగార్జునసాగర్ నీళ్లు దాని కింది కాలువల ద్వారా ఆయకట్టు భూములకు నీరు అందకుండ శ్రీశైలం ప్రాజెక్టు నుండి చట్ట వ్యతిరేకంగా పోతిరెడ్డిపాడు కాలువ ద్వారా తన కుమారుడు స్థాపించిన కడప జిల్లాలోని స్టీల్ ఫ్యాక్టరీకి నీటి సప్లయి చేయించాడు. ఇంకొక వైపు నాగార్జునసాగర్ ఎడమ కాలువ కింద ఆయకట్టు భూములు నీరు అందక బీడు భూములుగా తయారైనవి. ఇది మన ప్రజాస్వామ్య ప్రభుత్వాల కింద జరుగుతున్న సుపరిపాలన.

వై.ఎస్. రాజశేఖరరెడ్డి ఆంధ్రప్రదేశ్‌లో స్థాపించబడిందన్న సంక్షేమ రాజ్యం సుపరిపాలనలో రోజు వారి వార్తలు ఏమి చెప్పుతున్నాయి? ఎంత మంది నాయకులు వారి అనుయాయులు ప్రభుత్వ భూములను, ఖనిజ సంపదను దోచుకున్నారు. ఎంత మంది ప్రభుత్వ ఉద్యోగులు , ఐ.పి.ఎస్. ఆఫీసర్లు జైళ్లకు వెళ్లుతున్నారు. ఎంత మంది మంత్రులు సి.బి.ఐ. విచారణల కిందికి వస్తారో తెలియని పరిస్థితి వాన్‌పిక్‌లాంటి కేసులు ఇంకా ఎన్ని ఫైళ్లలో దాగి ఉన్నాయో తెలియదు. ఇళ్లలో కరెంటు ఎప్పుడు వస్తుందో, ఎప్పుడు పోతుందో తెలియదు. పరిశ్రమలకు కూడ వారానికి మూడురోజులు సరిగ్గా కరెంటు ఇవ్వని పరిస్థితి. ఆంధ్రప్రదేశ్‌లో అటు వ్యవసాయ ఉత్పత్తి, ఇటు పారిశ్రామిక ఉత్పత్తి పూర్తిగా దెబ్బతిన్న పరిస్థితి. ఇక తెలంగాణలో జరిగే ప్రజాస్వామ్యబద్ధమైన ఉద్యమాన్ని ఉక్కుపాదంతో గత అరవై ఏండ్ల నుండి ఆంధ్ర దోపిడి పాలకులు, కేంద్రంలో ఉన్న స్కాం పాలకులు కలసి అణిచివేస్తున్నారు. ప్రపంచంలో ఉన్న ప్రజాస్వామ్య ప్రభుత్వాల పాలనలలో ఎక్కడ ఇంత అధ్వాన పరిస్థితి లేదు. ఈ పరిస్థితి ఇంకా కొన్నాళ్లు కొనసాగితే పాకిస్తాన్‌లో కొనసాగు తున్న మతతత్వ పాలకులకు, మన దోపిడి పాలకులకు తేడా ఏమి లేకుండాపోతుంది. ప్రజాస్వామ్య విలువలు పూర్తిగా నశించి పోతాయి.

ఒకవేళ 1991లో ప్రారంభించిన ఆర్థిక సంస్కరణల వల్ల దేశం గణనీయమయిన ఆర్థికాభివృద్ధి సాధించినట్లయితే దేశంలో ఇంకా 30 శాతం ప్రజలు బీదరికం రేఖ కింద ఎందుకు నలిగిపోతున్నారు? గిరిజన ప్రాంతాల్లోని ప్రజలు ఎందుకు ప్రాణాంతక రోగాలతో బాధపడుతున్నారు. వారి అభివృద్ధికి కేటాయించిన నిధులు ఎందుకు మధ్య దళారుల పాలవుతున్నాయి. నక్సల్స్ సమస్య ఎందుకు పరిష్కారంకాలేక పోవుతున్నది. రాజశేఖర రెడ్డి హయాంలో 80 శాతం ప్రజలకు తెల్ల కార్డులు ఎలా జారీ చేశారు? ఇది అభివృద్ధికి చిహ్నమా?

దేశంలో ప్రస్తుత దశలో ఎగుమతులు క్షీణించి, దిగుమతులు ఎందుకు పెరుగుతున్నాయి. విదేశీ మారక ద్రవ్య నిలువలు ఎందుకు అడుగంటుతున్నాయి. ఎందుకు రూపాయి మారకం విలువ రోజు రోజుకు తగ్గి పోతున్నది?

ఎందుకు దేశంలో ద్రవ్యోల్బణం విపరీతంగా పెరుగుతున్నది? నిత్యావసర వస్తువుల, పారిశ్రామిక ఉత్పత్తుల ధరలు బాగా పెరిగి సామాన్యుని బతుకులు చితికి పోతున్నవి. విద్యుత్తు ఉత్పత్తి స్థాయి తగ్గి వ్యవసాయ పారిశ్రామిక రంగాలకు సరఫరా తగ్గి, ఈ రంగాల ఉత్పత్తులు బాగా తగ్గి పోలేదా? దేశంలో ఈ విధంగా మొత్తం ఉత్పత్తి స్థాయి దిగజారిపోయి, జి.డి.పి. తొమ్మిది శాతం నుండి ఐదు శాతం వరకు పడిపోలేదా? రెండవ దశ ఆర్థిక సంస్కరణల అమలుకు తెగ ఆరాట పడుతున్న మన ప్రధాని మొదటి దశ సంస్కరణాల ఫలితాలు పైన వివరించినట్లు ఎందుకు ఆర్థికరంగ స్థితి దిగజారాయో వివరించి చెప్పాలి.

దేశంలో వివిధ అభివృద్ధి కార్యకలాపాలకు పెట్టుబడిగా ఉపయోగ పడవలసిన లక్షల కోట్ల రూపాయల దేశీయ ధనం నల్ల ధనంగా మారి విదేశీ బ్యాంకులలోకి దొడ్డి దారిన చేరి అక్కడ నిష్ప్రయోజనంగా మురిగి పోతున్న సంగతి తెలిసిందే. అట్టి దేశీయ ధనాన్ని మరల దేశానికి రప్పించి దానిని ఉత్పత్తి మార్గాలలో పెట్టుబడులు పెడదామని అన్న మాజీ ఆర్థికమంత్రి ప్రణబ్ ముఖర్జీ ఇప్పుడు దేశ రాష్ట్రపతిగా అవతార మెత్తిన్నాడు. ఇక ప్రధానమంత్రి ఆ ఊసే ఎత్తక విదేశీ పెట్టుబడుల కొరకు ముఖ్యంగా ఎఫ్.డి.ఐ.ల కొరకు మహా ఆర్భాటం చేస్తున్నాడు. దేశ జి.డి.పి. వృద్ధికి ఇదొకటే మార్గమని వాదిస్తున్నాడు. కనుక దేశ ఆర్థికాభివృద్ధి విషయంలో అవినీతిలో, స్కాంలలో మునిగి తేలుతున్న రాజకీయ నాయకులేకాక, మేధావులు, ఆర్థికవేత్తలు, సంఘ కార్యకర్తలు వ్యవసాయ రంగ నాయకులు వగైరా చర్చలు జరిపి ప్రధానమంత్రి చేసిన సదరు వాదనలోని నిజానిజాలను బయట పెట్టడం శ్రేయస్కరం.

*(రచయిత రిటైర్డ్ డిప్యూటీ కలెక్టర్)* వీ

# తెలంగాణ సాయుధ పోరాటం-నూతన ప్రజాస్వామిక విప్లవం

- జి. సత్యనారాయణరెడ్డి

'వీక్షణం' దశాబ్ది ప్రత్యేక సంచికలో (జనవరి 20013) వరవరరావుగారు 'ప్రత్యామ్నాయ చరిత్ర నిర్మాణంలో విప్లవోద్యమం' పేరుతో ఒక వ్యాసం రాశారు. అందులో తెలంగాణ సాయుధ పోరాటం (1946-51) గురించి చర్చించిన తెలంగాణ సాయుధ పోరాటంలోని కొన్ని సానుకూల అంశాల గురించి పేర్కొంటూనే దాని స్వభావం గురించి మాత్రం వారు ఈ కింది విధంగా పేర్కొన్నారు.

1046లో చైనా మార్గమే మన మార్గమని స్ఫురించనప్పటికీ, దున్నేవారికే భూమి నినాదమిచ్చి, భూమిని స్వాధీనం చేసుకొన్నప్పటికే మనది కూడా నూతన ప్రజాస్వామిక పంథా కావాలనీ, పోరాట శ్రేణుల విప్లవ ఆచరణ అదేనని నాయకత్వానికి చైతన్య పూర్వకంగా అర్థం కాలేదు. అంటే వాళ్లు అందుకు సిద్ధంగా లేరు. అందుకే అది విప్లవం కాలేక పోయింది. వారు ఆ వ్యాసంలో ఇంకా ఇలా రాశారు.

'విప్లవ పోరాటంలో పాల్గొనే శక్తులను, విప్లవ కారులను రాజ్యాధికారనికి తేవాలి. విప్లవం అంటే కేవలం దున్నే వారికే భూమి అనే ఆర్థిక పోరాటం కాదు'.

తెలంగాణ సాయుధ పోరాట క్రమంలో, ఆంధ్ర రాష్ట్ర కమిటీ సెక్రటేరియట్ 1948 జూలై 9న ఒకటి ఆ తర్వాత 1949 సెప్టెంబరు లో మరొకటి రెండు డాక్యుమెంట్లను విడుదల చేసింది. వాటిలోని విషయాలను పరిశీలిస్తే వరవరరావుగారు పైన వ్యక్తం చేసిన అభిప్రాయాలు, ఆనాటి పోరాట వాస్తవాలకు, దాని విప్లవ స్వభావానికి అనుగుణంగా లేవనే విషయం స్పష్టమవుతుంది.

1946 జూలైలో ప్రారంభమైన సాయుధ ప్రతిఘటనను నిజాం సాయుధ బలగాలు డిసెంబర్ నాటికి అణచివేశాయి. ఆరు, ఏడు నెలల విరామం తర్వాత 1947 సెప్టెంబరులో రెగ్యులర్ సాయుధ పోరాటం ప్రారంభమయింది. నాయకత్వం ఆ పోరాటానికి భూమి పంపక కార్యక్రమాన్ని ఓడించడంతో ఒక సంవత్సరంలోపలే ఆ పోరాటం బాగా ముందుకు పోయింది. ఆ పోరాటం అందించిన విలువైన అనుభవాలను క్రోడీకరింస్తూ ఆంధ్రరాష్ట్ర కమిటీ సెక్రటేరియట్ 1948 జూలై తొమ్మిదిన ఒక డాక్యుమెంటును (ఆంధ్ర థీసిస్ అది వాడుకలోనికి వచ్చింది) తయారు చేసింది. భారత విప్లవ భవిషత్తు కోసం ఒక పంథాను ఆ డాక్యుమెంటులో ప్రతిపాదించి, దాన్ని పార్టీ పొలిట్ బ్యూరోకు పంపింది. ఆ పంథాలోని సవ్యతను గ్రహించి, భారత విప్లవానికి ఒక పంథాను రూపొందించడానికి బదులుగా పోలిట్ బ్యూరో నాయకత్వం అది అంతా సంస్కరణ వాదంతో కూడి ఉన్నదని ఖండించి, దాన్ని మొత్తంగానే తిరస్కరించింది.

ఇంతకు 'ఆంధ్రా థీసిస్' అనబడే ఆ డాక్యుమెంటులో పంథా గురించి పేర్కొన్న ముఖ్యమైన విషయాలేమిటి? ఆ డాక్యుమెంటు మావో రూపొందించిన 'నూతన ప్రజాస్వామ్యం' చాలా వివరంగా చర్చించింది. ఏలాంటి సందిగ్ధతకూ అవకాశం లేకుండి 'మన విప్లవపు ప్రస్తుత దశ ప్రధానంగా చైనా విప్లవ దశను పోలి ఉంటుందని' స్పష్టంగా ప్రకటించింది. దానిలోనే మరో చోట చైనా చారిత్రక విముక్తి పోరాట నాయకుడైన మావో తన అపూర్వమైన, సంపన్నవంతమైన అనుభవం, అధ్యయనం ద్వారా నూతన ప్రజాస్వామ్యం అనే సిద్ధాంతాన్ని రూపొందించాడు. వలసలు, అర్ధవలస దేశాల్లో సోషలిజం వైపు పురోమించడానికి కొత్త విప్లవ పోరాట రూపమదని పేర్కొన్నాడు.

ఆ తర్వాత 1949 సెప్టెంబర్‌లో ఆంధ్ర రాష్ట్ర కమిటీ సెక్రటేరియట్, సాయుధ పోరాటాన్ని విరమించాలని పార్టీలో కొందరు ముందుకు తెచ్చిన తప్పుడు ధోరణులను ఖండిస్తూ మరో డాక్యుమెంటును తయారు చేసి, దానిపై పార్టీలో విస్తృతమైన చర్చను నిర్వహించింది. (కామ్రేడ్. దేవులపల్లి వెంకటేశ్వర రావు తయారు చేసిన ఆ డాక్యుమెంటును 'తెలంగాణ సాయుధ పోరాటాన్ని విరమించాలనే తప్పుడు దోరణులపై విమర్శ' పేరుతో 1982 లో 'ప్రోలిటేరియన్ ప్రచురణలు' అనే సంస్థ ప్రచురించింది) ప్రస్తుత చర్చకు ఉపయోగపడుతుందని దానిలో ఒక పేరాలోని బాగాలను కింద పేర్కొంటున్నాను.

తెలంగాణ పోరాటంలో మనం గడించిన అనుభవాలు భారతదేశంలో నూతన ప్రజాతంత్ర విప్లవానికి ఒక కొత్తగా మార్గాన్ని చూపాయి. ఇచ్చట కార్మిక వర్గం సాయుధ తిరుగుబాటుకు సిద్ధంకాక మునుపే గ్రామాల్లో వర్గపోరాటం ఉన్నత దశకు వెళ్లింది. దున్నేవానికే భూమి, గ్రామ రాజ్యాల నినాదంతో ప్రజా సైన్యాన్ని సృష్టించి, గెరిల్లా పోరాటం ద్వారా, నిజాం అధికారాన్ని కూలదోస్తూ విప్లవాన్ని ప్రారంభించి ముందుకు తీసుకొని వెళ్లగలిగాం. తెలంగాణ గెరిల్లా పోరాటం నిజాం అధికారాన్ని కూలదోయడం వరకే పరిమితమై ఉండక, భారత బూర్జువా వర్గపు అధికారాన్ని కూడా కూలదోయడానికి కొనసాగుతున్నది.

1949 నాటికే ఆంధ్ర రాష్ట్ర పార్టీ సెక్రటేరియట్ తెలంగాణ సాయుధ పోరాటం నూతన ప్రజాతంత్ర విప్లవానికి ఒక కొత్త మార్గాన్ని చూపుతున్నదని ప్రకటించడానికి చాలా ప్రాధాన్యత ఉంటుంది. దానితో పాటుగా పైన పేరాలోని ప్రతి అంశానికి కూడా ప్రాదాన్యత ఉన్నది. వరవరరావుగారు తెలంగాణ సాయుధ పోరాటంలో ఏవేవైతే లేవని చెప్పారో-నూతన ప్రజాతంత్ర విప్లవం 'ప్రజాసైన్యం' 'గెరిల్లా పోరాటం' రాజకీయాధికారం అన్నపై పేరాలో స్పష్టంగా పేర్కొనబడ్డాయి.

నాటి తెలంగాణ సాయుధ పోరాటానికిరాజ్యాధికారంపై దృష్టిలేదని, ఆ స్పష్టత 1967లో నక్సల్‌బరి ఇచ్చిందని వరవరరావు గారు తన వ్యాసంలో పేర్కొనడం పైపేరాలో పేర్కొన్న వాస్తవాలకు విరుద్ధంగా ఉంది. ఆంధ్రరాష్ట్ర నాయకత్వానికి తెలంగాణ సాయుధ పోరాట స్వభావంపైన, దాని అంతిమ లక్ష్యంపైన ఎంతో స్పష్టత ఉందనే విషయాన్ని పైన పేర్కొన్న రెండు డాక్యుమెంటు ఎలాంటి సందిగ్ధతలకు అవకాశం కాకుండా నిరూపిస్తున్నాయి. అందువలన 'రాజ్యాధికారం కోసం పోరాటం' 'నూతన ప్రజాస్వామిక విప్లవం' గురించిన అవగాహన 1967లోనే మొదటి సారిగా నక్సల్‌బరి పోరాటం తర్వాతనే మొదలయిందనే అభిప్రాయంపైన పేర్కొన్న చారిత్రక వాస్తవాలతో పొసగడం లేదనేది స్పష్టమే. ఇక విప్లవం అంటే కేవలం దున్నే వానికే భూమి అనే ఆర్థిక పోరాటం కాదనీ వరవరరావుగారు పై వ్యాసంలో పేర్కొన్నారు. అలాంటి అభిప్రాయం ఎవరికి ఉండింది? ఉన్నది? తెలంగాణ సాయుధ పోరాటానికి నడిపిన నాయకత్వానికి మాత్రంలేదని స్పష్టంగా చెప్పవచ్చును. భూస్వామ్య విధానాన్ని రద్దు పరుచేస్తూ, భూమి పంపకాన్ని చేపట్టడం అనేది వ్యవసాయ విప్లవ కార్యక్రమం. నూతన ప్రజాతంత్ర విప్లవంలో అది చాలా కీలకమైనది కూడా. తెలంగాణ పోరాటంలో కూడా జరిగింది సరిగ్గా అదే. భూస్వామ్య వ్యవస్థ పరిధిలోనే దున్నేవానికే భూమి నినాదం అమలు జరపాలని కోరడం మాత్రం కచ్చితంగా ఆర్థికవాదమే అవుతుంది. కాని తెలంగాణ

సాయుధ పోరాటం కాలంలో ఆవిధంగా జరగనప్పుడు, దాని పైన చర్చించే సందర్భంలో వరవరరావుగారు పై విషయాన్ని ప్రస్తావించడం అసందర్భమే కాకుండా ఆ పోరాట స్వభావంపై తప్పుడు లేదా పొరపాటు అభిప్రాయం కలిగించడమే అవుతుంది.

సాయుధ పోరాటం, విముక్తి అనే మాటలు కనిపించినంత ప్రబలంగా విప్లవం అనే మాట కనిపించదు. ఇది యాదృచ్ఛికమా? సైద్ధాంతిక పరిమితియా అంటూ వరవరరావుగారు ఒక ప్రశ్న వేశారు. దానికి జవాబు మాత్రం ఆయన పేర్కొన్నలేదు. పైన పేర్కొన్న వివరణ అంతా కూడా ఆ పోరాటాన్ని నడిపిన నాయకత్వానికి సైద్ధాంతిక పరిమితిగానీ, యాదృచ్ఛికంగాని ఏమీ లేదని స్పష్టం అవుతున్నది. ఇక మిగిలింది వరవరరావు గారికి ఆ పోరాట స్వభావాన్ని సరిగ్గా అర్థం చేసుకోవడంలో ఉన్న పరిమితే. ఆ పోరాటం పైన వ్యక్తం చేసిన అభిప్రాయాలకు అదే కారణమనేది స్పష్టమే.

వరవరరావుగారు తన వ్యాసంలో ప్రస్తావించిన మరో అంశం గురించి క్లుప్తంగానైనా చర్చించవలసిన అవసరం ఉన్నది. దేశంలో ఆ కాలంలో జరిగిన కొన్ని పోరాటాల గురించి వారు ప్రస్తావించి అనేవి వర్గపోరాటా కావనీ, ఒక్క తెలంగాణ సాయుధ పోరాటం మాత్రమే వర్గపోరాటమనదగిందనడం కూడా సరైన అభిప్రాయం కాదు. వరవరరావుగారు ప్రస్తావించన పోరాటాలతో పాటుగా ప్రస్తావించిన పోరాటాలు కూడా మరికొన్ని జరిగాయి. త్రిపురలో ఏకంగా ఒక సంవత్సరం పాటు సాయుధ పోరాటమే కొనసాగింది. ఇతర పోరాటాలతో పోల్చుకొన్నప్పుడు తెలంగాణ సాయుధ పోరాటానికున్న ప్రాముఖ్యత అది వర్గపోరాటం అది వర్గపోరాటం కావడం కాదు. ఆ కాలంలో సాగిన ఆ పోరాటాలన్ని వర్గపోరాటాలే. అందులే కొన్ని విప్లవ పోరాటాలు కూడా (త్రిపుర). తెలంగాణ సాయుధ పోరాటపు ప్రాముఖ్యతను గురించి కా. దేవులపల్లి వెంకటేశ్వరరావు గారు రాసిన 'తెలంగాణ ప్రజల సాయుధ పోరాట చరిత్ర' అనే గ్రంథంలో ఈ కింద విధంగా పేర్కొన్నాడు.

'తెలంగాణ ప్రజల సాయుధ పోరాటనికున్న వాస్తవమైన ప్రత్యేకత ఏమిటంటే ఇచ్చట భావి భారత విప్లవ పంథాకు సంబంధించిన ప్రయోగం జయప్రదమైనది. ఆ పోరాటాపు నిజమైన ప్రాముఖ్యతను ఈ ఒక్క వాక్యమే ఎంతో స్పష్టం చేస్తున్నది. ఇక్కడ మరో ముఖ్యమైన విషయాన్ని అర్థం చేసుకోవాలి. తెలంగాణ సాయుధ పోరాటం అణచివేతమూలంగా దెబ్బతిన లేదు. కేంద్ర పార్టీ నాయకత్వం పోరాటాన్ని ఏకపక్షంగా విరమించాలని ముందు నిర్ణయించి దాన్ని రాష్ట్ర నాయకత్వంతో బలవంతంగా ఒప్పించింది. అప్పటికీ కామ్రేడ్స్ డి.వి. భీమరెడ్డి, నర్సింహరెడ్డి, ఆ విరమణను అంగికరించలేదు.

తెలంగాణ సాయుధ పోరాటాన్ని గురించి అర్థం చేసుకోవలసిన మరో ముఖ్యమైన విషయం ఉంది. ఆనాడు పార్టీ ప్రబోధించి పంథాలకు గానీ, కేంద్ర పార్టీ మార్గదర్శకత్వంలో గానీ ఆ పోరాటం ప్రారంభమయి, అభివృద్ధి చెందలేదు.

పార్టీ జాతీయ స్థాయిలో, 1942-1947 సంవత్సరాల మధ్య పి.సి. జోషి మితవాద ప్రభావంలోనూ, 1948 ఫిబ్రవరి నుండి రణదీవే నేతృత్వంలో అతివాద ప్రభావంలోనూ ఉండింది. ఈ రెండు పంథాలకు భిన్నంగా ఇంకా కచ్చితంగా చెప్పాలంటే వాటికి వ్యతిరేకంగానూ ఆ పోరాటం ప్రారంభమయి అభివృద్ధి చెందింది. నల్లగొండ జిల్లాలోని కామ్రేడ్స్ తమ స్వంత చొరవ, బాధ్యత మీద పోరాటాన్ని నిర్మించి క్రమంగా దాన్ని పక్క జిల్లాలలోని(ప్రస్తుత వరంగల్, ఖమ్మం జిల్లాలకు) వివిధ ప్రాంతాలకు విస్తరించారు. జాతీయ స్థాయిలోని పార్టీ తప్పుడు పంథాలతో పాటుగా, ఆంధ్రరాష్ట్ర కమిటీలోని మితవాదాన్ని పోరాటాన్ని వారు ముందుకు తీసుక వెళ్లవలసి వచ్చింది. మొదట నిజాం, ఆ తర్వాత, కేంద్ర పంపిన సాయుధ బలగాల అణచివేతలకు వ్యతిరేకంగా పోరాటాన్ని నిలబెట్టుకొంటూ ముందుకు తీసుకవెళ్లగలరు. ఇది ఎంతో ప్రాముఖ్యకత గల గుర్తించవలసిన విషయమే. అందువలన కేంద్ర నాయకత్వం ఆనాటి సాయుధ పోరాటాన్ని చైతన్య పూర్వకంగా అర్థం చేసుకోక పోవడం అనేది కాకుండా, ఆనాడు వారిలో కొనసాగిన మితవాద, అతివాద పెడధోరణుల ప్రభావంగా భావించాల్సి ఉంటుంది. అంతిమంగా వారు పోరాటానికి ద్రోహం చేసి దాన్ని విరమింపచేశారు.

ముందుగానే నిర్ణయించుకున్న ఒక పంథా ప్రకారం తెలంగాణ పోరాటం అభివృద్ధి అయిందికాదు. వెట్టి చాకిరి, కౌలుదారి సమస్యలాంటి ప్రజాసమస్యను తీసుకొని నల్లగొండ జిల్లాలో పోరాటాలను నిర్మించాకాన్నీ 1940 ప్రాంతంలో ప్రారంభించిన్నారు. 1944 నాటికి జనగాం ప్రాంతంలో మొండ్రాయి గ్రామ లంబాడి రైతులు తమ భూమి సమస్యను పార్టీ ముందుకు తీసుకవచ్చారు. దాని ప్రాదాన్యతను ఆచరణలో గుర్తించిన జిల్లా నాయకత్వం ఆ సమస్యను అనేక ఇతర గ్రామాలు, ప్రాంతాల్లో కూడా చేపట్టడంతో ఆ ఉద్యమం మరింత ముందుకు పోయింది. ఆ తర్వాత వాలంటరీ దళాల నిర్మాణ (గుతవల సంఘాల) ఆవశ్యకతను పార్టీ గుర్తించి పోరాటం కొనసాగుతున్న అన్నీ గ్రామాల్లోను వాటిని ఏర్పాటు చేసింది. 1948 జూలై నాటికి మాత్రమే నూతన ప్రజాస్వామిక విప్లవం, చైనా విప్లవం పైన మావో పైన ప్రాథమిక స్థాయిలో అయినా ఇక స్పష్టమైన అభిప్రాయం ఆంధ్రరాష్ట్ర కమిటీకి ఏర్పాడింది. 1949 సెప్టెంబర్ నాటికి ఆ స్పష్టత మరింతగా పెరిగి 'మనం గడించిన అనుభవాలు భారతదేశంలో నూతన ప్రజాతంత్ర విప్లవానికి ఒక కొత్త మార్గాన్ని చూపాయి' అని ప్రకటించగలిగిన స్థాయికి ఆ అనగాహన అభివృద్ధి చెందింది.

నక్సల్‌బరి, శ్రీకాకుళం పోరాటాల ద్వారా దేశంలో నూతన ప్రజాస్వామిక విప్లవం మరోసారి ఎజెండా మీదికి తేబడింది. ఈ సారి అది పార్లమెంటరీ పంథాలో పీకల దాకా కురుకొని పోయిన పార్టీలో నుండి సంపూర్ణంగా బయటపడి కొత్త విప్లవ పార్టీల, సంస్థల నిర్మాణాలను ఏర్పాటు చేసుకొన్నది. ఆ విధంగా సాయుధ పోరాటం, నూతన ప్రజాతంత్ర విప్లవం కోసం పోరాటం తిరిగి ప్రారంభమయింది. అవ కొద్ది స్థాయిలోనే జరిగిన పోరాటాలే అయినా, నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని, ప్రజాయుద్ధ పంథాను తిరిగి ఎజెండా మీదకు తీసుక వచ్చిన పోరాటాలుగా నక్సల్‌బరి శ్రామిక పోరాటాలకు విశిష్టమైన విప్లవ ప్రాముఖ్యత ఉన్నది. ఇది కమ్యూనిస్టు విప్లవకారులందరూ గుర్తిస్తున్నదే. శ్రీకాకుళం పోరాటంపైన విమర్శ అది చివరి దశలో అనుసరించిన 'వర్గశత్రు నిర్మూలన' పైన మాత్రమే తప్ప శ్రీకాకుళ పోరాట విప్లవ స్వభావాన్ని ఎవరూ విమర్శించడం లేదు. ఆఖతం కార్యక్రమాన్ని ఇప్పుడు మావోయిస్టు పార్టీతో సహా అందరూ తప్పుగా గుర్తిస్తున్న విషయమే కదా!

ప్రస్తుతం దేశంలో కొనసాగుతున్న విప్లవోద్యమం, మావోయిస్టుపార్టీ నాయకత్వంలో సాగుతున్న ఉద్యమం ప్రత్యేకంగా, ఆనాటి తెలంగాణ సాయుధపోరాట అనుభవాల నుండి గుణపాఠాల నుండి నేర్చుకొని ప్రస్తుత కృషికి అన్వయించు కోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. దాని కోసం వారు అది అధ్యయనం చేయాల్సి ఉంటుంది. దాని కోసం వారు ఆనాటి పార్టీ డాక్యుమెంట్లను, దానిపై వచ్చిన చరిత్ర గ్రంథాలను(ముఖ్యంగా పైన పేర్కొన్న 1948, 49 డాక్యుమెంట్లను, దేవులపల్లి వెంకటేశ్వరరావు గారు రాసిన తెలంగాణ ప్రజల సాయుధ పోరాట చరిత్రను, ఇతర సాహిత్యాన్ని) తప్పక అధ్యయనం చేయాల్సిన అవసరం ఉన్నది. ఇప్పటికే వాటిని చదివిన వారు ఈ చర్చ వెలుగులో మరో సారి అధ్యయనం చేయడం బాగుంటుంది. తెలంగాణ సాయుధ పోరాటాన్ని ఒక వీరోచిత పోరాటం అనో, చారిత్రక పోరాటం అనో గుర్తించి వదిలివేయడం పైన పేర్కొన్న కృషికి ఎంతమాత్రం ప్రత్యామ్నాయం కాజాలదు.

*(రచయిత గ్రామీణ పేదల సంఘం మాజీ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి,*
*ప్రస్తుతం 'పోరునేల' ప్రచురణ సంస్థ సంపాదకులు)* వీ

# కుల చట్రంలో లక్షింపేటకు పరిష్కారమా?

- పుల్లూరు జగదీశ్వర్ రావు

శ్రీకాకుళం జిల్లా వంగర మండలం లక్షింపేటలో దళితులపై జరిగిన దాడిలో 'బాధితులారా బహుపరాక్' (డిసెంబర్ 2012) వీక్షణం) వ్యాసంలో కృపాకర్ మాదిగ కాపు కులస్తులను అహంకారులుగా, ఆధిపత్య కులాల స్థాయికి ఏమాత్రం తీసిపోని వారిగా విమర్శించారు. అదే విధంగా స్థానిక తహసిల్దార్, డిఎస్పీ నుండి మొదలుకొని ఎం.ఎల్.ఎ., మంత్రి వరకు అందరూ బాధితుల సామాజిక వర్గానికి చెందిన వారైనప్పటికి, బాధితులకు సత్వర న్యాయం అందక పోవడం దేనికి సూచిక అని ప్రశ్నించారు.

బాధితుల సామాజిక వర్గానికి చెందిన ఎం.ఎల్.ఎ., మంత్రి బాధితుల పక్షాన నిలబడక పోవడానికి రాజకీయ ప్రయోజనాలు తప్ప మరేమి కావు. ఎం.ఎల్.ఎ., మంత్రిగారు బాధితుల పక్షాన నిలబడితే బలమైన సామాజిక వర్గానికి చెందిన కాపుల ఓట్లకు దూరం కారా? ఇంకా ఎక్కువగా ఆ సమస్యను భుజానికెత్తుకుంటే వెనుకబడిన తరగతుల ఓట్లకు దూరం కారా? 50 శాతం వరకు ఉన్న వెనుకబడిన తరగతుల ఓట్ల కోసం, ఎవరైన ఎందుకు రాజకీయ శతృత్వం కొని తెచ్చుకుంటారు. అందువల్ల కుల ఓట్ల ప్రయోజనాల దృష్యా ఎం.ఎల్.ఎ., మంత్రిగారు మౌనంగా ఉన్నారు. ఆ ఉచ్చులోకి లాగొద్దన్నారు.

రాష్ట్రవ్యాప్తంగా కూడా ఈ సంఘటనపై చుండూరు, కారంచేడు సంఘటనల మాదిరిగా పెద్ద ఎత్తున నిరసన వ్యక్తం కాలేదు. దానికి కారణం ఈ సంఘటనలో వెనుకబడిన కులస్తులైన కాపులు భాగస్వాములు కావడమే. అంతేకాకుండా ఉత్తరాంధ్రలో రాజకీయ, సామాజిక ఆర్థిక ఆధిపత్యం అంతా వెనుకబడిన తరగతుల చేతుల్లోనే ఉంది. అంతేకాకుండా కాపులను వ్యతిరేకంగా మాట్లాడితే, వెనుకబడిన తరగతులను వ్యతిరేకించినట్టుగా భావిస్తారని అన్ని రాజకీయ పార్టీలు వెనకంజ వేశాయి. బహుశా ఈ దాడిలో అగ్రవర్ణాలు భాగస్వాములయి ఉంటే నిరసన హెచ్చుస్థాయిలో ఉండేదేమో!

తహసిల్దార్, ఎస్.ఐ., డి.ఎస్.పి.లాంటి అధికారులు, బాధితుల సామాజికవర్గానికి చెంది కూడా వారి పక్షాణ ఎందుకు నిలబడలేదు. వీరికి కులస్పృహ లేకనా లేక వీరు కులాన్ని మరచి పోయారా అని వీరిని నిందించి ప్రయోజనం లేదు. ఏ ఎం.ఎల్.ఎ. అయిన, మంత్రిగారైన తమ సామాజిక వర్గానికి చెందిన అధికారులను తను ప్రాతినిధ్యం వహించే నియోజక వర్గం లేదా జిల్లాలో ఏరికోరి నియమించుకుంటారు. అందుకు లక్షింపేట పరిదిలోకి వచ్చే ఎం.ఎల్.ఎ., మంత్రిగారు మినహాయింపు కారు. అలా నియమించుకున్న అధికారులందరూ మంత్రి అదుపాజ్ఞలోనే పనిచేస్తారన్నది జగమెరిగిన సత్యం. సంఘటన తర్వాత ఆ మంత్రి అజ్ఞలకోసం ఎదురుచూశారు అధికారులు. మంత్రిగారే స్వయంగా అందులోకి తనను లాగొద్దని విన్నవించుకున్నప్పుడు, అతని కింద, అతని కనుసన్నల్లో నడిచే అధికార గణం కూడా మంత్రిలాగే దూరంగా ఉన్నారు. మంత్రి ఆలోచనలకు భిన్నంగా, అధికారులు ఎలా ప్రవర్తిస్తారు. అలా ప్రవర్తించి మనగల్గుతారా?

అందుకు భిన్నంగా, ముక్కుసూటిగా, నిజాయితీగా వ్యవహరించే అధికారులుంటే, పరిస్థితి కొంచెం భిన్నంగా ఉండేది. మంత్రిగారి ఆజ్ఞలకోసం ఎదురు చూసేవారు కాదు. మంత్రిగారికి అతని స్వీయ ప్రయోజనాలు ముఖ్యం. అతని పనులు చక చక జరగాలంటే అతని అదుపాజ్ఞలో నడుచుకొనే స్వీయ కులస్తులు అవసరం. కాబట్టి మంత్రిగారిని, అతని కులాన్ని, అతని కింద పనిచేసే అదే కులానికి చెందిన అధికారులను విమర్శించి ఏం ప్రయోజనం. కుల రాజకీయాలను, కుల స్పృహను పెంచుతూ పోతే, పరిణామాలు ఇలాగే ఉంటాయి.

విద్య, ఉద్యోగ, సంక్షేమ, రాజకీయ రిజర్వేషన్లు పొందిన వారు సహబాధితుల పట్ల, సాటి కులస్తుల పట్ల సామాజిక బాధ్యతను మరచిపోయారని నిందించి లాభంలేదు. కూడు దొరికితే కులాన్ని మర్చిపోతున్నారని కుల స్పృహను రెచ్చగొట్టి ప్రయోజనం లేదు. బాధితుల పక్షాన, బాధితుల సామాజిక వర్గానికి చెందిన అధికారులు అండగా నిలబడితే, దాడులకు పాల్పడిన సామాజిక వర్గానికి చెందిన అధికారులు వారి చుట్టూ సమీకరించబడరా? బాధితులకు కులం ఉన్నట్టే, దాడులకు పాల్పడిన వారికీ కులం ఉంది.

నిజానికి కులాల చుట్టూ చర్చ పరిభ్రమిస్తున్నప్పుడు, బాధితులకు న్యాయం జరిగే అవకాశం లేదు. ప్రతి ఒక్కరు కుల పరిదిలోనే ఆలోచిస్తారు. కాబట్టి బిసి మేదావులు ఈ విషయంపై స్పందించాలని పిలుపు నివ్వడం అర్థరహితం.

రామస్వామి పెరియార్ బ్రాహ్మణ ఆదిపత్యం సన్నగిల్లితే సామాజిక న్యాయం జరుగుతుందని, అన్ని సామాజిక వర్గాలు సమాన స్థాయిలో హక్కులు అనుభవిస్తారని భావించారు. కాని తమిళనాడులో అలా జరగలేదు. బ్రాహ్మణ ఆధిపత్యం తగ్గింది. కాని దాని స్థానంలో అనేక ఒ.బి.సి. కులాలు 'బ్రాహ్మణుల' స్థానాన్ని ఆక్రమించాయి. మునుపెన్నడు లేని విధంగా కులాల మద్య ఘర్షణలు జరుగుతున్నాయి. అత్యధిక వెనుకబడిన కులాలు పట్టల్, మక్కల్, కచ్చి (పి.ఎం.కె.) ఆధ్వర్యంలో సమీకరించబడుతున్నారు. ఎస్.సి., ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టాన్ని రద్దుచేయాలని డిమాండ్ చేస్తున్నారు. అదే విధంగా ఉత్తర్‌ప్రదేశ్‌లో వెనకబడిన తరగతులకు నేతృత్వం వహిస్తున్న సమాజ్‌వాదీ పార్టీ పదోన్నతులలో దళితులకు రిజర్వేషన్లను అడ్డుకుంటున్నది. దీనికి ప్రధాన కారణం దళితులు ఆ పార్టీకి ఓటు బ్యాంకు కాకపోవడమే వారందరు బిఎస్‌పి మద్దతు దారులు కావడం అసలు సమస్య.

కుల తగాదాల కుంపటిని రాజేయడం వల్ల రావణకాష్టమే కొనసాగుతుంది. దళితులకు, సంఖ్య పరంగా తక్కువగా ఉన్న కులాలకు, పేదవర్గాలకు మరింత నష్టం జరుగుతుంది. కులాలు మరింత ఘనీభవిస్తాయి. కాబట్టి ఇతర కులాలను గంపగుత్తగా తిట్టిపోయడం, మాలలను కించపరచడం, రిజర్వేషన్ల ద్వారా ఉద్యోగాలు పొంది, కుల స్పృహ కోల్పోతున్నారని బాధపడడం, వెనుకబడిన తరగతుల వారు అగ్రవర్ణాల మాదిరిగా వ్యవహరిస్తున్నారని కలత చెందడంవల్ల ఏ ప్రయోజనం లేదు. లక్షింపేట లాంటి సమస్యలకు కులచట్ర పరిధిలో పరిష్కారం లేదు. కుల పరిధి నుండి బయట పడి, పరిష్కారాలను అన్వేషిస్తే ప్రయోజనం చేకూరుతుంది. ఆ దిషగా అందరూ ఆలోచిస్తే మంచిది.

*(రచయిత ప్రభుత్వ ఉపాధ్యాయులు)*

వీ

# దళిత ఆత్మగౌరవ పోరాటాన్ని ఎత్తిపట్టిన కె. సత్యనారాయణ వ్యాసం

**- కె. సుబ్బనాచారి**

మొత్తం దళిత ఉద్యమాన్ని దాని క్రమ పరిణామాన్ని విశ్లేషిస్తూ నేటి వరకు నడుస్తున్న ఉద్యమాన్ని గురించి చాలా బాగా రాశారు. ఈ రోజు ఇలాంటి వ్యాసాలు రావడం అవసరం కూడా. విడివిడి పోరాటాల వల్ల దేని ఫలితం దానికుంటుంది. కానీ విశాలత్వంలో పిలుస్తుంది. దళిత పోరాటంగానీ, బలహీన వర్గాల పోరాటాలు గానీ, మైనారిటీ మతాల వారి పోరాటాలుగానీ, ఇంకే ఇతర చిన్నా, చితక పోరాటాలన్ని కూడా సమాజ గర్భం నుండి జనించినవే కదా! ఈ సమాజాన్ని మార్చే క్రమంలోనే ఇవన్ని శాశ్వతంగా పరిష్కరించబడతాయని నా అభిప్రాయం. విడి విడి పోరాటాల వల్ల కలిగే ఫలితం తాత్కాలికమే కాకుండా ఆ పోరాటాల మధ్య వైషమ్యాలు తీవ్రమవు తాయని భావిస్తున్నాను. ఇవన్ని వర్గ పోరాటంలో భాగం చేసుకొని సామాజిక మార్పుకు ఉద్యమిస్తేనే శాశ్వత పరిష్కారం లభిస్తుందని, వర్గపోరాటంలోనే శ్రామిక వర్గానికి అధికారం లభిస్తుందని, ఆనాడు వివిధ సెక్షన్స్‌గా చీలిన ప్రజలకు అధికారం అభిస్తుందని, అప్పుడే వారి జీవితాలు బాగుపడుతాయని, కనుక వర్గ పోరాటంలో కలిసి నడవాలని నా అభిప్రాయాన్ని నిక్కచిగా చెప్పదలచుకొన్నాను. ముందు రాజ్యాధికారం ప్రధానమైంది కదా! ఆ తరువాత శ్రామిక వర్గపరిపాలనలో పీడితులకు రక్షణ ఉంటుంది. అంటే ప్రజల చేతుల్లోకి అధికారం వస్తుంది. ఆ తరువాత కూడ ఎన్నో వైరుధ్యాలు సమాజంలో ఉంటాయి. అవి క్రమానుగంగా పరిష్కరించుకొంటూ ముందుకు పోవాలి. ఇవన్ని కూడ ప్రజల మధ్య వైరుధ్యాలుగా చూడవలెను. శత్రువైరుధ్యాలుగా చూడరాదు. అట్లా చూస్తే తమలో తాము బలహీన పడుతున్నట్లే కదా! నేడు వస్తున్న పరిస్థితులలో శ్రామిక వర్గానికి నాయకత్వం వహించగల్గిన సత్తా, చేవ ఒక్క మావోయిస్టు పార్టీకి మాత్రమే ఉంది అనేది నిస్సందేహం. ఇంకొక పార్టీకి ఆ సత్తాలేదు. మావోయిస్టు ఉద్యమ నాయకత్వాన సమీకృతులై ముందుకు నడవాలని, త్వరగా విప్లవం జయించే రోజు వస్తుందని ఆశిస్తున్నాను. దోపిడిపాలక వర్గాల నిజస్వరూపం మునుపెన్నటి కంటే కూడా నేడు బాగా బట్టబయలై అశేష ప్రజానీకానికి దూరమై ఒంటరిదై పోతున్నది అనేది కూడ రుజువవుతున్నది. ఈ రోజు పాలక వర్గాలు భయంతోనే పాలన సాగిస్తున్నాయి. ఇంతకు ముందు ధైర్యం దానికి ఇప్పుడు లేదు. అందుకే అమెరికన్ పాలక వర్గాల పాదాల ముందు మోకరిల్లుతున్నది. ఈ విప్లవాన్ని ఆపడానికి ఎవరితరం కాదు అనేది యథార్థం. ఈ నిజాన్ని తెలుసుకోవలిసిన పరిస్థితి పీడత ప్రజానీకానికి నేడు అంతగా ఆవశ్యకంగా ఉన్నది. ఉద్యమంలో పాల్గొనడానికి తగినన్ని అవకాశాలు కూడ మెండుగా ఉన్నాయి. ఈ రోజు దేశ ప్రజల ముందున్నది రెండే రెండూ మార్గాలు. ఒకటి పీడిత ప్రజానీకమంతా కలిసి వచ్చి, మావోయిస్టు ఉద్యమానికి బేషరతుగా మద్దతునివ్వడమా లేక అమెరికన్ సామ్రాజ్యవాదం ముందు మోకరిల్లడమా అనేది ఇంతకన్న వేరే మార్గం లేదు. ఏదో ఒకటి తెలుసుకొవలసిన పరిస్థితులు కొట్ట వచ్చినట్లు కనబడుతున్నాయి. పీడిత ప్రజానీకానికి మద్దతునిచ్చే ప్రజాస్వామిక మేధావుల ముందు గురుతరమైన బాధ్యతలున్నాయి. చీలికలు, పేలికలైన ఉద్యమాలు చెల్లాచెదరై పోకుండా ఒక్క త్రాటిపైకి తెచ్చి సమైక్య ఉద్యమంగా తీర్చి దిద్దడంలో వీరి బాధ్యత ఎంతో ఉన్నది. సమాజంలో నానాటికి విప్లవ ధోరణులు బలం పుంజుకుంటున్నాయి. ప్రయత్న పూర్వకంగాను, అప్రయత్న పూర్వకంగాను కూడ విప్లవాగ్ని ప్రజ్వరిల్లుతున్నది. తాత్కాలికంగా వెనుకపట్టు పట్టినప్పటికి తిరిగి కోలుకొని మును ముందుకే సాగుతున్నది. దోపిడి వర్గాలకు దీటుగాను, ప్రత్యక్షంగాను ఎదుర్కొని పోరాడేది ఒక్క మావోయిస్టు పార్టీ మాత్రమేననేది వాస్తవం. వీరికి మద్దతు తెలపడమా లేక దోపిడి వర్గాల ఎంగిలి మెతుకులకు ఆశపడివారి పాదాక్రాంతంగావడమా అనేది ఏదో ఒకటి తేల్చుకోవాల్సిన పరిస్థితులు వచ్చేసినాయి. అటో, ఇటో ఏదో ఒకటి తేల్చుకోవాలి. మధ్య మార్గం లేదు. మధ్యమార్గం అనేది చివరకు పాలక వర్గాలకు సేవ చేసేదిగానే ఉంటుంది అనేది యథార్థం. ఎంతో మంది బుద్ధిజీవులు, మేధావులు విప్లవోద్యమంలో కొంతకాలం పని చేసి వారివారి స్వంత ప్రయోజనాలతోను, ఆలోచనలతోను వివాదపడి బయటికొచ్చేసి, కొన్ని సంస్థలు స్థాపించారు. చేసి మధ్యలో విరమించుకొన్నవారు, ఇంకా ఆశతో చేసేవారు ఉన్నారు. చివరకు నిరాశకు లోనై ఎటు కాకుండా సామ్యవాద సమాజంలోనే ప్రజల సమస్యలకు పరిష్కారమున్నది గానీ, వేరే విధంగా లేదు. దాని అర్థం ఏమిటంటే శ్రామికవర్గ రాజ్యాధికారంలోనే ఉన్నదనేది. దోపిడి వర్గాల్ని మన వీపు మీద మోస్తున్నపుడు వారి ద్వారా సమస్యల్ని పరిష్కరించుకోవాలని అనుకోవడం ఎండమావుల్ని చూచి పరిగెత్తినట్లే. కొన్ని కులాలతోనే అధికారం రాజాలదు. సమస్త పీడత ప్రజానీకం కలసి వచ్చిన నాడే నిజమైన అధికారం లభిస్తుంది. కొన్ని కులాలతో వచ్చేది దోపిడి వర్గాల దయా దాక్షిణ్యాలతోనే అనేది సత్యం. ఈ మార్గంతొక్కడం అంటే తిరిగి అధోలోకంలోకి దొర్లడమే. పార్లమెంటరీ భ్రమలతో కొట్టుకొనిపోతున్న వామపక్షం అని చెప్పకొనే పార్టీలన్ని నిస్సారమై పోతున్నాయి. వాటి వలన డాంబికమైన మాటలు తప్ప ఇంకేమీ లేదు.

సామ్రాజ్యవాద విషఫలితాలు లోకసంచారి వ్యాసం అద్భుతంగా ఉన్నది. సమాజం మొత్తం ఎట్లా కలుషితమై పోతుందో, ఆ విష ఫలితాలు భవిష్యత్ తరాన్ని ఎంతగా అధోగతిలోకి నెట్టుతుందో బాగా రాశారు. సామ్రాజ్యవాదులు సమాజంలోని అన్ని రంగాలలోకి ఏ విధంగా జొరబడుతున్నారో, ఈ రోజున సమాజంలో ఎలాంటి విష సంస్కృతిని వెదజల్లుతున్నరో, ఆ సంస్కృతి విష ఫలితాలు ఏ విధంగా మానవ మేధస్సును హరించివేస్తున్నవో బాగా అర్థవంతంగా రాశారు. ఈ మొత్తం వ్యాసం మన దేశ సామాజిక స్వరూపాన్ని చూపిస్తుంది. ఇంతకు ముందరి దురాక్రమణ దారులు చల్లగా మన నట్టింట్లో పడకవేశారు. వారిని పారదోలాలనే చిత్తం కూడా మనకు లేకుండా పోయింది. ఈ భావజాలాన్ని అర్థం చేసుకోవడం కూడ మన ఆలోచనకు రాకుండా పోయింది. ఈ దుర్మార్గపు భావజాలాన్ని అర్థం చేసుకోవడం కూడ మనకు సాధ్యంగాని రీతిలో మన పాలకులు ప్రవేశపెట్టుతున్నారు. ఇవన్ని కూడ మన అభివృద్ధికై అనేది బాగా ఎక్కించారు. ఈ విష సంస్కృతి అంటే తల్లి గర్భం నుండి పుట్టి మానవ రక్తంలో కలుషితమై పోయిందనేది తెలుసుకోలేక మత్తులో

# వ్యవసాయ సంబంధాలు - స్త్రీల పాత్రలో మార్పులు - అర్ధభూస్వామ్యం

- ఆశాలత

వీక్షణం దశాబ్ది ప్రత్యేక సంచికలో ఎన్. వేణుగోపాల్ రాసిన 'చలనంలో విషయం–చలనంలో అధ్యయనం' అనే పత్రం చదివిన తర్వాత కొన్ని అంశాలను ముందుకు తేవాల్సిన అవసరముందనిపించింది. ఈ పత్రంలో భారత సమాజం అర్ధ వలస, అర్ధ భూస్వామ్య సమాజంగానే ఉన్నదా పెట్టుబడిదారీ వ్యవస్థగా మారిందా అనే దానిని అర్థం చేసుకోవడానికి ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ పరివర్తన గురించిన విశ్లేషణ జరిగింది. ఇదే సంచికలో కోబడ్ గాంధీ రాసిన వ్యాసంలో భూస్వామ్య సంబంధాలు ఏ మేరకు బలహీనమయ్యాయి. ఎ మేరకు పెట్టుబడి దారీ పరివర్తన జరిగిందీ అర్థం చేసుకోవడానికి సైద్ధాంతిక పునాదిని వివరించారు. ఈ రెండు వ్యాసాలు నేటి సమాజ స్వభావాన్ని అధ్యయనం చేయడానికి మార్గదర్శకంగా, చాలా ఉపయుక్తంగా ఉన్నాయి.

వేణుగోపాల్ తన పత్రంలో వ్యవసాయ సంబంధాలలో వచ్చిన మార్పును అవగాహన చేసుకోనేందుకు ముప్పై సంవత్సరాల క్రితం ఒక విప్లవ పార్టీ చేసిన అధ్యయనాన్ని పునాదిగా చేసుకొని రెండు గ్రామాల పునరధ్యయనాన్ని విశ్లేషించారు. గత అధ్యయనంలో పరిశీలించిన అంశాలతో పాటు కొత్తగా తలెత్తిన అంశాలున్నాయో లేదో పరిశీలించడానికి ప్రయత్నించామని పేర్కొన్నారు. అట్లా గుర్తించిన అంశాలు వలసలు, సేవారంగం, పెరుగుదల, కొత్త సరుకుల ప్రవేశం ప్రభుత్వ సంక్షేమ పథకాలు. అయితే ఒకటి రెండు గ్రామాలను అధ్యయనం చేసినంత మాత్రన దేశానికి సంబంధించిన సంపూర్ణ చిత్రాన్ని రాబట్టలేమని కూడా ఈ పత్రం చివరలో చెప్పారు. వ్యవసాయంలో వచ్చిన మార్పులను మరింత సమగ్రంగా అవగాహన చేసుకోవడానికి కొత్తగా తలెత్తిన అంశాలకు మరికొన్నిటిని జోడించాల్సిన అవసరముంది. ఇందులో ముఖ్యమైనవి కాంట్రాక్టు వ్యవసాయం. నీటి వనరుల ప్రైవేటీకరణ, వ్యవసాయంలో స్త్రీల పాత్ర. వీటిని లోతుగా పరిశీలించడం ద్వారా ఉత్పత్తి సంబంధాల రూపంలోనే మార్పు వచ్చిందా, స్వభావంపైన ప్రభావం పండిందా అనేది అర్థం చేసుకోవచ్చు.

కాంట్రాక్టు వ్యవసాయ పద్ధతి మన రాష్ట్రంలో దాదాపు ఇరవై సంవత్సరాల క్రితమే మొదలయింది. ఇప్పుడు మరింత విసృతంగా సాగుతున్నది. 1990 తర్వాత ప్రవేశ పెట్టిన నూతన ఆర్థిక సంస్కరణలు, నయా ఉదారవాద విధానాల నేపథ్యంలోనే ఇది జరిగింది. బహుళ జాతి కంపెనీలు స్వదేశీ కంపెనీలతో కలసి కాంట్రాక్టు పద్ధతిపై తామే పెట్టుబడి పెట్టి తాము విధించిన షరతులతో రైతులతో ఒప్పందాలు చేసుకొని తాము చెప్పిన వాణిజ్య పంటలనే పండించేటట్లు చేసే పద్ధతి ఇది. పంట పండించిన తర్వాత కంపెనీ పెట్టిన నాణ్యత కొలమానాలకు చేరుకోలేదనే సాకుతో సరైన ధర చెల్లించకపోవడంతో ఆదాయం లేక అప్పుల పాలవుతున్నారు. ఈ పద్ధతిలో రైతులు ఏం పండించాలి. ఎట్లా పండించాలి అనే నిర్ణయాధికార హక్కును, సాగుపైన, పంటలపైనా విత్తనంపైనా సార్వభౌమత్వాన్ని కోల్పోతున్నారు.

నీటి వనరుల విషయానికొస్తే గతంతో రైతులు ఉమ్మడి నీటి వనరులైన చెరువులు, కాలువలపై సాగునీటి కోసం ఆధారపడేవారు. సాగునీటి వసతి లేని చోట్ల వర్షాధారంతో సాగుచేసేవారు. హరిత విప్లవం తర్వాత వ్యవసాయం సాంద్రత పెరిగింది. వర్షపాతం కూడా తగ్గడంతో చాలా ప్రాంతాలలో బోర్లపై ఆధారపడుతున్నారు. గతంలో ఉమ్మడిగా ఉపయోగించిన చెరువులు పూడికతీతకు, మరమ్మత్తులకు నోచుకోక చెరువు భూములు ఆక్రమణకు గురయి సాగునీటి వనరుగా పనికి రాకుండాపోయినాయి. ప్రతి రైతు వ్యక్తిగతంగా బోర్లు తవ్వడం మొదలయింది. కొన్ని చోట్ల బోర్లు లేనిదే వ్యవసాయం చేయలేమనే స్థితి కొచ్చారు. ఒకసారి బోర్లు వేస్తే నీళ్లు పడక పోతే రెండు, ఎనిమిది సార్లు బోర్లు వేసి అప్పులలో కూరుకుపోయిన రైతులు చాలా మంది ఉన్నారు. ఉమ్మడిగా ఉండవలసిన నీటి వనరులు, లేక ప్రభుత్వం కల్పించవలసిన సాగునీటి వసతి స్థానంలో నీటి వనరు వ్యక్తిగతమై పోతున్నది. వనరుల ప్రైవేటీకరణ అనేది, సహజవనరుల విచక్షణారహిత దోపిడి అనేది పెట్టుబడిదారీ విధాన లక్షణాలు.

ఇక వ్యవసాయంలో స్త్రీల పాత్రలో వచ్చిన మార్పుల విషయానికొస్తే స్త్రీల భూమి హక్కులు, ఉత్పత్తిలో భాగస్వామ్యం, వేతన శ్రమ, నిర్ణయాధికారం, అప్పుల భారం మొదలైన అంశాలన్నిటిలో గత ఇరవై సంవత్సరాలలో స్పష్టమైన మార్పులు కనిపిస్తున్నాయి.

భూస్వామ్య సమాజంలో పితృస్వామ్య వ్యవస్థ క్రూరత్వం, అణచివేత చాలా నగ్నంగా వ్యక్తమయ్యేది. ఉత్పత్తి వ్యవస్థలు మారుతూ వచ్చిన కొద్ది

---

తూగి పోతున్నాం. ఈ మత్తును వదలగొట్టేలాగ ఉంది ఈ వ్యాసం. అయితే చదివే వారి సంఖ్య అనేది ముఖ్యం. వేయికి ఒక్కరు చదివినా ఎంతో మార్పు తీసుకొని రావచ్చునని నా అభిప్రాయంతో ఈ రచయితగార్కి నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

ప్రత్యామ్నాయ చరిత్ర నిర్మాణంలో విప్లవోద్యమం వరవరరావుగారి కలం నుండి వచ్చింది. మొత్తం విప్లవోద్యమం క్రమం పరిణామాన్ని చాలా తేట తెల్లంగా రాశారు. పూసల్లో దారంగా ఒక వరుస క్రమంలో విప్లవోద్యమాన్ని, దాని వివిధ పరిణామాల్ని, దశల్ని వివరించారు. ఇది ఒక సిద్ధాంత అధ్యయనానికి ఉపయోగపడే సిద్ధాంత వ్యాసం దీన్ని మనసు పెట్టి చదివి తెలుసుకొని కార్యచరణలో సరైనా అంచనాకు రాగలం అని ఆశిస్తున్నాను. భారతదేశ భవిష్యత్తుకు, అందుకు తగ్గ కార్యాచరణకు ఉపక్రమించే జ్ఞానాన్నిస్తుంది. ఈ వ్యాసం ఇంతకన్న ఎక్కువ రాయానికే శక్తి లేదు. ఇదే వ్యాసంలో అయిదవ పేరాగ్రాఫ్‌లోని తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటాన్ని విముక్తి పోరాటంగా నాయకత్వం భావించలేదు అని ఈ రచయితగారు రాశారు. ఈ అంశం మీద నా సందేహాలు ఉన్నాయి. ఈ సమస్య మీద మరొక వ్యాసంలో నా అభిప్రాయాల్ని రాస్తాను. రచయితగారికి ప్రత్యేకంగా తెలియచేస్తున్నాను.

*(రచయిత ఆయుర్వేద వైద్యులు)* వీ

పితృస్వామ్య పెత్తనం ఆధిపత్యం రూపాలు కూడా మారుతూ వచ్చాయి. భారీ స్థాయిలో ఉత్పత్తి సాగించడానికి వీలుగా, అంతకు ముందు ఇంటికి పరిమితమైన స్త్రీలను పెద్ద సంఖ్యలో బయటికి వచ్చి ఉత్పత్తిలో పాల్గొనడాన్ని పెట్టుబడిదారీ విధానం ప్రోత్సహించింది. ఫ్యూడల్ బంధానాలను తెంచుకుని విముక్తి చెంది స్త్రీలు ఫ్యాక్టరీలలో పనిచేయడం పెట్టుబడిదారీ వర్గ ప్రయోజనాల కనుగుణంగానే జరిగిందని ఆగస్ట్ బెబెల్ వివరించారు. వెనుకబడిన భూస్వామ్య వ్యవస్థను ఓడించి, కూలదోసి ముందుకొచ్చిన పెట్టుబడిదారీ విధానం, పైకి అభివృద్ధికరంగానే కనిపించినా శ్రమ దోపిడీని తీవ్రతరం చేసింది.(మన దేశంలో అది భూస్వామ్య వ్యవస్థను కూలదోసి కాక దానితో మిలాఖతయింది) పితృస్వామ్య వ్యవస్థతో జతకలిపి తన దోపిడిని సజావుగా సాగించుకోవడానికి వ్యవసాయ ఉత్పత్తిలో పెద్ద పీట వేస్తున్నది.

మన దేశంలో వ్యవసాయ రంగంలో 60-80 శాతం శ్రమను స్త్రీలే చేస్తున్నారని, గ్రామసీమలలోని మొత్తం స్త్రీలలో 70 శాతం మంది వ్యవసాయ ఉత్పత్తిలో పాల్గొంటున్నారని అనేక అధ్యయనాలు తెలియచేస్తున్నాయి. విత్తనాలు చల్లడం, నాటు, కలుపు, కోత (కోత యంత్రాలు రానిచోట) మొత్తం స్త్రీలే చేస్తున్నారు. దున్నడం, భూమిని తయారు చేయడం, చెరుకు నరకడం, పంట నూర్చడం మగవాళ్లు చేస్తున్నారు. మన రాష్ట్రంలో అత్యధిక సంఖ్యలో ఉన్న బి.సి, ఎస్.సి. కులాలకు చెందిన చిన్న సన్నకారు రైతు కుటుంబాల స్త్రీలు తమ భూములలో పని చేస్తూనే ఇతరుల పొలాలలో, పొరుగు ఊళ్లకు వెళ్లి కూడా పనిచేస్తున్నారు. భూమి లేని కుటుంబాలకు చెందిన స్త్రీలు పూర్తిగా వేతన శ్రమలో భాగంగా ఉన్నారు. వేతనాలలో ఆడ కూలీలకు మగ కూలీలకు గతంలో కొట్టవచ్చినట్లు కనిపించిన తేడా(ఉదాహరణకు 1997 వరకు తెలంగాణ జిల్లాలలో స్త్రీలకు రోజు కూలీ రు. 25, మగ కూలీలకు రు.50 ఉండేది) కొంత వరకు తగ్గింది. ప్రభుత్వం నిర్ణయించిన కనీస వేతనాలు పూర్తిగ అమలు కానప్పటికీ ఉపాధి హామీ చట్టం వచ్చిన తర్వాత సమాన వేతనమనే భావన పెరిగింది.

ఈ రోజున వ్యవసాయంలో నెలకొన్న సంక్షోభం కారణంగా ఒక్క వ్యవసాయంపైననే ఆధారపడి బతకలేక రైతు కుటుంబాలు రెండు, మూడు రకాల ఉపాధులు వెతుకుంటున్నాయి. కొన్ని కుటుంబాలు వ్యవసాయం నుండి పూర్తిగా నెట్టివేయబడి పట్టణాలకు వలసలు పోతుంటే చాలా పేద రైతు కుటుంబాలలో వ్యవసాయేతర పనులు (నిర్మాణ పనులు, క్వారీలు, రోడ్డు పనులు, చిన్న కంపెనీలు, పౌల్ట్రీ ఫారాలలో చిన్న ఉద్యోగాలు వంటివి) చేస్తున్నారు. అటువంటి కుటుంబాలలో స్త్రీలు వ్యవసాయం, పశుపోషణ బాధ్యతలు పూర్తిగా నెత్తిన వేసుకొని చేస్తున్నారు. ఈ రోజున వ్యవసాయంలో స్త్రీలు ప్రధాన శ్రమ శక్తిగా ఉన్నారు.

శ్రమలో ఉత్పత్తిలో భాగస్వామ్యం పెరిగిన పంటలకు సంబంధించిన నిర్ణయాధికారం, ఆదాయంపై నియంత్రణ మాత్రం కుటుంబంలో మగవారి చేతులలోనే ఉన్నాయి. స్త్రీలకు భూమి హక్కులు కల్పించాలని చాలా కాలంగా డిమాండ్ ముందుకొస్తున్నా, స్త్రీలకు ఆస్తిలో సమాన హక్కులు కల్పించాలనే చట్టాలు వచ్చినా ఎక్కడో తప్ప ఇంకా అత్యధికంగా భూమి పట్టాలు మగవాళ్ల పేరు మీదనే ఉన్నాయి. ఈ పితృస్వామ్య ఆధిపత్యం వ్యవసాయంలో స్త్రీ పురుషుల మధ్య ఘర్షణలకు, హింసకు దారి తీస్తున్నది. పిల్లల చదువులు, వైద్యం ఖర్చులు, వినిమయ సరుకుల వాడకం ఖర్చులు పెరిగి డబ్బు అవసరం పెరగడంతో వాణిజ్య పంటవైపు మొగ్గ చూపడం సాధారణంగా జరుగుతున్నది. ఉన్న కొద్ది భూమిలో తిండికి పనికి రాని వాణిజ్య పంటలువేసుకునే బదులు కుటుంబానికి సరిపడ తిండినిచ్చే తిండి పంటలు వేసుకోవాలని స్త్రీలు అభిప్రాయపడుతుంటే చాలా కుటుంబాలలో మగవాళ్లు( భర్తలు, కొడుకులు) దీనిని వ్యతిరేకిస్తున్నారు. వారే ముందుగా వాణిజ్య పంటల మోజులో పడి కంపెనీలతో సంబంధాలు పెట్టుకొని అధిక పెట్టుబడుల కోసం, బోర్ల తవ్వకం కోసం తలకు మించిన అప్పులు తెచ్చి మార్కెట్ శక్తుల విష వలయంలో చిక్కుకుంటున్నారు. ఈ క్రమంలో కుటుంబాలలో తీవ్రమైన తగవులు, ఘర్షణలు జరుగుతున్నాయి. అప్పుల బాధలు తాళలేక, దిక్కు తోచక ఆత్మహత్యలు చేసుకున్నవారంతా అత్యధికంగా 25-40 సంవత్సరాలున్న మగవాళ్లే. ఆ కుటుంబాల స్త్రీలు ఆ విషాదాన్ని భరిస్తూ, భర్త చేసిన అప్పులను తీరుస్తూ కుటుంబాలను పోషించే బాధ్యతను నెత్తిన వేసుకుంటున్నారు.

మన రాష్ట్రంలో గ్రామీణ రంగంలో కనిపిస్తున్న మరొక మార్పు స్వయం సహాయక బృందాల ఏర్పాటు. 10-15 మంది స్త్రీలతో ఏర్పడే ఈ గ్రూపులు గ్రామంలోని స్త్రీలందరిని గ్రూపులుగా విడదీసి వారిని పొదుపులు, అప్పులు, బ్యాంకుల వలయంలో ఇమిడ్చి వేశాయి. అప్పులు తీర్చలేని సభ్యులపై మిగిలిన సభ్యులు ఒత్తిడి తెచ్చి కట్టించడం ఈ క్రమంలో ఒక అప్పు తీర్చడానికి మరో అప్పు చేయడం, ఇట్లా స్త్రీలంతా అప్పుల ఊబిలో కూరుకుపోవడమే కాక స్త్రీల మధ్య మునుపు ఉండిన స్నేహ సంబంధాలు సమిష్టితత్వం విచ్ఛిన్నమై పోయి, డబ్బు సంబంధాలు, స్వార్థం, కక్షలు, తగవులు చోటు చేసుకుంటున్నాయి. పెట్టుబడిదారీ విధానం సమైక్యత, సమిష్టితత్వం, మానవీయ సంబంధాలను విచ్ఛిన్నం చేసి వ్యక్తిగత తత్వం, స్వార్థం, డబ్బు సంబంధాలు పెంచుతుంది. ప్రకృతితో మనిషి సహజీవనం బదులు ప్రకృతిని విధ్వంసం చేసి డబ్బు సంపాదించే దరాశను పెంచుతుంది. ఈ ధోరణి వ్యవసాయంలో చాలా వరకు వ్యక్తమవుతున్నది.

అయితే గ్రామీణ ప్రాంతాలలో పరిస్థితి ఇంత సంక్షుభితంగా ఉండడానికి కీలకం భూమి సమస్యే. దేశంలో 60-70 శాతం మందికి వ్యవసాయమే జీవనాధారంగా ఉన్నా, భూమి మాత్రం వ్యవసాయం మీద ఆధారపడిన చేతిలో లేదు. నేడు గ్రామాలలో కొత్త రకం భూస్వాములు తలెత్తారు. దాదాపు 25 శాతం గ్రామీణ కుటుంబాలు భూమిలేని కుటుంబాలుగానే ఉన్నాయి. వీరిలో అత్యధిక శాతం దళితులే. అందుకే దున్నేవాడికే భూమి ప్రాతిపదికగా భూమిని తిరిగి పంచవలసిన కర్తవ్యం మిగిలే ఉంది.

ఆ మార్పులన్నీ విశ్లేషించి చూస్తే మొత్తం మీద మన సమాజం ఇంకా అర్ధ భూస్వామ్యం నుండి పెట్టుబడిదారీ వ్యవస్థకు పరిణామ దశలోనే ఉన్నదని తెలుస్తున్నది. మన గ్రామాలలో, వ్యవసాయంలో, ఉత్పత్తి వ్యవస్థలో కనిపిస్తున్న మార్పులు, బలంగా వ్యక్తమవుతున్న పెట్టుబడిదారీ సంబంధాలుపై నుండి ప్రవేశ పెట్టిన, వక్రీకరించిన సంబంధాలేనని అర్థం చేసుకోవాలి.

భారత సమాజంలో వర్గ పొందిక చాలా సంక్లిష్టమైనదిగా కనిపిస్తుంది. వర్గ విభజనను, వర్గ సంబంధాలను కేవలం ఆర్థిక పునాదిపైన ఆధారపడి మాత్రమే కాక వర్గం, కులం, జెండర్, ఎత్నిసిటీ(స్థానిక సమూహాల అస్తిత్వం) అనే సామాజిక వర్గీకరణలు వాటి మధ్య సంబంధాలను కూడా పరిగణనలోకి తీసుకుని విశ్లేషించినప్పుడే ఆ సంక్లిష్టతను సమగ్రంగా అర్థం చేసుకోగలం.

*(రచయిత అంత్ర, యక్షి సంస్థలో పనిచేస్తున్న సామాజిక కార్యకర్త)* వీ

# చరిత్ర మౌలిక వాస్తవాలనే విస్మరించిన 'ప్రత్యామ్నాయ చరిత్ర నిర్మాణం'

**- ఎం. ఉదయభాను**

'ప్రత్యామ్నాయ చరిత్ర నిర్మాణంలో విప్లవోద్యమం' శీర్షికతో విరసం నాయకులు వరవరరావుగారు రచించిన వ్యాసంలో(వీక్షణం జనవరి 2013 దశాబ్ది ప్రత్యేక సంచిక) అనేక తప్పులున్నాయి. విశ్లేషణలో ఎవరి ధోరణి వారిది అనుకున్నా, కొన్ని మౌలిక విషయాల్లో వాస్తవాల పరిశీలనలో, అధ్యయన పద్ధతిలో తీవ్రమైన తప్పులున్నాయి. రెండు మూడు విషయాలకు పరిమితమై చూసినా చాలు, ఇవి తేటతెల్లమవుతాయి.

1. 'తెలంగాణ రైతాంగ పోరాటాన్ని (1946-51) సాయుధ పోరాటమని, విముక్తి పోరాటమని చెప్పుకున్నంతగా నాయకత్వం వహించిన కమ్యూనిస్టు పార్టీగానీ, సుందరయ్యగారితో సహా చరిత్ర రచయితలు గానీ విప్లవంగా అభివర్ణించలేదు' అని రాశారు. మళ్లీ మరోచోట 'తెలంగాణ పోరాటంలో మనకు సాయుధ పోరాటం, విముక్తి అనే మాటలు కనిపించినంత ప్రబలంగా విప్లవం అనే మాట కనిపించదు. ఇది యాదృచ్ఛికమా-సైద్ధాంతిక పరిమితియా'? అని ప్రశ్న లేవనెత్తారు.

రచయిత ప్రస్తావించకుండా వదిలేసిన ఆనాటి ప్రముఖ పార్టీ నాయకుడు, తెలంగాణ చరిత్ర రచయిత దేవులపల్లి వెంకటేశ్వరరావు కామ్రేడ్ డి.వి.గా ప్రసిద్ధులైన వారు 1950-51 నాటికే నాటి పార్టీ కేంద్ర కమిటీ సభ్యులు కూడ. తెలంగాణకు చెందిన వారు ఆ పోరాట ప్రత్యక్ష నాయకులేకాక, సిద్ధాంతవేత్త కూడ. నాటికీ, నేటికీ ప్రముఖ సిద్ధాంత రచనల్లో ఒక్కటైన 'ఆంధ్ర థీసిస్'ని (1948) రచించిన ఆంధ్ర కమిటీ సెక్రటేరియట్‌లో సభ్యులు కూడా అయిన డి.వి ఆ తర్వాత కాలంలో కూడా ఆ సిద్ధాంతాన్ని పునఃప్రతిపాదించినవారు. ఆయన ఆ పోరాటంపై రచించిన అనేక రచనలు 1970 నుంచి తెలుగులోనూ, ఇంగ్లిషులోనూ కూడ అనేక ముద్రణలు పొందాయి. వాటిల్లో తలమానికమైనది 'తెలంగాణ ప్రజల సాయుధ పోరాట చరిత్ర (1946-51)' అన్న ప్రసిద్ధ గ్రంథం. 'ప్రొలెటేరియన్ లైన్ ప్రచురణలు' 1988లో ప్రచురించిన ఈ ఉద్గ్రంథం (600 పేజీలకు పైనే ఉన్నది) విరివిగా లభ్యమైంది (500 కాపీలు). తెలంగాణ విప్లవ వారసత్వం గురించి ఇంతగా మాట్లాడే ఈ రోజుల్లో ఈ పుస్తకాన్ని, డి.వి.ని విస్మరించి రాయడం వరవరరావు గారికే చెల్లింది. ఆయన వ్యాసంలోని లోపాలకు మూలం అందులోనే ఉంది.

పై పుస్తకం మొదటి పేజీలోనే ఇలా ఉంది.

'తెలంగాణ ప్రజల సాయుధ పోరాటానికున్న వాస్తవమైన ప్రత్యేకత ఏమంటే: ఇచ్చట భావి భారత విప్లవ పంథాకు సంబంధించిన ప్రయోగం (ఎక్స్పరిమెంట్) జయప్రదమైనది. ఈ ప్రయోగాన్ని ఆధారం చేసుకొని కమ్యూనిస్టు విప్లవకారులు భారత విప్లవ పంథాను రూపొందించారు. ఈ పంథా విప్లవకారులది మాత్రమే కాదు. భారత ప్రజలందరికి సంబంధించి నది. ఈ కారణం వల్లనే దీని ప్రాధాన్యతకు కూడ ప్రత్యేకత ఉంది.

విప్లవంగా అభివర్ణించలేదు, విప్లవం అనే మాట ప్రబలంగా కన్పించదు అని వరవరరావు రాసిన మాటలు ఎంత నిరాధారమో చూపడానికి ఇది చాలు. ఒక మాటగానే కాక, భావి భారత విప్లవ పంథాగా నాటి పార్టీ నాయకుడు, చరిత్ర రచయిత డి.వి. పేర్కొన్నారు. ఆయన 1948-49 కాలంలోనే కాక, 1969-70ల తర్వాత రచించిన అనేకానేక రచనల్లో ఇదే భావనను వివరించారు.

2. అజ్ఞాతంలో ఉన్న నాటి కమ్యూనిస్టులు 1952 ఎన్నికల నాటికి సాధారణ జీవితంలోకి వచ్చేసారు అని రాస్తూ (ఇది వాస్తవం కాదు. వందలాది మంది కార్యకర్తలు తర్వాత అనేక ఏళ్లపాటు రహస్యంగా కొనసాగాల్సి వచ్చింది) ఆనాడు 'గెరిల్లాలు అనే మాట కూడ అంత ప్రచారంలో లేదు' అని రాశారు. ఇది కూడ అవాస్తవమనడానికి పెద్ద పరిశోధన కూడ అవసరం లేదు. అదే గ్రంథం విషయ సూచికని చూసిన చాలు. 100 పేజీలైనా గెరిల్లా పోరాటానికి సంబంధించిన అనేకాంశాలను విమర్శనాత్మకంగా విశ్లేషించిన ఈ గ్రంథం విషయ సూచికలో- గెరిల్లా పోరాట శిక్షణ, గెరిల్లా దళాలు-దళాలే సర్వస్వమనే ధోరణి, గెరిల్లా పోరాట శిక్షణలో, ఆచరణలో లోపాలు వంటి శీర్షికలున్నాయి. వాటిల్లోని లోతైన చర్చల గురించి ఆసక్తికలవారు చదువుకోవచ్చు. కాగా వ్యాసకర్త ఇలా రాయడం 'యాదృచ్ఛికమా-సైద్ధాంతిక పరిమితియా'?

3. '1946లో చైనా మార్గమే మన మార్గమని స్ఫురించినప్పటికీ, దున్నే వారికే భూమి నినాదమిచ్చి, భూస్వాధీనం చేసుకున్నటికీ మనది కూడ నూతన ప్రజాస్వామిక విప్లవ పంథా కావాలని, పోరాట శ్రేణుల ఆచరణ అదేనని నాయకత్వానికి చైతన్య పూర్వకంగా అర్థంకాలేదు. అంటే వాళ్లందుకు సిద్ధంగా లేరు. అందుకే అది విప్లవం కాలేక పోయింది. విప్లవ పోరాటంలో పాల్గొనే శక్తులను-విప్లవకర వర్గాలను రాజ్యాధికారానికి తేవాలి. విప్లవమంటే కేవలం దున్నేవారికి భూమి అనే ఆర్థిక పోరాటం కాదు' అని రాశారు మరోచోట.

నూతన ప్రజాస్వామిక విప్లవ పంథా కావాలని నాయకత్వానికి చైతన్య పూర్వకంగా అర్థంకాలేదని; విప్లవకర వర్గాలను రాజ్యాధికారానికి తేవాలి అన్న భావన నాడు లేదని; దున్నే వారికే భూమి అనేది కేవలం ఆర్థిక పోరాటంగా సాగించారని వ్యాసకర్త అభిప్రాయం. అభిప్రాయాల చర్చనలా ఉంచి వాస్తవాలకే పరిమితమవుదాం. పైనే పేర్కొన్న 'ఆంధ్ర థీసిస్' (1948) గురించి అదే గ్రంథంలో చర్చించారు. అందులో ఇలా ఉంది.

'రెండవ పార్టీ కాంగ్రెసులో ఆమోదించిన రాజకీయ థీసిస్‌తో సమస్యలన్నీ పరిష్కారం కావడం లేదు. దీని కొరకు కొత్త మార్గం ఏదైనా ఆలోచించవలసి ఉంటుందన్న దృష్టితో తెలంగాణ పోరాట అనుభవాలను ఆధారం చేసుకొని రాష్ట్ర సెక్రటేరియట్ ఒక థీసిసును రూపొందించింది. 1948లో సుమారు ఏప్రిల్-మే నెలల్లో ఈ థీసిస్ రాయబడింది. నాటి పోరాటంలో కీలక నాయకుడైన, నాటికి సిద్ధాంత స్పష్టతను పెంచుకున్న రాష్ట్ర సెక్రటేరియట్ సభ్యుడైన డి.వి. ఆంధ్ర థీసిస్‌లోని ఆ 'కొత్త మార్గం' ఏమిటో ఇలా వివరించారు. ఇక్కడ అర్ధ వలస దేశ పరిస్థితి ఉండడం వలన చైనాలోలాగానే మనం గ్రామాలలో గెరిల్లా పోరాటాన్ని ఆర్గనైజ్ చేసి, గ్రామాలను విముక్తి చేసి, విముక్తి స్థావరాలను ఏర్పాటు చేసి, క్రమంగా పట్టణాలను విముక్తి చేసి అధికారాన్ని హస్తగతం చేసుకోవలసి ఉంటుంది. ఇది చైనా మార్గం. అది మన భారతదేశానికి కూడ వర్తిస్తుంది. తెలంగాణ మార్గం అనేది ఈ చైనా అనుభావాలకు అనుగుణ్యంగా ఉంటుంది. ఈ మార్గాన్ని అనుసరించాలని చెప్పారు'. (పేజి: 526-527) ఇది కేవలం భూమి కోసం అని కాక, 'జనతా ప్రజాతంత్ర విప్లవ స్వభావం' కలది అని, మావో రచన 'నూతన ప్రజాస్వామ్యం'ని అప్పటికే తెలుగులో కూడా ప్రచురించారని కూడా డి.వి వివరించారు. నిజానికి ఈ వివరణ అంతా డి.వి 1970లలో రాసిన సిద్ధాంత రచనలలోనే లభిస్తుంది. ఉదా:

*(... 4వ పేజీ తరువాయి)*

చాలా సూక్ష్మంగా వివరించారు. అందులో పనిచేసిన నాయకుల్ని ఎందరినో పేర్కొనలేదు. క్లుప్తీకరణతో వ్యాసాన్ని అసంపూర్తిగా ముగించారు. అసమగ్ర వ్యాసం. ప్రతి వ్యాసానికీ సూచీ గ్రంథాల లిస్ట్‌చాలా పెద్దగా ఉంటుంది. నిజంగా అవన్నీ చదివే రాశారా వీళ్లు? ఈ విధంగా పత్రికలో వచ్చిన వ్యాసాలన్నింటిపై నా అభిప్రాయాల్ని రాయాలనుకున్నాగాని అది 'చాట భారతం' అవుతుందని మానేస్తున్నాను. ఇక 120 నెలలకు గాను పది ఏండ్లకు 137 సంచికలు ఎట్లా వచ్చాయి? ప్రత్యేక సంచికలు ప్రతి నెల నెలా వచ్చే సంచికలు గాకుండా వేసినారా ఏమి? ఇది మాసపత్రిక గదా? పది ఏండ్లకు 120 సంచికలు రావడమే చాలా గొప్ప! ఎక్కడా ఏ సంచికనూ ఆపకుండా, సమయం తప్పకుండా, కనీసం వారం రోజులు లేటుగా వచ్చిన ఘటనలూ లేనేలేవు కదా! నేను ప్రథమ సంచిక 'సమీక్ష', 'ప్రజాపక్ష సమీక్ష'నో ఉచితంగా పంచి పెట్టారు హైదరాబాద్‌లో – అప్పుడు చదివాను. ఆ తర్వాత పత్రిక రెగ్యులర్‌గా వచ్చినప్పటి నుండి చందాదారుణ్ని. నలుగురైదుగురికి పత్రికలను కొని పంపించే వాణ్ని. ఇప్పుడు పది మందికి నేనే చందాలు కట్టి చదివిస్తున్నాను. కొందరైతే మా పేరున మీరు చందాలు కట్టవద్దు, మేము తెప్పించుకుంటాం. చాలా మంచి పత్రిక అంటూ పొగుడ్తూ నాకు లేఖలు రాశారు. కొందరైతే ఉచితంగా పంపిందన్న నిర్లక్ష్యమో, అనురక్తిలేకనో అసలు పత్రిక అందినట్లన్నా రాయలేదు. ఇక చదివి ఉంటారా? ఎక్కడో పారేసి ఉంటారు.

ఇక వ్యాసంలో 1970–2010 వరకు మూడు దశాబ్దాలంటారేమిటి (నలభై యేండ్లయితే). ఈ వ్యాసం 'సబ్జెక్టివ్ – ఆబ్జెక్టివ్'లకు కొత్త కొత్త అర్థాలు అన్వేషించారు. 'చలనంలో విషయాధ్యయనం' (స్టడీయింగ్ ది సబ్జెక్ట్ ఈన్ మోషన్). సైకాలజీలో సబ్జెక్టివ్ అంటే స్వీయానుభూతులు అని అంటారు. సబ్జెక్ట్ మేటర్ (విషయగతం). ఈ వ్యాసం అంతా రెండు గ్రామాల అధ్యయనం మీద కొనసాగింది. పట్టిక, ఆర్థిక అంకెలు, ఆధారాలూ, అనుబంధంగా ఇవ్వాల్సినదే గాని, వ్యాసం మధ్యలో ఇచ్చేటప్పటికి, చదివేటప్పుడు వ్యాసం కుంటు పడి, మనసు అంకెల వివరాలపై పడిపోతుంది. సీరియస్‌గా జరిగే చర్చ కాస్తా, పరిశోధనా ప్రక్రియలోకి వెళ్లిపోతుంది. నాలాంటి సాధారణ పాఠకులు వాటిని అవరోధంగా తలంచే అవకాశం ఉంది. ఏమైనా 'వీక్షణం' విహంగ వీక్షణంలాగా అంతా చూపిస్తూ, కొంత 'బాక్స్'లో భూతద్దంలో పెట్టి చూపిస్తా ఉంటుంది. ఎవరికి ఎంత నచ్చేదీ వారి శక్త్యానుసారం నిర్ణయించుకోవాల్సిందే!

**– ఎస్. హజరత్ అలీ**
*వేమూరు, గుంటూరు*

**వీ**క్షణం దశాబ్ది ప్రత్యేక సంచిక 'సంపాదకీయం' అందరి హృదయాలను తడిపి ఆవిష్కృతమైంది. నూటికి నూరుపాళ్లూ 'వీక్షణం' ప్రజల పత్రిక కాబట్టి, ఆ భావజాలమే 'వీక్షణాన్ని' పదికాలాల పాటు నిలిపి ఉంచాలనే చోదకశక్తిని – అందరిలో ఆవాహన చేసుకుంటుందని నమ్ముతున్నాను. అన్ని సెక్షన్ల వారూ ఇరుసై ఏ విధంగా ఈ పది సంవత్సరాలూ 'వీక్షణాన్ని' నిలబెడుతూ వచ్చారో, వారే, రాబోయే పది కాలాల పాటు కూడా, ద్విగుణీకృత ఎఫర్ట్స్‌తో పత్రికను నిలబెడతారని నమ్ముతున్నాను. నిలబెట్టాలని కోరుకుంటున్నాను.

'సామ్రాజ్యవాద విషఫలితాలు' శీర్షికన దాని వివిధ ఎత్తుగడలను, విష ఫలితాలను కూలంకషంగా పాఠకులతో పంచుకున్నారు రచయిత లోక సంచారి.

అయితే, ఆ వ్యాసంలోని ఉపశీర్షికలను ఒక్కటొక్కటిగా తీసుకొని 'ఇన్‌డెప్త్'గా విశదీకరిస్తూ వ్యాసాలుగా తెస్తే, చదువుకునే పాఠకులను దాటి చదివించుకొనే వేలాది పాఠకులకు చేరుతుందని అభిప్రాయపడుతున్నాను. వారా విధంగా వ్యాస రచనకు పూనుకుంటారని ఆశిస్తున్నాను. 'దశాబ్ది ప్రత్యేక సంచిక' వ్యాసాలన్నీ పరిణితి కలిగి, సమర్థవంతంగా, డాటాతో సహా గత చరిత్రనంతా క్లుప్తీకరిస్తూ విజువలైజ్ చేశారు రచయితలు. నూటికి 90 శాతం పీడిత ప్రజారాశులను, ముఖ్యంగా యువతను, అందులోనూ అతి ముఖ్యంగా విద్యార్థులను అవి ప్రభావితం చేసేవిగా ఉన్నాయి. పాతతరం వారు గత చరిత్రను ఒకమారు నెమరు వేసుకోవడానికి, కొన్ని తెలియని విషయాలు తెలుసుకోవడానికి కూడా అవి ఉపకరించేవిగా ఉన్నాయి. ఆయా వ్యాస రచయితలందరికీ పేరు పేరునా నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

అనుకున్నట్టుగానే 'దశాబ్ది ప్రత్యేక సంచిక' పది కాలాలపాటు దాచుకో దగినదిగా ఉన్నది. ఇందుకు సంపాదకులను, సంపాదక – ఉద్యోగవర్గాల్ని మనస్ఫూర్తిగా అభినందిస్తూ కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ముఖ్యంగా ఎన్నో కష్టనష్టాల్ని ఓర్చుకుంటూ, ఏ నెలా 'మిస్' కాకుండా, ప్రతి నెలా అనుకున్న తేదీకి మెయిల్ చేస్తున్నందుకు పాఠకుల తరఫున వారికి మరొక మారు కృతజ్ఞతలు.

**– జి. సూరి**
*మల్కాజ్‌గిరి, హైదరాబాద్*

**వీ**క్షణం పది సంవత్సరాలు పూర్తి చేసుకున్నందుకు కారకులైన సంపాదక వర్గంకు పేరు పేరునా ప్రత్యేక అభినందనలు, వీక్షణంకు రచనలు పంపిస్తున్న రచయితలకు, పాఠకులకు అభినందనలు తెలియచేస్తున్నాను. దశాబ్ది ప్రత్యేక సంచికలో సంపాదకీయం చదివినప్పుడు ఎన్ని ఒడుదుడుకులు ఎదుర్కొందో దానిని ప్రచురించడానికి ఎన్ని కష్టాలు పడిన తీరు తెలుస్తుంది. ప్రజలకు ఒక నిజమైన రాజకీయార్థిక సామాజిక పత్రికను అందచేయాలన్న మీ తపన మీ ఆలోచన మీరు నిర్వర్తించిన తీరు వేలాది మందికి ఆదర్శంగా నిలుస్తుంది. ఈ రోజు వేలాది మంది అభిమాన చైతన్య పత్రికగా నిలిచింది. సమాజంలోని అసమానతలు సామ్రాజ్యవాద దోపిడీని భారత పాలకవర్గాల ప్రజా వ్యతిరేక విధానాలను ఎప్పటికప్పుడు అధ్యయనాలు చేసి రాస్తున్న తీరు ఎంతో బాగుంది. నేను ప్రత్యేకంగా ఏ వ్యక్తి కలిసిన వీక్షణం చదువుతున్నారా? అని అడగడం నాకు ఊతపదం అయింది. వీక్షణం పత్రికను ఇలా ప్రజల దగ్గరకు తీసుకపోయెందుకు ఎప్పుడు ప్రయత్ని స్తుంటాను. ఈ నెలలో వచ్చిన వరవరరావు రాసిన 'ప్రత్యామ్నాయ చరిత్ర నిర్మాణంలో విప్లవోద్యమం' స్పార్టకస్ కాలం నుండి ప్యారిస్ కమ్యూన్, బోల్షిక్ విప్లవం, చైనా సాంస్కృతిక విప్లవం తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం, నేపాల్ మావోయిస్టు పార్టీ విఫలం గురించి 1857 భారత ప్రజల మొదటి తిరుగుబాటు నుండి బాగా రాశారు. ప్రపంచంలో జరిగిన పోరాటాలను, వాటి జయ అపజయాలను చాలా క్లుప్తంగా వివరించిన వరవరరావుకి వందానాలు తెలియచేస్తున్నాను. వీక్షణంలోని ప్రతి అక్షరం ప్రజల అక్షరం, ప్రజా చైతన్య అక్షరాలు ఎత్తిపట్టే పుస్తకం వీక్షణం. చదువుతో జ్ఞానం, జ్ఞానంతో పోరాటం చేయండి.

**– అక్కనపెల్లి దుర్గేష్**
*ఎం.టి.ఎస్.వి. ముంబాయి*

వీ

---

1974లోనే సుందరయ్యగారి తెలంగాణ పుస్తకంపై విమర్శగా రాసి ఇంగ్లిషు, తెలుగుల్లో ప్రచురించిన 'భారత విప్లవ పంథాను చూపిన తెలంగాణ సాయుధ పోరాటం' అన్న పుస్తకంలోనే వివరించారు. కాబట్టి ఆనాడు భూపోరాటాన్ని ఆర్థిక వాదంతో అర్థం చేసుకున్నారని, రాజ్యాధికార సమస్యను లేవనెత్తలేదని, నూతన ప్రజాస్వామిక విప్లవ భావన ఆనాడు లేదని, వరవరరావు రాసినది గ్రంథస్తమై ఉన్న చారిత్రక వాస్తవాలతో పొసగదు. ఈ వాస్తవాలను పరిశీలించకుండా వ్యాసకర్త ఇలాంటి సీరియస్ విషయాల గురించి రాయడం దుస్సాహసమే అని చెప్పాలి. తెలంగాణ విప్లవ వారసత్వం గురించి రాసిన వారు సంపాదకులుగా ఉండి ఇలాంటి రచనను ప్రచురించడాన్ని ఏమని అర్థం చేసుకోవాలి. వ్యాసకర్త మాటల్లోనే– 'ఇది యాదృచ్ఛికమా–సైద్ధాంతిక పరిమితియా'? అనే ప్రశ్నకు సమాధానం వారే చెప్పాలి. వారికి సిద్ధాంత– ఉద్యమపరంగా ఉన్న పూర్వరంగం దృష్ట్యా చూస్తే ఒకటి కన్పిస్తుంది: చారు మజుందార్, నాటి ఎం.ఎల్. పార్టీ అతివాద ప్రభావంలో నాటి తెలంగాణ పోరాటం గురించి ఇలాంటి అభిప్రాయాలు కలిగి ఉండేవారు. ఆ తర్వాత కాలంలో నాటి తెలంగాణ గురించి చాలా సమాచారం, డాక్యుమెంట్లు లభ్యమైనాయి. అయినా ఇప్పటికీ ఆ ప్రభావంలోనే ఉన్నవారూ, చారిత్రక వాస్తవాలను చూడదల్చన వారూ, మారకుండా ఉన్నవారూ ఉన్నారు. వ్యాసకర్త ఆ కోవకు చెందినవారే అనుకోవాలి. అభిప్రాయాలు, సిద్ధాంతాలు ఎలా ఉన్నా, చారిత్రక వాస్తవాలను గుర్తించడం అవసరం. సిద్ధాంత వివాదాల్లోకి పోకుండా, కొన్ని వాస్తవాలను ఎత్తి చూపడానికి ఈ వ్యాఖ్య పరిమితం. ఇలాంటి మౌలిక వాస్తవాలను విస్మరించి రాయడం ఆశ్చర్యం కల్గిస్తుంది. తప్పుడు సమాచారంతో కూడిన ఈ వ్యాసం వీక్షణం దశాబ్ది ప్రత్యేక సంచికలో రావడం విచారకరం. వేరు తెలంగాణ ప్రవాహంలో పడి, విప్లవ తెలంగాణ మూలాల్ని మరవడం, మరిపించడం నేటి విషాదం.

*(ఈమెయిల్ ద్వారా అందినది. రచయిత వివరాలు తెలుపలేదు)* వీ

# వెళిపోయిన ఆరుగు మిత్రులు

డిసెంబర్ – జనవరి నెల రోజుల్లో వీక్షణంకు, సామాజిక ఉద్యమాలకు ఆత్మీయులైన ఆరుగురు ప్రజానుకూల ఆలోచనాపరులు, రచయితలు, కార్యకర్తలు మరణించారు. వారందరూ వ్యక్తిగతంగా నాకు చిరకాల సన్నిహిత మిత్రులు, ఎన్నో ఆలోచనలు, వేదికలు పంచుకున్న వారు. సమాజం కోసం ఎంతో చేసినవారు, ఇంకా ఎంతో చేయగలిగిన వారు.

డిసెంబర్ 23న మరణించిన పి. నాగభూషణం (1935–2012) పినాకపాణి పేరుతో ఎన్నో రచనలు చేశారు. కృష్ణా జిల్లాలో కమ్యూనిస్టు రాజకీయాల ప్రభావం బలంగా ఉన్న కుటుంబంలో పుట్టి, 1950ల నుంచీ కూడ మార్క్సిస్టు భావజాల రంగంలో కృషి చేస్తున్నారు. తత్వశాస్త్రం, విజ్ఞానశాస్త్రాలు, మార్క్సిజం లోతుగా అధ్యయనం చేశారు, బనారస్ విశ్వవిద్యాలయంలో గణితశాస్త్రంలో ఉన్నతవిద్య పూర్తిచేసి, హైదరాబాద్ లో అకౌంటెంట్ జనరల్ ఆఫీసులో అధికారిగా స్థిరపడ్డారు. నక్సల్బరీ మేఘగర్జనతో ప్రభావితులై అప్పటినుంచి నక్సల్బరీ పంథా రాజకీయాల సానుభూతిపరుడిగా ఉన్నారు. విప్లవ రచయితల సంఘం ఏర్పడిన 1970 జూలై 4న ఆ ఆవిర్భావ పత్రం మీద సంతకం చేసిన వారిలో ఉన్నారు. తన రచనల ద్వారా, చర్చల ద్వారా సామాజిక ఉద్యమాలకు, విప్లవోద్యమాలకు, ప్రగతిశీల భావాల ప్రచారానికి తన శక్తి సామర్థ్యాలను వెచ్చించారు. ఆయన కవితలు, అనువాదాలు, వ్యాసాలు కలిపి 'స్వేచ్ఛకోసం...' సంపుటం 1999లో వెలువడింది. వీక్షణం తొలి సంచిక నుంచి, మరణానికి వారం ముందు వీక్షణం కార్యాలయానికి వచ్చి చర్చించిన దాకా వీక్షణంకు నిశితమైన పాఠకుడిగా, శ్రేయోభిలాషిగా ఉన్నారు. ఆయన మరణంతో వీక్షణం ఒక విలువైన విమర్శనాత్మక మిత్రుణ్ని కోల్పోయింది.

ఉపాధ్యాయ ఉద్యమ నాయకుడిగా సుప్రసిద్ధులైన మార్పు బాలకృష్ణమ్మ (1930–2013) జనవరి 6న మరణించారు. శ్రీకాకుళం జిల్లా కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలలో ఒకరయిన మార్పు పద్మనాభం కొడుకుగా మాత్రమే కాక, స్వయంగా విప్లవోద్యమంలో, ఉపాధ్యాయ ఉద్యమంలో బాలకృష్ణమ్మ అపారమైన కృషి చేశారు. పార్వతీపురం కుట్రకేసు నిందితుడిగా రెండు సంవత్సరాలు జైలుశిక్ష అనుభవించారు. ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ (ఎపిటిఎఫ్) రాష్ట్ర అధ్యక్షులుగా పనిచేశారు. ఉపాధ్యాయ నియోజకవర్గం నుంచి రాష్ట్ర శాసనమండలి సభ్యుడిగా రెండు సార్లు ఎన్నికయ్యారు. రాజకీయ, వ్యక్తిగత కారణాలతో ఎపిటిఎఫ్ నుంచి వేరయి ఎపిటిఎఫ్ 1938 అనే పేరుతో మరొక ఉపాధ్యాయ సంఘాన్ని స్థాపించారు.

సమతారావుగా అనే కలం పేరుతో, కవిగా, బాల రచయితగా అందరికీ తెలిసిన చావలి రామచంద్రరావు (1926–2013) జనవరి 7న మరణించారు, గుంటూరు జిల్లాకు చెందిన సమతారావు పద్నాలుగో ఏట కాంగ్రెస్ లో చేరి, జాతీయోద్యమంలో ప్రవేశించిననాటి నుంచి, విప్లవోద్యమాల సానుభూతి పరుడిగా మరణించేదాకా ఆయనది విస్తృతమైన సామాజిక జీవితం. కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ, విద్యార్థి ఫెడరేషన్, కమ్యూనిస్టు పార్టీ, హోటల్ వర్కర్స్ యూనియన్, పుస్తకాల దుకాణం, అభ్యుదయ రచయితల సంఘం, చేనేత కార్మిక సంఘం, ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్, గ్రంథాలయోద్యమం, బాల సాహిత్యం, అనువాదాలు, జనసాహితి, విప్లవ రచయితల సంఘం వంటి ఎన్నో మజిలీలతో, సంబంధాలతో సాగిన సుదీర్ఘ ప్రగతిశీల జీవితాచరణ ఆయనది. క్రాంతి పూలు, వెలుగు పూలు బాలగేయ సంపుటాలతో పాటు ఎన్నో పుస్తకాలు ప్రచురించారు.

జనవరి 22న హైదరాబాదులో మరణించిన భువనగిరి చంద్రశేఖర్ (1962–2013) గుంటూరు జిల్లా మాచెర్లలో రాడికల్ విద్యార్థి సంఘం కార్యకర్తగా, విప్లవ రచయితల సంఘం సభ్యుడిగా తన సామాజిక జీవితాన్ని ప్రారంభించారు. చదువరిగా, విశ్లేషకుడిగా, ప్రతిభావంతుడైన ఉపన్యాసకుడిగా తొలిరోజుల్లోనే ఎందరి అభిమానాన్నో చూరగొన్నారు. ఆ తర్వాత గుంటూరులో న్యాయవాద వృత్తిలో ప్రవేశించి మొదట పౌరహక్కుల సంఘం లోను, ఆ తర్వాత మానవహక్కుల వేదిక లోను విస్తృతమైన కృషి చేశారు. చిలకలూరిపేట బస్సుదహనం కేసులో చలపతి, విజయవర్ధనరావుల ఉరిశిక్షకు వ్యతిరేకంగా పోరాడి విజయం సాధించారు. చుండూరు హత్యాకాండ కేసులో నేరస్తులకు శిక్ష విధింపజేయడంలో విజయం సాధించారు. పోలీసు అధికారుల హింసాకాండ మీద, అత్యాచారాల మీద నిరంతర పోరాటం నడిపారు. అమెరికాలో మరణశిక్షకు గురైన శాక్కో, వాంజెట్టీల గాథకు అక్షరరూప మిచ్చారు. వరల్డ్ సోషల్ ఫోరం సందర్భంగా ఎన్జీవోల కథ అనే విమర్శనాత్మక విశ్లేషణ రాశారు. ఎన్నో పత్రికలలో వందలాది వ్యాసాలు రాశారు. చివరి రోజుల్లో పౌరహక్కుల దృక్పథం ఆధునికతలో భాగం గనుక తాను అంగీకరించనని ప్రకటించి, ఆధునికానంతర వాదంలోకీ, ఆధునిక పూర్వ స్థితికి వెళ్లిపోవాలనే వాదనలోకీ వెళ్లి మతాచారాలను, దైవప్రార్థనను ప్రారంభించారు. అయినా యాభై సంవత్సరాల జీవితంలో ఇరవై ఐదు సంవత్సరాలకు పైగా ప్రజా ఉద్యమాలకు ఆయన అందించిన సేవలు ప్రశంసనీయమైనవి.

పశ్చిమ గోదావరి జిల్లాకు చెందిన పరకాల పట్టాభిరామారావు (1920–2013) జనవరి 23న విజయవాడలో మరణించారు. జాతీయోద్యమంలో, కమ్యూనిస్టు ఉద్యమంలో సామాజిక జీవితం ప్రారంభించిన పట్టాభి, ఎక్కడా పత్రికారచన అభ్యసించకుండానే, కేవలం ఉద్యమానుభవాలు తీర్చిదిద్దిన రచయితగా, పాత్రికేయుడిగా స్థిరపడి ఆరు దశాబ్దాలకు పైగా ప్రజాశక్తి, విశాలాంధ్ర, కమ్యూనిస్టు వంటి పత్రికలలో పనిచేశారు. జాతీయోద్యమ కాలంలో అజ్ఞాతవాసంలోను, జైలులోను ఎన్నో సంవత్సరాలు గడిపారు. విశాలాంధ్ర దినపత్రికలో నలభై సంవత్సరాలు, కమ్యూనిజం మాసపత్రికలో పది సంవత్సరాలు పని చేసిన పట్టాభి ముప్పైకి పైగా పుస్తకాలు రచించారు.

ఆంధ్రజ్యోతి వంటి ప్రధాన స్రవంతి పత్రికలలోను, ప్రజాపంథా వంటి విప్లవ పత్రికలలోను పనిచేసిన సీనియర్ పాత్రికేయులు కొల్లి సత్యనారాయణ (1920–2013) హైదరాబాదులో జనవరి 26న మరణించారు. కృష్ణా జిల్లాకు చెందిన కొల్లి సత్యనారాయణ కమ్యూనిస్టు ఉద్యమ ప్రభావంలో విశాలాంధ్ర, జనశక్తి పత్రికలోను, ఆంధ్రజ్యోతి, ఉదయం, ఆంధ్రప్రభలలోను సుదీర్ఘకాలం పాత్రికేయుడిగా పనిచేశారు. పదవీ విరమణ తర్వాత కూడ విప్లవోద్యమ పత్రికలలో రచనలు చేయాలనే ఆకాంక్షతో సిపిఐ (ఎంఎల్) న్యూ డెమోక్రసీ కార్యకర్తగా చేరి, పార్టీ రాష్ట్ర కార్యాలయంలో గ్రంథాలయ నిర్వహణ బాధ్యతలు, ప్రజాపంథా పత్రికకు రచనలు, అనువాదాలు చేశారు. చైనా, వియత్నాం విప్లవానుభవాలకు సంబంధించిన నవలలు, కథలు, నాటకాలు ఎన్నో అనువదించారు. స్వతంత్రంగానూ, అనువాదంలోనూ ఎన్నో సైద్ధాంతిక రచనలు వెలువరించారు. వీక్షణంకు ఎన్నో వ్యాసాలు రాశారు. యువకులకన్న ఎక్కువగా చివరివరకూ విప్లవస్ఫూర్తితో జీవితం సాగించారు.

ఈ ఆరుగురు మిత్రులకూ వీక్షణం తరఫునా, వ్యక్తిగతంగానూ కన్నీటితో జోహార్లు చెపుతున్నాను.

**- ఎన్. వేణుగోపాల్** వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 డిసెంబర్ నుండి 31 డిసెంబర్ 2012 వరకు 16 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1631)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| **(1)** | **(2)** | **(3)** | **(4)** | **(5)** | **(6)** | **(7)** | **(8)** | **(9)** | **(10)** | **(11)** | **(12)** | **(13)** | **(14)** | **(15)** | **(16)** | **(17)** | **(18)** | **(19)** | **(20)** | **(21)** | **(22)** |
| ఆదిలాబాద్ | – | 2 | – | 16 | 14 | 2 | 2 | 1 | – | – | 2 | 2 | – | – | 14 | 26 | – | – | – | 1 | – |
| హైదరాబాద్ | – | – | – | 8 | 6 | – | – | – | 1 | 4 | 3 | 9 | – | – | 23 | 22 | – | – | – | 10 | – |
| నల్గొండ | – | 9 | 1 | 9 | 11 | 2 | 1 | 1 | – | 4 | 2 | 3 | 1 | 9 | 61 | 26 | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | – | 8 | – | 13 | 10 | 9 | 11 | 6 | 3 | 8 | 9 | 13 | 22 | 17 | 55 | 6 | – | – | – | – | – |
| మెదక్ | 1 | 8 | – | 8 | 6 | 3 | 8 | 1 | 4 | – | 2 | 2 | 1 | 5 | 49 | 19 | – | – | – | – | – |
| నిజామాబాద్ | – | – | – | 4 | 19 | 6 | 2 | 3 | – | 5 | 9 | 5 | 2 | 2 | 15 | 13 | – | – | – | – | – |
| రంగారెడ్డి | 1 | – | – | 17 | 15 | 4 | 10 | – | 4 | 2 | 6 | 3 | 2 | 2 | 40 | 6 | – | – | – | – | |
| వరంగల్ | – | 4 | – | 12 | 9 | 6 | 9 | 6 | 1 | 1 | – | – | 1 | 22 | 32 | 19 | – | – | – | – | 5 |
| కరీంనగర్ | – | 2 | 3 | 4 | 7 | 8 | 12 | 7 | 2 | 4 | 5 | 7 | – | 2 | 17 | – | – | – | – | – | – |
| ఖమ్మం | – | 9 | – | 4 | 6 | 2 | 5 | 4 | – | 2 | 3 | 4 | 4 | 3 | 30 | 6 | – | – | – | – | – |
| అనంతపూర్ | – | 7 | 1 | 13 | 7 | – | 1 | – | 3 | 2 | 2 | 5 | – | 3 | 33 | 3 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 2 | 2 | – | – | – | 1 | 2 | 1 | – | 3 | 19 | 12 | – | – | – | – | – | – |
| కర్నూలు | – | 3 | – | 7 | 4 | 5 | 3 | 5 | 4 | 7 | 5 | 8 | 6 | 4 | 23 | 28 | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 8 | 7 | 13 | 12 | – | 12 | 9 | 2 | 4 | 8 | 4 | 35 | – | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | – | 3 | 13 | 3 | 3 | 1 | – | 8 | 4 | 2 | 6 | 1 | 25 | 29 | – | – | – | 9 | – |
| విజయనగరం | – | – | – | 6 | 4 | 3 | 5 | 6 | 3 | 6 | 4 | 3 | 3 | – | 24 | – | – | – | – | – | 6 |
| **మొత్తం** | **2** | **52** | **5** | **134** | **140** | **66** | **84** | **41** | **38** | **64** | **59** | **70** | **59** | **76** | **495** | **215** | **–** | **–** | **–** | **20** | **11** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

## ఆర్థిక వ్యవస్థ – సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| మీరు–నేను–ఆర్థికం | వి. హనుమంతరావు | రు. 60 |
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | 50 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం – ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| ఒక ప్రేతాత్మక కథ | అరుంధతీ రాయ్ | 25 |
| రాజ్యం – సంక్షేమం | కె. బాలగోపాల్ | 100 |

## తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |

## శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ – పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం – సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

## కులం–మతం

| | | |
|---|---|---|
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్‌సి, ఎస్‌టి నిధులు, విధిలింపు - మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్‌సి, ఎస్‌టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు – రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు – ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు – అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు – మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దళిత | కె. బాలగోపాల్ | 120 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందూవు నెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

## సాహిత్య విమర్శ – వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| పరామర్శ | నల్లూరి రుక్మిణి | 80 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |

## చరిత్ర–జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 100 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |

| | | |
|---|---|---|
| కన్నబీరన్ | వ్యాస సంకలనం | రు. 50 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| ఒక సెక్స్ వర్కర్ ఆత్మ కథ | నళినీ జమీలా | 50 |
| పరాయి పాలనను ఎదిరించిన ఝాన్సీ | మహాశ్వేతాదేవి | 150 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| పరిచయాలు | ఎన్. వేణుగోపాల్ | 50 |
| నా ప్రజాజీవితం | పెండ్యాల రాఘవరావు | 50 |
| ఆర్.ఎస్.రావు స్మృతిలో | వ్యాస సంకలనం | 50 |
| నడుస్తున్న దారి | వ్యాస సంకలనం | 50 |
| హక్కుల బాటసారి | బుర్ర రాములు రచనలు | 50 |
| నిగాహ్ | కె. బాలగోపాల్ వ్యాసం సంకలనం | 200 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |

## విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| ధ్వంసమైన స్వప్నం | అరుంధతీ రాయ్ | 75 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| లాంగ్‌మార్చ్ | తెలంగాణ జర్నలిస్టుల సంకలనం | 100 |
| జనహృదయం జనార్దన్ | సూరపనేని మోహనరావు | 60 |

## కథ – నవల

| | | |
|---|---|---|
| గంగానమ్మ | విజయ | 15 |
| గుమ్మెటమోత | పాణి | 100 |
| గదిలోపలి గోడ | పలమనేరు బాలాజి | 60 |
| రుదాలి | మహాశ్వేతాదేవి | 45 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| చంద్రగిరి శిఖరం | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 50 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| నేల నాగలి – మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగ్తాయి | 100 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| అజేయుడు | అలెగ్జాండర్ ద్యూమా | 160 |
| ఘంటారావం | విక్టర్ హ్యూగో | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| చేగెవేరా | కాత్యాయని | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |

## తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టాస్ పబ్లికేషన్స్ | 50 |

| | | |
|---|---|---|
| **Fifty Years of Andhra Pradesh (1956-2006)** | | 300 |
| **Towards Understanding Semi Feudal - Semi Colonial Society** | R.S. Rao | 300 |
| **In search of Method** | Mudunoori Bharathi | 200 |
| **Individual Sub-groups, Groups and Freedom** | Mudunoori Bharathi | 75 |
| **Crisis and Development in Marxian Framework** | Mudunoori Bharathi | 80 |
| **Methodoly of Social Enquiry** | Mudunoori Bharathi | 150 |
| **On Education** | Mudunoori Bharathi, R.S. Rao | 100 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email: veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 139 -February 2013 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 28/1/2013 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao